





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

## భారత రమణీమణులు-స్త్రీ రత్నముల చరిత్రలు- 1 , 2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004405/25

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు

# భా ర త ర మ ణీ మ ణు లు

## స్త్రీరత్నములచరిత్రలు

బ్రహ్మశ్రీ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రికృతము

## మొ ద టి భా గ ము



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే

ప్ర క టి త ము.

1949

# విషయసూచిక

విషయసూచిక





శ్రీ ర స్తు.

# భారతరమణీమణులు



## సావిత్రీదేవి

అశ్వపతి అనురాజు మద్రదేశమును పాలించుచుండెను. అతఁడు చాల బుద్ధిమంతుఁడును, బలవంతుఁడును, ధర్మమే జయము అని నమ్మియున్నవాఁడును అగుటవలన మద్రదేశము నందలి ప్రజలు ఎల్లరును జాలసుఖపడుచుండిరి. అతఁడు "ఇంత మంచిరాజు ఇఁక లోకములో నుండఁ" డని పేరు పొందెను. ఆతని రాణిపేరు మాళవి. ఆమె గూడఁ జాల సుగుణురాలు. ఆమె భర్తకుఁ దగినభార్య. ఆతఁడును ఆభార్యకుఁ దగినభర్త. వారు ఇరువురును కలలోఁ గూడ పొరపొచ్చెములు లేక హాయిగా కాలము గడుపుచుండిరి.

దేనికినిలోపములేదుగాని పాపము! వారికి బిడ్డలుమాత్రము కలుగలేదు. బిడ్డలులేనిదంపతులకు ఇఁక ఎన్నిభాగ్యములు ఉండినను ఏమి లాభము? ఈ లోపమువలన వారి సుఖము అంతయు కష్టముగను సంతోషము అంతయు విచారముగను మాఱిపోవుచుండెను. వారు అనేక వ్రతములు చేసిరి. అనేక దానములు చేసిరి. వారు చేయనిధర్మములేదు. జలకమాడని నది లేదు. మ్రొక్కని దేవత లేదు. అయినను ఏమి లాభము? ఇన్ని చేసినను వారికి సంతానము గలుగలేదు.

తుదకు అశ్వపతి ఇట్టి వ్రతములును దానధర్మములును ఎన్ని చేసినను ఫలము లేదని నిశ్చయించుకొని, సావిత్రీ దేవిని గుఱించి ఘోరముగఁ దపస్సుప్రారంభించెను. అతఁడు అట్లు అతి నిష్ఠతో ఆతపస్సు పదునెనిమిది ఏండ్లుచేసెను. అప్పటికి సావిత్రి దేవికి అతనిమీఁద అనుగ్రహము గలిగెను. వెంటనే ఆ దేవి ప్రత్యక్షమై "వత్సా! నీకు ఏమి కావలయునో కోరుకొనుము" అని చెప్పెను.

అప్పుడు అశ్వపతికిఁ గలిగిన ఆనందము ఇంత అని ఎవరు చెప్పఁగలరు? అతఁడు అట్లు తన్ను అనుగ్రహింపవచ్చిన సావిత్రీ దేవికి సాష్టాంగనమస్కారములుచేసి ఆమెను అనేకవిధముల స్తోత్రముచేసి ఆమెను ఆనందింపఁజేసి పుత్త్రుఁడు కలుగునట్లు వరము ఇమ్మని ప్రార్థించెను. సావిత్రీ దేవి 'నీకు కొమార్తెకలుగు' నని చెప్పెను. అప్పుడు అశ్వపతి సావిత్రీ దేవికి మరల నమస్కారముచేసి "అమ్మా! కోరినవరము ఇచ్చెద నంటివి. నేను కుమారునిఁగోరఁగా నీవు కూఁతురు నిచ్చితివి, ఇదియేమి న్యాయము?" అని అడిగెను, "రాజా! అందులకు నీవు మఱియొకరీతిని దలంప వలదు. ఒకప్పుడు నీతపస్సునుగుఱించి బ్రహ్మదేవునితో ముచ్చటింపఁగా అతఁడు నీకు కొమార్తను ఇచ్చుటకు నిశ్చయించెను. బ్రహ్మదేవుని నిశ్చయమునకు ఇంక అడ్డు లేదు. అది అట్లు జరిగి తీరవలసినదియే కాని నీవు విచారింపవలదు. ఆకూఁతురు కారణమువలన నీకు మఱియొకవిధముగా మఱియొకప్పుడు నూర్గురు కుమారులు కలుగఁగలరు. సంతోషముతో ఉండుము" అని చెప్పి సావిత్రీ దేవి అంతర్ధాన మయ్యెను.

పిదప స్వల్పకాలముననే మాళవి గర్భమును దాల్చెను. ఈ సంగతివిని లోకులు ఎల్లరును ఆనందించిరి. నవమాసములు నిండినతరువాత నొకనాఁడు శుభమహూర్తమున మాళవి కొమార్తను గనియెను. అప్పుడు పువ్వులవాన గురిసెను. దేవదుందుభులు మ్రోగెను. ఆకన్నియ సావిత్రీదేవి దయవలన పుట్టినది గావున అశ్వపతి ఆమెకు సావిత్రీదేవి అని పేరు పెట్టెను.

లేకలేక కలిగిన ఆ బిడ్డను అశ్వపతియు మాళవియు పూవులలోఁ బెట్టి అల్లారుముద్దుగఁ బెంచుకొనఁదొడఁగిరి. క్రమక్రమముగ సావిత్రికి బాల్యము కడచెను. యౌవనము పొడచూపెను. ఆమె వయస్సుతోఁ గూడ బుద్ధియుఁ, బెద్దలయెడల వినయవిధేయతలును, తల్లిదండ్రులయెడల భక్తిగౌరవములును లోకజ్ఞానమును, మంచిచెడ్డలను ఏర్పఱించుకొనువివేకమును, చాపల్యమును అడంచుకొనునిగ్రహమును, ఎల్లరను దనయెడల స్నేహగౌరవములు గలవారినిఁగాఁ జేసికొను చాతుర్యమును, మాటల చక్కఁదనమును, విద్యలయందు ప్రవేశమును గూడ వృద్ధి కాఁజొచ్చెను. మఱియు ఆమెకు యౌవనమువచ్చినకొలఁదిని తల్లిదండ్రులకు ఈమెకుఁ దగిన పెండ్లికొడుకు నెక్కడ తేఁగల మను ఆందోళనము గూడ పెరిఁగిపోవుచుండెను. ఇట్లుండఁగా సావిత్రీదేవి, సాళ్వపతి యగుద్యుమత్సేనునికుమారుఁడు సత్యవంతుఁడు అందగాఁడనియు, సుగుణవంతుఁడనియు, దనకుఁ దగినవాఁడు అనియు విని అతనిని మనస్సునందు భర్తగా వరించెనుగాని సిగ్గువలన ఆవిషయమును ఏరికినిఁదెలియకుండ దాఁచి పెట్టెను.

ఇట్లుండఁగా నొకనాఁడు అశ్వపతికడకు నారదమహర్షి వచ్చెను. ఇట్లు వచ్చిన నారదునకు అశ్వపతి తగినమర్యాదలు చేసి ఆతనితో మంచిమంచివిషయములను గుఱించి మాట్లాడు చుండఁగా, చెలికత్తెలతోఁగూడుకొని ముచ్చటలాడుచు సంతో షముతో సావిత్రి అచ్చటకు వచ్చెను. అశ్వపతి నారదునితో మాట్లాడుచుండుటఁ జూచి చెలికత్తెలు అచ్చటచ్చట నిలిచి పోయిరి,గాని సావిత్రి మాత్రమునిలువక వడివడిగవచ్చి తండ్రికి మ్రొక్కెను. వెంటనే రాజు అత్యంతప్రేమతో కుమారికను గ్రుచ్చియెత్తి తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని లాలింపఁదొడఁ గెను. అది చూచి నారదుఁడు "రాజా! నీకూఁతురు సావిత్రి యౌవనమువలన చక్కగా ప్రకాశించుచున్నది. ఈమెకుఁ దగిన వరునిఁ జూచి పెండ్లిచేయక ఇంకను అట్లుంచినాడ వేమి?" అని యడిగెను.

అప్పుడు రాజు పుత్రికను జూచి "తల్లీ! అనేకవిధములఁ బ్రయత్నములం చేసితిని; గాని నీకు తగిన భర్త నాకు ఎందును గాన్పింపలేదు. విద్యయందును. రూపమునందును, గుణము నందును చక్కని రాకొమరుఁడు నాకు ఒక్కఁడును గాన్పింప లేదు. ఇఁక ఆపని నావలనఁ గానేరదు. నీవును వివేకవంతురా లవు. నీ మనస్సునకు వచ్చిన రాకుమారుని వరింపుము" అని చెప్పెను. అది విని సావిత్రి తొలుత సిగ్గుపడియెను;గాని తాను ఊరకున్నచో తన తండ్రి సత్యవంతునిఁ గాక మఱియొకనిని నిశ్చయించునేమో యనుభయంబునను, సత్యవంతుని మీఁది ప్రేమ త్వరపెట్టుటవలనను, సాహసించి "తండ్రీ! సాళ్వభూపతి కుమారుఁడగుసత్యవంతుని నేనువరించితిని.సాళ్వభూపతి ఇప్పుడు

దైవయోగమువలన కన్నులు లేక రాజ్యమును గోలుపోయి భార్యతోడను, కుమారునితోడను అరణ్యమున నున్నవాఁడు. ఎట్లయినను నన్ను సత్యవంతునకు ఇచ్చి వివాహము సేయుము” అని చెప్పెను.

అది విని అశ్వపతి నారదునిఁ జూచి “మునీంద్రా! మూఁడు లోకములయందును నీకుఁ దెలియనిది ఏమియు లేదు. సత్యవంతుని నేను ఎప్పుడును జూచి యెఱుఁగను. ఆతనిని గుఱించి ఎప్పుడును వినియు ఉండలేదు. సావిత్రి చేత వరింపఁబడిన ఆతని గుణమును, రూపమును, స్వభావమును వివరించి చెప్పుము” అనియెను అశ్వపతి అడుగుట తడవుగా నారదుఁడు ‘రాజా! సత్యము పలుకుటవలన ఆతఁడు సత్యవంతుఁడు అని పేరుపొందెను. చిత్రాశ్వుఁడు అని గూడ అతనికిఁ బేరు గలదు. ఆతఁడు తేజస్సున సూర్యునితోడను, బుద్ధిని బృహస్పతితోడను, శూరత్వమున దేవేంద్రునితోడను, ఓర్పున భూదేవితోడను, గాంతియందు చంద్రునితోడను సమానుఁడు. సౌందర్యమున అశ్వినేయులను మించును. తపము, శమము, దమము, దానము, బ్రాహ్మణులయందు భక్తి, గొప్ప ప్రభావము, అతనియందే కలవు. కాని వీనిని అన్నిటిని కప్పవేయు ఒక్క కీడుమాత్రము అతనియందుఁ గలదు. అది ఏమి అందువా? నేడు మొదలుకొని ఒక్క సంవత్సరమునకు అతఁడు మృతిఁ బొందును, ఇప్పుడు ఈ విషయము నీకు అవశ్యము చెప్పవలసినది గావునఁ జెప్పితిని’ అని చెప్పి ఊరకుండెను.

ఇది యంతయు విని అశ్వపతి గడగడలాడి సావిత్రినిఁ జూచి ‘బిడ్డా! సంవత్సరమునకు చనిపోవువానికి ఎన్నిసుగుణ

ములు ఉండిన నేమి? ఎంత సౌందర్యము ఉండిన నేమి ? నారద మహర్షికిఁ దెలియనివిషయములు లేవు. ఈతఁడు అన్నమాట ఎప్పుడును అసత్యము గాదు. కావున మఱియొకవరుని ఎన్ను కొనుము' అని చెప్పెను.

ఈమాట సావిత్రికి చాల కష్టముగాతోఁచెను. 'తండ్రీ! మనస్సు, మాట, శరీరము అనుమూఁడింటి యందును మనస్సు ప్రధానము. సత్యవంతుని నేను మనస్సున భర్తగా వరించితిని. ఇఁక మఱియొకనినిఁ బెండ్లియాడఁదగునా? ఏది ఎట్లు అయినను నేనుమఱియొకనిని వివాహ మాడఁజాలను' అని సావిత్రి ఊరకుండెను. అప్పుడు తనదెసకు చూచిన అశ్వపతికి నారదుఁడు 'రాజా! నీ ముద్దుకూఁతురు సుగుణరాశి; ఆమె నిశ్చయము మాన్పశక్యముగాదు. కావున నీవు ఏమియు సందేహింపక ఈమెను సత్యవంతునకు ఇచ్చి పెండ్లిసేయుము. ఆమె చేసిన పుణ్యమువలన అతఁడు చాలకాలము జీవింపవచ్చును.' అని చెప్పెను. అట్లే చేసెదను అని అశ్వపతి చెప్పెను. వారిని దీవించి నారదుఁడు స్వర్గమునకుఁ బోయెను.

వెంటనే అశ్వపతి మంచిదినమున బంధువులు, మంత్రులు, వృద్ధులు, పురోహితులు మున్నగు వారిని వెంటఁబెట్టుకొని పెండ్లికిఁ గావలసిన సంభారములు అన్నియు కూడఁబెట్టుకొని కుమార్తెతో అరణ్యమున నున్నద్యుమత్సేనుని కడకు వెళ్లెను. ద్యుమత్సేనుఁడు అశ్వపతికి అర్ఘ్యపాద్యాదుల నొసంగి మర్యాద చేసి కుశలము అడిగి పిదప 'వచ్చిన పనియే'మని యడిగెను. అందులకు అశ్వపతి, 'ఈకన్నియ,నాకూఁతురు. రాజా! ఇప్పుడు మాకులమున కెల్ల ఈమెయే రత్నదీపమై ఆధారమై యున్నది.

నాయందు దయ వహించి ఈ నా ముద్దుబిడ్డను కోడలుగా గ్రహింపుము.' అని చెప్పి సావిత్రిచే ద్యుమత్సేనునకు మ్రొక్కించి మరల 'నీకొడుకు సత్యవంతునకు ఈ కన్నెయు, ఈ కన్యకు నీకొడుకునుతగుదురు. సమగుణరూపులగు వీరు ఇరువురకును దాంపత్యము చాల చక్కఁగ నుండును' అని వేఁడెను. అప్పుడు ద్యుమత్సేనుఁడు ఇట్లు చెప్పెను.

ద్యుమ.—'మిత్రుఁడా! నీకు మాయందుఁగల అనుగ్రహము చాల గొప్పది. నీవు చూపిన నెనరునకు మేము ఎంతయు కృతజ్ఞులము. కాని మేము రాజ్యమును గోలుపోయి ఘోరారణ్యములో తపస్సు చేసికొనుచున్నారము. నీకూఁతురు శిరీషపుష్పము కంటె సుకుమారి. మాతోఁగూడ ఈకన్నియ భయంకరము అగు అరణ్యములో నుండఁగలదా?'

అశ్వ.—'మీరు నిరాశవలన ఇట్లు చెప్పుచున్నారు. కలిమిలేములు కావడికుండలు. భాగ్యము గలిగినప్పుడు పొంగిపోవుటయు అది పోవునప్పుడు క్రుంగిపోవుటయు తగునా? అతి సుకుమారు లగు మీవలెనే నా కూఁతురు కూడ అరణ్యమున వసింపఁగలదు. నీతో వియ్యము అందవలె నని గంపెఁడాశతో వచ్చితిని. మిత్రుఁడు నా వేఁడికోలు మన్నింపకుండుట న్యాయమా?'

ఇట్లు అశ్వపతి పలుక మాఱు పల్కలేక అంధుఁడైన ద్యుమత్సేనుఁడు చాల సంతసించి ఆశ్రమమున ఉన్న మునీశ్వరులకు ఎల్లరకు నీ సంగతిఁ దెలిపి వారియనుజ్ఞ నంది శుభముహూర్తమున సావిత్రీసత్యవంతులకు వివాహము చేసెను. అశ్వపతి కూఁతునకు, అల్లునకు గొప్పగొప్ప వెలగల వస్త్ర

ములు ఒసంగి సావిత్రిని అత్తింట నుంచి నిజపురమునకుఁ బోయెను.

సావిత్రి తల్లిదండ్రులు ఇచ్చిన వెలగలవస్త్రములను వదలివైచి అత్తగారివలె వనవాసమునకు తగిననారచీరలను ధరించి భర్తకును అత్తమామలకును అనేకవిధముల పరిచర్య చేయుచు తా నెట్టిబాధను లెక్కసేయక వారికి ఏమియు బాధలు లేకుండఁ జూచుచుండెను.

సావిత్రి నారదుఁడు తనతండ్రియింటికి వచ్చినది మొదలుకొని దినములు లెక్కపెట్టుచుండెను. అక్కతన నాలుగు దినములకు ఇఁక సంవత్సరము ముగియు ననఁగా ఆమె యెఱింగి మూఁడు రాత్రింబగళ్లు ఉపవాసము చేయవలసిన ఒక వ్రతము ప్రారంభించెను. అదితెలిసికొని ద్యుమత్సేనుఁడు కోడలిని చేరఁబిలిచి 'తల్లీ! నీవు ఎప్పుడును కష్టములను అనుభవించినదానవు గావు. ఇట్టి కఠినవ్రతమును ఏల పూనితివి? ' అని యడిగెను. అందులకు సావిత్రి నావ్రతమును గుఱించి మీరు విచారింపవలదు. నే నొకగొప్ప ఫలమునుగోరి ఈవ్రతమును ప్రారంభించితిని. ఇప్పుడు నన్ను మీరు వలదని చెప్పకుఁడు. దీని ప్రయోజనము తరువాత మీకు దెలియఁ గలదు.' అని సమాధానము చెప్పెను. ద్యుమత్సేనుఁడు మాఱుమాటాడక అందులకు సమ్మతించెను.

మూఁడు రాత్రింబగళ్లు గడచెను. నాల్గవ నాఁడు అరుణోదయకాలమున మేల్కాంచి సావిత్రి పనులు అన్నియు ముగించుకొని భర్తకు పరిచర్యచేసి అత్తమామలకును ఆయాశ్రమమునందలిబ్రాహ్మణులకును నమస్కరించి వారివలన "సౌభా

గ్యవతీభవ" అను దీవనను బడసి తన భర్త నాఁడు మరణించు నని తలంచి చాల తొట్రుపడుచుండెను. ఇట్లుండఁగా జాముప్రొద్దెక్కెను. అప్పుడు ద్యుమత్సేనుఁడు కోడలినిఁ బిలిచి "తల్లీ! మూఁడు రాత్రింబగళ్లు ఉపవాసము చేసి సోలిపోయి ఉన్నావు. నేఁడు అప్పుడే జాముప్రొద్దు ఎక్కినది పెందలకడ భుజింపరాదా" అని అడుగఁగా సావిత్రి "నేఁటిసాయంకాలము వఱకును ఈ వ్రతము ముగియదు" అని బదులు చెప్పెను.

అప్పుడు సత్యవంతుఁడు గండ్రగొడ్డలి చేఁబూని సమిథలు కుశలు, ఫలముఁలు మున్నగు నవి తెచ్చుటకు అడవికి బయలు దేరెను. అది చూచి సావిత్రి భర్తను తన్నుఁ గూడ వెంటఁ గొనిపొమ్మని కోరెను. సత్యవంతుఁడు "నీవు మూఁడుదినములు ఉపవాసముచేసి డస్సి యున్నావు. అరణ్యమునకు రాఁజాలవు." అనిచెప్పెను. కాని సావిత్రి అందులకు అంగీకరింపక 'నాకు ఏమియు శ్రమలేదు. అడవి చూడవలయు నని ముచ్చటగానున్నది. నేఁడు నన్ను వారింపవలదు'అని సావిత్రి బతిమాలెను. సత్యవంతుఁడు అందులకు ఏమియు చెప్పక "సరే" అని సమ్మతించెను. వెంటనే సావిత్రి అత్తమామల సెలవు గోరెను. వారును ఉపవాసము సంగతిచెప్పి మాన్పింపఁ జూచిరి; గాని తుదకు సావిత్రి బతిమాలుటను జూచి "ఈ ముద్దుగుమ్మ మనలను ఎప్పుడును ఏమియు కోరలేదు, ఇదికష్టమైనను ఆమెకు ముచ్చటగానున్నది గావున వారింప తగదు"అనివారు కోడలికి సెలవిచ్చిరి. వెంటనే సావిత్రి సత్యవంతుని కైదండ చేకొని ఘోరారణ్యమునకు బయలుదేరెను.

సత్యవంతుఁడు సావిత్రికి అరణ్యమునందలి వింతలు అన్నియుఁ జూపఁదొడఁగెను. సావిత్రి వానిని జూచుచునే ఉండెను. కాని మనస్సులో నున్న ఆందోళనమువలన కొంచెము భయభ్రాంతరాలై నడుమనడుమ అటునిటు భయముతోఁ జూడసాగెను. ఇట్లు కొంతదూరము పోవునప్పటికి ఒకచోట మంచి పండ్లు కాన్పింపఁగా సత్యవంతుఁడు వానిని గోసెను. సావిత్రి ఆపండ్లు అందుకొని బుట్ట నింపెను. పిదప సత్యవంతుఁడు గొడ్డలి చేతఁబట్టి సమిధలుకొట్టసాగెను. కొంతసేపటికి అతనికి చాలభారముతోఁచెను. వెంటనే ఆతఁడు గొడ్డలిని అచ్చట పడవేసి సావిత్రి చెంతకువచ్చి "శరీరము పరవశము అగుచున్నది. మనస్సు తల్లడిల్లుచున్నది. శూలములతో పొడిచినట్లు తల పోటుగా నున్నది. ఇఁక నిలువలేను. కొంచెము సేపు ఇక్కడ శ్రమతీర శయనించెదను" అని చెప్పెను. వెంటనే సావిత్రి సత్యవంతుని శిరస్సును తనతొడపై నిడుకొని అతనిని పరుండఁజేసెను. కొంచెముసేపటిలోనే సత్యవంతుఁడు సోలిపోయి నిశ్చేష్టుఁడయ్యెను.

అంత కాటుకవంటి దేహచ్ఛాయ కలవాఁడును, కోఱపండ్లుగలవాఁడును,భయంకరములైననేత్రములు కలవాఁడును, తళతళమెఱయు బంగరు వస్త్రము గట్టినవాఁడును, ప్రళయాగ్నివలె చూడ శక్యముకానివాఁడును, పాశహస్తుఁడును అగు ఒక దివ్యపురుషుఁడువచ్చి సత్యవంతుని సమీపించుటఁజూచి సావిత్రి భీతిల్లి క్రిందపడి లేచి "అయ్యా! మీ రెవరు? ఇక్కడకు ఏల వచ్చితిరి?" అని అడిగెను. అందుల కాతఁడు "సాధ్వీ! నేను యముఁడను. పాతివ్రత్యమాహాత్మ్యమువలన నీవు నన్ను చూడఁగలిగితివి. ఇతరులు నన్ను చూడఁజాలరు. నీభర్తకు

ఇపుడు మరణకాలము వచ్చినది. ఈతఁడు మహాపుణ్యాత్ముఁడు కావున ఇతరులను బంపక నేనే వచ్చితిని" అని చెప్పి సత్యవంతునిశరీరమునుండి ప్రాదేశమాత్రుఁ డగు జీవునిఁ దీసి పాశములతో బంధించి దక్షిణపుదిక్కునకు బయలుదేరి పోవఁదొడఁగెను.

వెంటనే సావిత్రి సత్యవంతుని కళేబరమును సురక్షితమైన ఒక స్థలమున దాఁచి పాదములు తడఁబడ యమునివెంటఁబడెను. అది చూచి యముఁడు "సాధ్వీ! నీవేల నాతో వచ్చెదవు ? ఇఁక ముందు మార్గము చాల కష్టమైనది. వెనుదిరిగి పొమ్ము" అని చెప్పెను; గాని సావిత్రి అట్లు చేయక "మహాత్మా! నీవు నన్ను సాధ్వీ! అని పిలిచితివి, సాధ్వికి భర్త ఎక్కడకుఁ బోయిన అక్కడకుఁ బోవుట ధర్మము గదా ? నాకు నా పతియందు గల భక్తివలనను, నీ యనుగ్రహమువలనను పోరాని స్థలము లేదు. అన్నిమార్గములయందు ధర్మమార్గము ఉత్తమము. ధర్మమునకు సజ్జనులు ఆధారులు. సజ్జనదర్శనము ఎప్పుడును వ్యర్థము గాదు. కావున సజ్జనశేఖరుండ వగు నీ దర్శనము జేసి నేను వ్యర్థముగ ఎట్లుపోవుదును?" అనెను. అది విని యముఁడు సావిత్రిమాటలకు మెచ్చి "నీ భర్తప్రాణము తక్కవేమి కోరినను ఇచ్చెదను" అనియెను. వెంటనే సావిత్రి "రాజ్యమునుగోలుపోయి అరణ్యములో వ్రతములుచేయుచు జీవించుచున్న నామామ అగు సాళ్వభూపతికి గ్రుడ్డితనము పోవునట్లు వరము ఇమ్ము" అని అడిగెను. 'ఇచ్చితిని. ఇఁక మరలిపొమ్ము' అని చెప్పి యముఁడు నడువసాగెను. మరల సావిత్రి వెంటబయలుదేరి, " మహాత్ములు మాటచేతఁగాని, మనస్సుచేతఁగాని, క్రియ

చేతఁగాని వరికిని ఎగ్గు నేయరు. ఎప్పుడును దీనులను రక్షింతురు అర్థుల కోరికలు మిగిలిపోకుండ కోరినదానికంటె ఎక్కుడు తీర్తురు. ఆశ్రితులను చాల దయతో చూతురు. దేవోత్తమా! నీకు తెలియనిది ఏమి గలదు? ధర్మము నీ చిత్తను వచ్చినట్లు నడుచునుగదా? సమబుద్ధితో సమస్తప్రాణులకును తగినఫలము ఇచ్చెదవు గావున నీవు సమవర్తివి అయితివి. నీకు సమానులు ఎవరు? నీవు సమస్తభూతములను యమింతువు గావున యముఁడవు అయితివి. సకలపాపశమనంబున శమనుఁడవు అయితివి." అని ఉపన్యసింపసాగెను.

అది విని యముఁడు మరల సానందించి "రమణీమణీ! సత్యవంతునిప్రాణములు తక్క తక్కిన వేవి కోరినను ఇచ్చెదను" అనియెను. వెంటనే సావిత్రి ఆనందముతో "దేవా! శత్రువులకుఁ గోలుపోయిన రాజ్యమును ద్యుమత్సేనమహారాజు మరల పరిపాలించునట్లు అనుగ్రహింపుము." అని వేఁడెను. అందులకు "ఇచ్చితి నిఁక నిలిచిపొమ్ము." అని చెప్పి యముఁడు మరల ప్రయాణ మయ్యెను.

యథాప్రకారముగ సావిత్రి ఆతనివెంటనడచుచు "ధర్మాత్ములు తాము చేయు ధర్మము ఎప్పుడును తప్పరు. ధర్మాత్ముల మనస్సులయందు మోహాపుకెరటములును తాపమును పుట్టవు. కావున నేను భర్తతో వచ్చుట ఎట్లు మానఁగలను? ఎట్టి సమయమునందు అయినను క్షాంతి వహింప ధర్మమును చేయువలదా?" అని యడిగెను. అందులకుఁగూడ సంతసించి యముఁడు "మహాభారత్నమా! నీభర్తప్రాణములు కాక మఱియేమి కోరినను ఇచ్చెదను." అనియెను. సావిత్రి "నాతండ్రి మద్రదేశా

ధీశ్వరుఁడు కుమారులు లేక వగచుచున్నాఁడు, అతనికి నూర్గురు పుత్రులు గలుగునట్లు అనుగ్రహింపుము." అని వేఁడెను. ఇచ్చితి నని చెప్పి యముఁడు సావిత్రిని "నీవు గడుదవ్వు నడచి అలసి పోయి యుంటివి; ఇఁక మరలిపొమ్ము." అని ఆజ్ఞాపించెను.

అందులకుఁ గృతజ్ఞతఁజూపి సావిత్రి "నాకు ఆయాసముఁ ఎక్కడిది? నామనస్సు నా భర్తయొక్క పాదపద్మములను బూజింప ఉవ్విళ్లూరుచున్నది. ధర్మనిరతులైన పుణ్యాత్ములు దుర్లభులుగదా? వారిని సేవించినచో సమస్తపాపములును పోవును. వారి యనుగ్రహమువలననే సూర్యచంద్రులు గతి తప్పకుండ నున్నారు. వారి దయవలననే సప్తసముద్రములును, కులపర్వతములును నిశ్చలములై ఉన్నవి. వారిదాక్షిణ్యమువల ననే ఈ భూమి సమస్తమును భరించుచున్నది. మహాత్మా! ఎట్టి వారు అయినను ఏడుమాటలు ఆడినచో వారలు ఆర్యులకు చుట్టములు అగుదురు అని ఆర్యోక్తి కలదుగదా! ఆన్యాయ్యము ను అనుసరించి నేను నీకు చుట్టమ నయితిని. కావున మిత్ర మనోరథము అవశ్యము తీర్పవలయు" నని చెప్పెను. అది విని యముఁడు చాల సంతసించి "నీవు ఏది కోరినను ఇచ్చెద" నని యెను. అందులకు సావిత్రి యముని ఎంతయు కొనియాడి "భర్తలేని బ్రతుకు దుస్సహము. పతిలేని కాంత దూషింపఁ బడును, కావున నాభర్తకు ప్రాణము లొసంగి నన్ను రక్షిం పుము" అని వేఁడెను. వెంటనే యముఁడు సత్యవంతుని బ్రతికించి "కోమలీ! నీభర్త అగు సత్యవంతుఁడు నాల్గువందల ఏండ్లు జీవించును. నూర్గురు కుమారులను గనును. అనేక యజ్ఞము

లను జేసి దేవతలను తృప్తిబొందించును. వంశమునకు భూషణం బగును" అని యాశీర్వదించి మాయ మయ్యెను.

వెంటనే సావిత్రి సత్యవంతుఁడు ఉన్నచోటికి వచ్చి తొల్లిటివలె అతని తల తొడమీఁద ఇడుకొని కూర్చుండెను. అట్లు కొంతతడవు జరుగునప్పటికి సత్యవంతుఁడు లేచి కూర్చుండి "రమణీ! ఎంత నిద్దుర వచ్చెను! ఎవఁడో బలవంతుఁడు వచ్చి నన్ను లాగెను. అతఁ డెవ్వఁడో చెప్పుము" అనిరెయెను. అప్పుడు సావిత్రి ఆతనిని తగునట్లు లాలించి "అంతయు రేపుచెప్పెదను" అని బయలుదేరఁ దీసెను.

సత్యవంతుఁడు సావిత్రిని జూచి "సాధ్వీ! మనము వచ్చి చాలఁ బడవు అయినది. నా బాధ అంతయు తొలఁగి పోయినది. నా తలిదండ్రులు మనకొఱకు ఎంతయో అడలు చుందురు. నేను ఎప్పుడును వారిని విడిచి ఇంతతడవు ఎక్కడను సంచరింపలేదు. వేగరమ్ము పోదము." అని చెప్పి వడిగ నడువఁ దొడఁగెను. పండ్లబుట్ట బలు వని సావిత్రి దానిని ఒకచెట్టుకొమ్మకు తగిలించి గొడ్డలిని చేతఁబట్టుకొని సత్యవంతునిఁ జేదివి పట్టి బయలుదేరెను.

అంతకు మున్నే కన్నులు వచ్చుటవలన సమస్తమును జూచుచు తనకొడుకుకొఱకు ద్యుమత్సేనుఁడు విచారించుచుండెను. ఆతనిరాణి గూడ అట్లే ఉండెను. వారిని ఊరడించుటకు ఆశ్రమమునందలి మునులు ఎల్లరువచ్చి అతనికి కన్నులువచ్చుటకు అబ్బురంపడి విచారము ఉడుపఁ దొడఁగిరి. ఇంతలో సావిత్రితో సత్యవంతుఁడు వచ్చి తల్లిదండ్రులకును, మునులకును నమస్కరించెను. అందఱును వారిని దీవించిరి. ద్యుమత్సేనుఁడు

పుత్రా! నేఁడు ఇంత తడవు ఏలరావైతివి?' అని అడిగెను. సత్యవంతుఁడు తాను మూర్ఛ వచ్చి పడిపోవుట మున్నగునవి అన్నియుఁ జెప్పెను. అప్పుడు సావిత్రి నారదుఁడు వచ్చినది మొదలుకొని జరిగిన సంగతులు అన్నియుఁ జెప్పెను. అది విని ఎల్లరును ఆమెను గొనియాడిరి. కొన్ని దినములకు ద్యుమత్సేనుని అమాత్యులును, భృత్యులును, పౌరులును, దేశమునందలి పెద్దలును వచ్చి, "మహారాజా! నీశత్రువు భృత్యభేదనమువలన బాంధవులతోడను సహాయులతోడను మడిసెను. ఎల్లరును సాళ్వరాజ్యమునకు ఏలికగా నిన్ను కోరుచున్నారు. కన్నులువచ్చిన నిన్ను చూచుటవలన నేఁడు మాకన్నులు చల్లఁబడినవి. వెంటనే దయసేయవలయు" నని ప్రార్థించిరి. అందులకు చాల సంతసించి ద్యుమత్సేనుఁడు తత్క్షణమే ఆయాశ్రమమునందలి మునులను బిలిచికొని కుమారుఁడును తానును ఏనుఁగు నెక్కి కోడలితోడను రాణితోడను సకలచతురంగబలములు కొలువ పురమునకుఁ బోయి సింహాసన మెక్కి అందఱిసమ్మతిని కుమారునకు యావరాజ్యము ఒసంగెను. పిదప సావిత్రి తండ్రికి నూర్గురుపుత్రులు గలిగిరి. సత్యవంతుఁడు నాల్గువందలయేండ్లు జీవించి చక్కఁగా రాజ్య మేలెను. సావిత్రి సత్యవంతునివలన నూర్గురుపుత్రులఁ బడసెను.

---

# శకుంతల

దుష్యంతుఁడు చంద్రవంశమునఁ బుట్టిన గొప్ప రాజు లలో ఒకఁడు. ఆతనికి వేట అనిన ఎంతో ఆనందము. అక్కా తన ఆతఁడు ఒకనాఁడు వడిగలగుఱ్ఱములచే లాగఁబడురథమును ఎక్కి చాలమంది గుఱ్ఱపురౌతులు వెంట రా వేటకై అరణ్య మునకు బయలువెడలెను. అరణ్యము చొచ్చినవెంటనే అంద ఱును వేట ప్రారంభించిరి. వారికంటఁ బడినమృగము ఒక్క టియు మిగిడి ప్రాణములతోఁ బోయి యెఱుఁగదు. తుదకు వనమునందలి జంతువులు అన్నియు అయిపోవు నని తోఁచు నట్లు వారు వేటాడిరి. అందు దుష్యంతుఁడు వెంటవచ్చిన వారి సంగతి సందర్భములను జూడక కాన్పించిన ఎల్ల జంతువుల మీఁదికిని రథమును దోలించెను. అక్కాతన ఆతని రథము పరి వారమును విడిచి చాలదూరము పోయెను.

రాజుతో పోఁజాలక పరివారము అచ్చటచ్చట శ్రమ చేత నిలిచిపోయెను. కొలఁదిమందిసేవకులును, ఇద్దఱు ముగ్గురు మంత్రులును, పురోహితుఁడును మాత్రమే ఆతనితోఁ గూడ నుండిరి. అట్లు దూరము పోయిన రాజునకు అనేకవిధములయిన పూవులతోడను, ఫలములతోడను వంగియున్న చెట్లు, పొద రిండ్లు మున్నగువానిచే ఎంతో చక్కఁగా నున్న ఒకవనము కానఁబడియెను. దానియందమునకు మెచ్చుకొనుచు అందు ప్రవే

శించునపుడు తీఁగలు అను స్త్రీలు తుమ్మెద ఝుంకారము లను దీవనలతో రాజునకు మలయమారుతమువలన రాలుచున్న పుష్పము లను అక్షతలతో సేసలు పెట్టిరి. మఱియు వేఁటాడి యాడి అలసిసొలసియున్న ఆతనికి నీటిమీఁదినుండి వచ్చినపిల్ల వాయువులు శ్రమతీర్చెను. అట్టి సమయమున గోరువంకలు, కోయిలలు చిల్కలు మున్నగువాని మృదుకూజితములచే అర సొక్కి యున్న రాజు ముందునకు అరిగి అరిగి పుష్పములులేక పోయినను హోమధూమములచే హృదయానందకరముగ గుబా ళించు తీఁగలచే అలముకొనఁబడిన చెట్లుకొమ్మలమీఁదనుండి వెడలిపోక జుంజుమ్మని రొదచేయు తుమ్మెదలవలన ఇది మునీశ్వ రుల తపోవనము అని తలంచెను. ఆతఁ డింకను కొంచెము ముందునకుఁ బోఁగా పర్ణశాలల పంచలను, అరఁగులమీఁదను కూర్చుండి శిష్యులకు పాఠములు చెప్పుచున్న మునులును, వెను కటి పాఠములు చింతన చేసికొనుచున్న మునిబాలకులును కాన్పించిరి. మఱికొంత ముందునకుఁబోఁగా అచ్చట సింహము లును ఏనుఁగులును ఒక చెట్టుక్రిందనే పడుకొని యుండెను. పిల్లులును ఎలుకలును కలిసి ఎంతో సంతోషముతో చెలగాట లాడుకొనుచుండెను. ఇది యంతయుఁ జూచి ఆతఁడు మునీశ్వ రుల ప్రభావమునకు చాల ఆశ్చర్యపడెను.

పిదప రాజు అది కణ్వమహాముని ఆశ్రమము అని తెలిసి కొని “మహర్షికి నమస్కరించి వచ్చెదను. నేను వచ్చినంత దనుక మీరు ఇక్కడనే ఉండుఁడు” అని కూడవచ్చిన వారిని ఆజ్ఞాపించి లోనికిఁ బోయెను. అక్కడ పర్ణశాలయందు ఒక పొదరింటి చెట్టునీడ కూర్చుండి యున్న సుందరి రాజును జూచి

తటాలున లేచి నిలిచెను. ముల్లోకములయందును సౌందర్యమున ఈడులేని ఆమె నవమన్మథరూపుఁడైన రాజును ఎఱింగి వినయముతో ఆసనము, అర్ఘ్యము, పాద్యము మున్నగువానిచే సంతృప్తునిఁజేసి కుశలమడిగెను. ఆమెమాటలయందలిమాధుర్యమునకు ఆనందించుచు దుష్యంతుఁడు "వేఁటకొఱకు ఈ యరణ్యమునకు ఏగుదెంచి కణ్వమహామునులను జూచి పోవుటకు ఇందు వచ్చితిని. వా రెక్కడకుఁబోయిరి" అని అడిగెను.

"వారు ఇప్పుడే ఫలములకొఱకు వనాంతరమునకు పోయిరి. మీ రాక తెలిసిరేని వారు ఇప్పుడే రాఁగలరు. ఒక్క ముహూర్తకాలము ఇక్కడ విశ్రమింపుఁడు" అని ఆమె బదులు పల్కెను. ఆ ముద్దుగుమ్మ వినయమునకు ఆనందించి, ఆమెమృదుమధురవచనములకు మెచ్చి, ఆమెను కన్యకఁగా ఎఱింగి మన్మథరాజ్యలక్ష్మివోలు ఆమె సర్వాంగసౌందర్యమునుజూచి మోహితుఁడై రాజు ఆమెను "నీవు ఎవ్వరి కూఁతురవు? ఇంతటి అందగత్తెవు అగు నీవు ఈ అరణ్యమునకు ఏల వచ్చితివి?" అని అడుగఁగా ఆమె "నేను కణ్వమహామునీంద్రుల కూఁతురను" అని చెప్పెను అదివిని రాజు 'ఈమె మునికన్యకయైనచో నాకు ఈమెపై నేల మోహము కలుగవలెను?' అని ఆశ్చర్యపడి "రమణీమణీ! కణ్వమహార్షిశేఖరులు అస్ఖలితబ్రహ్మచారులు అని విందుము. వారికి నీవు ఎట్లు పుట్టితివి!" అని మరల నడిగెను. అందులకు శకుంతల తన జన్మవృత్తాంతము ఇట్లుచెప్పెను.

"ఇప్పుడు నీవు నన్ను అడిగిన ప్రశ్నయే మున్ను ఒకప్పుడు ఒక మునినాథుఁడు తండ్రిగారిని అడిగెను. అప్పుడు మాతండ్రి ఇట్లు చెప్పెను. 'రాజర్షి అయ్యును తపోమాహాత్మ్య

మునలన బ్రహ్మర్షి అయిన విశ్వామిత్రుఁడు ఘోరతపస్సుప్రారంభించెను. దానికి భీతిల్లి దేవేంద్రుఁడు అతని తపస్సు చెఱచి రమ్మని మేనకకు చెప్పెను. ముక్కోపిఅగు విశ్వామిత్రుని వద్దకు వెళ్ళుటకు మేనక మొదట జంకెను గాని తుదకు ధైర్యము వహించి బయలుదేరిపోయి విశ్వామిత్రుని ఆశ్రమము ప్రవేశించి అట సంచరింపఁ దొడఁగెను. ఒకప్పుడు గాలివలన దాని ఒడలిమీఁది వస్త్రము తొలఁగి పోయెను. అప్పుడే విశ్వామిత్రుని చూపులు ఆమెపైఁ బడెను. వెంటనే అతనికి మోహము గలిగెను. పిదప నాతఁడామెతో చాలకాలము క్రీడించెను. కొన్ని దినములకు మేనకకు ఆఁడుబిడ్డపుట్టెను. ఆబిడ్డను మాలినీ నది యొద్దనవిడిచి మేనక స్వర్గమునకుఁబోయెను. జరిగిన దానికి వగచి విశ్వామిత్రుఁడు మరల తపస్సునకుఁబోయెను. దిక్కులేక పడియున్న ఆబిడ్డను ఘోరమృగముల కంటఁబడకుండ శకుంతములు (పక్షులు) రెక్కలతో కప్పి యుండెను. ఇంతలో మేము సమిథలు, కుశలు, ఫలములు తెచ్చుటకు ఆదెసకుఁ బోయితిమి. అప్పుడు మేము ఆ బిడ్డను జూచి జాలిపడి మాఆశ్రమమునకుఁ గొనివచ్చి పెంపఁదొడఁగితిమి. ఆమె శకుంతములచే రక్షింపఁబడినది గావున శకుంతల అని పేరు పెట్టితిమి. కన్నతండ్రి, అన్నము పెట్టువాఁడు, భయమునుండి రక్షించువాఁడును, స్త్రీలకు గురువులు అగుటచే మేము ఈమెకు గురువులము. ఈమె మాచేఁ బెంపఁబడినది గావున మాకు ఆనందముగలిగించు కూఁతురు."

ఈ రీతిని శకుంతల చెప్పినది విని దుష్యంతుఁడు 'ఈమె క్షత్రియకన్యక కావుననే నాకు ఈమె యందు మోహముగలిగినది. కావున నాకు ఏమియు దోషము తగులదు.' అనితలఁచి

ఆమెకు తనయందు అనురాగము ఉన్నట్లు చూపులవలన గ్రహించి 'సుందరీ! జగన్మోహినివి అగు నీకు నారచీరలు, వనవాసము, కందమూలములు మున్నగు వన్యవస్తువులు భుజించుట ఏమి తగును? నీవు ఈ మునిపల్లెలో ఉండనేల? అనుగ్రహించి నన్ను పెండ్లియాడుము. దేవేంద్రునకుఁ గూడ దుర్లభమైన నా యంతఃపురమున నీవు సర్వాధికారిణివై సంచరింపుము. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము, అసురము, గాంధర్వము, పైశాచము అను ఎనిమిదివిధములైనవివాహములయందును క్షత్రియులకు గాంధర్వమును, రాక్షసమును ప్రశస్తములు. కావున నన్ను గాంధర్వవిధిని పెండ్లియాడి నాకు సుఖము గలిగింపుము' అని శకుంతలను వేడుకొనియెను.

అందులకు శకుంతల 'రాజా! నాతండ్రిగారు కరుణాత్ములు, ధర్మస్వరూపులు, వారు ఇప్పుడే వచ్చెదరు. వారు వచ్చి అంగీకరించిరేని నీవు నన్ను పాణిగ్రహణము సేయుము' అని ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లు శకుంతల తనయందు మమకారము విస్పష్టముగాఁ దెలుపుటచే తాళఁజాలక 'భీతమృగాక్షీ! గాంధర్వమున తనకుఁ దానే చుట్టము. తనకుఁ దానే గతి. మఱియు ఇచ్చునపుడు తనకుఁ దానే కర్త. మఱియు గాంధర్వ వివాహము అతిరహస్యముగను, మంత్రములు లేకుండఁగను జరుగవలెను. కావున నీవు ఏల నన్ను త్రిశంకుస్వర్గమున ఉఱ్ఱూతలూచెదవు? శీఘ్రముగ నన్ను ఏలుకొనుము' అని ప్రార్థించెను'

శకుంతల అందులకు అంగీకరించెను; కాని 'రాజా! నాది ఒకవరము కలదు. నీ అనుగ్రహము వలన నాకుఁ గలిగిన కుమారునకు యావరాజ్యము ఒసంగెదవేని నీ అభీష్టము ఈడేర్చె

కను' అని కొంచెము అభ్యంతరము చెప్పెను. వెంటనే రాజు అందులకు అంగీకరించి శకుంతలను గాంధర్వవిధిని స్వీకరించి, 'నిన్ను పురమునకుఁ దోడితెచ్చుటకుఁ మంత్రివర్గమును కణ్వమహామునుల చెంతకు అంపెద' నని ఆమెను ఊరడించి స్వస్థలమునకుఁ బోయెను.

పిదప శకుంతల తాను చేసిన పనికి కణ్వమహర్షి కోపించునో అని వెఱవసాగెను. ఆమె ఇట్లుండఁగనే మహర్షి ఇంటికి వచ్చి రూపొందినసౌందర్యమో యన తేజరిల్లుచు, సిగ్గు పెంపున తలవంచికొని అడలుచున్న కూఁతుం జూచి దివ్యజ్ఞానమున జరిగినది అంతయు గ్రహించి కడు సంతసించి శకుంతలను చేరఁ బిలిచి తొడపైఁ గూర్చుండబెట్టుకొని ముంగురులు దువ్వుచు 'తల్లీ! నీ కులగోత్రసౌందర్యములకు తగినభర్త లభించెను. అదృష్టవశమున నీవు ఇప్పుడే గర్భమును ధరించితివి. నీ గర్భమున ఉన్న బాలుఁడు సమస్తభూతములను పాలింపఁగల చక్రవర్తి. నీ ధర్మ చరిత్రమునకు నాకు ఎంతయు మెప్పుకలిగినది. నీకోరిన వరమిచ్చెద అడుగుము' అని లాలించుచు పలికెను.

అది విని శకుంతలయు 'అమ్మయ్యా! బ్రతికితిని' అనుకొని చేతులు జోడించి 'తండ్రీ! నామనస్సు ఎప్పుడును ధర్మమార్గమునందే ఉండునట్లును, నాకు గలిగెడుకుమారుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్య బలసమన్వితుఁడును, వంశకర్తయు అగునట్లు వరము దయసేయుము' అని ప్రార్థించెను. కణ్వుఁడు ఆమె కోరినది అంతయు ఒసంగి ఆమెకు గర్భిణీస్త్రీలకు చేయవలసిన విధులు అన్నియు చేయించెను. పిదప శకుంతల మూఁడు సంవత్సరములు గర్భమును మోచి శుభముహూర్తమున కుమారునిఁ

గనిరెను. ఆబాలునకు మహర్షి జాతకర్మ మున్నగు సకలక్రియ లను నెఱవేర్చెను. ఆ చిన్నవాఁడు భరతుఁడు అనుపేరుతో దీర్ఘబాహుఁడును, మిక్కిలి బలముగలవాఁడును అయి సింహములను అవలీలఁ జయించుచు చక్రవర్తిలక్షణములతోఁ బెరుగ నారంభించెను.

ఇట్లుండగా భరతుఁడు యౌవరాజ్యపట్టాభిషేకమునకు దగిన వయస్సుగలవాఁ డయ్యెను. అదిచూచి కణ్వుఁడు శకుంతలతో 'తల్లీ! సాధ్వీమణులకు ఎల్లకాలము పుట్టినింట నుండుట తగదు. సతులు భర్తలవద్దనే ఉండవలయును. స్త్రీకి భర్తయే దైవముగద. కావున నీ కుమారుని దోడ్కొని నీ పతిపాలికి పొమ్ము అని చెప్పి తపోధనులు అయిన కొందఱు శిష్యులను తోడు పంపెను. తండ్రిఆజ్ఞచొప్పున శకుంతల దుష్యంతుని దగ్గఱకు వచ్చి నిండుకొలువున కొలువై యున్న రాజును దర్శించెను. రాజు ఆమెను జూచి మొగము చిట్లించుకొనియెను. శకుంతల అది అంతయుఁ గనిపెట్టి 'రాజు నన్ను మఱచియుండునా? లేక మఱవఁ దలఁచెనా? అట్లు కాకున్న నాఁడు కణ్వాశ్రమమున చూపిన నెనరు, దయ, అనురాగము, కరుణ, కాన్పింపవేమి? అయి నను తెలిపి చూచెదను' అనితలంచి దుష్యంతునిఁ జూచి 'రాజా! నాఁడు వేఁటకారణమున అరణ్యమునకు వచ్చి కణ్వమునీంద్రుల ఆశ్రమమున నాకు దయచేసిన వరమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. బాలసూర్యునివలె వెలుంగుచున్న యీ ముద్దు బాలుఁడు నీకొడుకు. పురువంశమునకు అలంకారమగు వీనిని యువరాజుం జేయుము'' అని పలికెను.

ఇది విని వింత అభినయించుచు రాజు "ఏమి చెప్పుచున్నావు! నీవు చెప్పునది నాకు ఏమియు అర్థము అగుట లేదు. నీవు ఎక్కడిదానవో నేను ఎఱుగను. అసందర్భపు మాటలు చాలించి ఎక్కడనుండి వచ్చితివో అక్కడకు పొమ్ము" అని పలికెను. ఈ మాటలు విని శకుంతల తెల్లవోయెను. మనస్సు తొట్రు పడియెను. జగత్తు అంతయు తలక్రిందులై పోయినట్లును, ఆకసము విరిగి మీఁదఁ బడిపోయినట్లును తోఁచెను. వెంటనే కనులనుండి బాష్పధార ప్రవహింపసాగెను. ఒక్క క్షణము అట్లుండి, తెలివి తెచ్చుకొని, కంటినీరు తుడిచికొనుచు శకుంతల రాజుం జూచి రాజా! ఎఱిఁగి ఎఱిఁగి ఇట్లు ఏల ఎఱుంగనట్లు నటించెదవు? నీవును నేనునే కాని మన సమయమును ఇతరులు ఎవ్వరును ఎఱుఁగ రని తలంచుచున్నావా ఏమి? వేదములును, పంచభూతములును, ధర్మము, సంధ్యలును, అంతరాత్మయు, యముఁడు, సూర్యచంద్రులును, దివారాత్రములును, లోకములో జరుగు వ్యాపారములను అన్నియు కన్నులార చూచుచుండును. ఎవరును వానిని మోసగింపలేరు. కావున నా యెడల తొల్లిటి అనుగ్రహము పూనుము. గుణవతియు, సంతానవతియు, అన్నిట నీడుజోడైనదియు, విశేషించి ధర్మపత్నియు అయిన స్త్రీని అవమానము సేయువానికి ఇహపరములు ఉండవు. సత్కళత్రము గలవాఁడే గృహమేధులయందు ఉత్తముఁడు. భార్య లేని పురుషుఁడు వ్యర్థుఁడు. వాని తెలివితేటలును, శక్తి సామర్థ్యములును, గుణరూపములును, ప్రాయమును, తక్కినవి అన్నియు, వాని బ్రతుకుతోఁగూడ చౌటిపఱ్ఱలోఁ బ్రవహించు దేవనది వోలె నిరర్థకములు. మంచి భార్యకలవాఁడు ఎట్టి

ఆపత్తులను అయినను దాఁటగలఁడు. మఱియు భార్య భర్తకు అర్థాంగి అగుటవలన భార్యను అవమానించు భర్త తన్నే అవమానించుకొనినవాఁడు అగును. ఈబాలునిఁ జూడుము. నీ తేజస్సు అంతయు వీనియందుఁ గలదు. పురుషుఁడు తానే తన స్త్రీయందు కుమారుఁడై పుట్టును. అట్టిచో నిన్నే నీవు ఏల కాదనుకొనెదవు? రాజా! ఇట్లు విపరీతముగా నేల మాట్లాడెదవు? ముత్యాలదండకంటెను, కర్పూరము, చందనములకంటెను, వసంతచంద్రికకంటెను చల్లనైన ఈకుమారుని కౌగిలింత సుఖమును అనుభవింపుము. దుష్యంతుని ఉత్తమకుమారుఁడైన ఈ బాలుఁడు నూరువాజపేయములు చేసి వంశకర్త యగునని మునులెల్లరును వినుచుండ ఆకాశవాణి కణ్వమునీంద్రుల ఆశ్రమమున పలికినది. ఇట్టి కులభూషణుని ఏల తిరస్కరించెదవు? అసత్యమునకు ఒడిగట్టకుము. నీవు ఎంత ధర్మస్వరూపుఁడవు అయినను అసత్యము ఆడినచో రౌరవమునకుఁ బోయెదవు. సత్యముతో సమానమైనది ఏమియు లేదు. క్షత్రియవంశశేఖరుఁడైన విశ్వామిత్రమహర్షికిని పవిత్రురాలగు మేనకకును బుట్టిన నా నోట అబద్ధము వెడలునా?" అని చెప్పెను. అయినను రాజు సమ్మతింపక "నేను ఎక్కడ? నీవు ఎక్కడ? కొడుకు ఎక్కడ?. స్త్రీలు అసత్యభాషిణులు అను మాటను సార్థకపఱచితివి. చాలుచాలు. ఇఁక మాఱుపలుకక పోపొమ్ము" అని గద్దించి పల్కెను.

పాపము! అసహాయురాలగు శకుంతల ఇఁక నేమి సేయఁగలదు? "పుట్టినప్పుడే తల్లిదండ్రులచే విడువఁబడితిని. ఇప్పుడు భర్తచే విడువఁ బడితిని. అక్కటా! ఇఁక నా బ్రతుకేల?" అని

ఏడ్చుచు అవ్వలకుఁ బోవుటకు బయల్వెడలెను. వెంటనే ఆకాశ వాణి "రాజా! తొందఱపడకుము. శకుంతల నీ ధర్మపత్ని. భరతుఁడు నీ ప్రియకుమారుఁడు. ఆదరముతో వారిని పాలింపుము" అని పలికెను. అది విని సభలో నున్న వారు అందఱును ఆశ్చర్యపడిరి. రాజును తటాలున గద్దియ దిగి సభలోని వారినిఁ జూచి "శకుంతల పల్కినది అంతయు నిజము. కాని మేమిరువురము తక్క ఇతరులు ఎఱుఁగరు. కణ్వమునీంద్రుల ఆశ్రమమున నేను ఆమెను గాంధర్వవిధిని పెండ్లియాడితిని. ఎఱిఁగియుండియు లోకులు ఏమనుకొందురో అని ఎఱుఁగనట్లు నటించితిని. ఆకాశవాణి యథార్థము చెప్పుటవలన ఇప్పుడు అందఱకును అన్నిసందేహములును తీఱినవి" అని చెప్పి అతి ప్రేమమున కొడుకు నెత్తికొని ముద్దాడి శకుంతలామహాదేవిని అతి ప్రేమగౌరవంబున ఆదరించెను. పిదప నాతఁడు శకుంతల సాహాయ్యమున పెద్దకాలము రాజ్యము చక్కఁగా పాలించి వృద్ధుఁడైనప్పుడు భరతునకు పట్టము గట్టి శకుంతలతో తపోవనమునకు పోయెను.

---

# దమయంతి



విదర్భదేశమునకు రాజు అగు భీమసేనుడు సంతానము లేక అరణ్యములకుఁ బోయి అచ్చట భార్యతోఁ గూడ దమనుఁడు అను మునిని గొలిచి అతని యనుగ్రహమున దమయంతి యనుకొమార్తను, దముఁడు, దాంతుఁడు, దమనుఁడు అను ముగ్గురు కుమారులను బడసెను. ఆబాలిక చంద్రరేఖవలె దినదినప్రవర్ధమానయై పదాఱు ఏండ్ల యువతి యయ్యెను. అప్పటికి అంతటి అందగత్తె ఇఁక ప్రపంచములో ఎచ్చటను లేదని ఆమె పేరు గాంచెను. ఆమెకు సౌందర్యమున దేవతాస్త్రీలను గూడఁ దలఁ దన్నఁగల నూర్గురు చెలికత్తె లుండిరి.

స్త్రీలలో అందకత్తె యని దమయంతి ఎంత పేరు గాంచెనో, నిషధదేశమును పరిపాలించు నలుఁడు అను పేరుగల చక్రవర్తి గూడ పురుషులలో అంత అందగాఁడు అని పేరు పడెను. ఎక్కడఁ జూచినను లోకులు నలదమయంతుల సౌందర్యమును గుఱించియు సుగుణములను గుఱించియు చెప్పుకొన సాగిరి. కొంతకాలమునకు దమయంతి గుణరూపములు నలునకును, నలుని గుణరూపములు దమయంతికిని దెలియవచ్చెను. వెంటనే వారు ఒకరి నొకరు పెండ్లి యాడవలెనని నిశ్చయించుకొనిరి. ఈ నిశ్చయమువలన వారు నాఁటినుండియే ఒకరికొఱకు ఒకరు పలవరింపసాగిరి.

ఒకనాఁడు నలుఁడు ఉద్యానవనమున విహరించుచుండఁగా నచ్చట హంసలగుంపు ఒకటి వచ్చి వ్రాలెను. నలుఁడు నేర్పుతో వానిలో నొకదానినిఁ బట్టుకొనఁగా అది విలవిలతన్నుకొనుచు "రాజా! దయ యుంచి నన్ను వదలిపెట్టుము. నీకు మనోహారిణి యగు దమయంతి యొద్దకుఁ బోయి నీరూపమును గుణములను వర్ణించి చెప్పి ఆమె నిన్నే పెండ్లియాడునట్లు చేసెదను" అని మనుష్యుల మాటలతోఁ బ్రార్థించెను. వెంటనే నలుఁడు సంతోషించి దానిని విడిచిపెట్టెను.

పిదప ఆ హంస అతివేగంబున తోడిహంసలతో విదర్భదేశమునకుఁ బోయి దమయంతి విహరించు ఉద్యానవనమున వ్రాలెను. అది చూచి దమయంతియు ఆమె చెలికత్తెలును ఆ హంసలను అన్నిటినిఁ బట్టుకొనిరి. పుణ్యవశమున నలునకు దొరకినహంసయే దమయంతికి దొరకెను. అప్పుడు ఆహంస మనుష్యభాషణములతో "నీప్రియుఁడైన నలునిఁ జూచి వచ్చితిని. రూపమునందును గుణములయందును. ఆతనితో సమానులు ప్రపంచమున ఎవ్వరును లేరు. అతఁడు నీకు తగిన భర్త. నీవు స్త్రీరత్నమవు. అతఁడు పురుషరత్నము" యని చెప్పెను. అదివిని దమయంతి సంతోషించి "ఎట్లయినను నన్ను అతఁడు వివాహమగునట్లు చేయుము" అని హంసను ప్రార్థించెను. హంసయు అట్లే నలునకు తిరుగ ఆ వృత్తాంతము చెప్పెను.

అది మొదలు దమయంతి నలునియందే మనస్సు నిలిపి నిద్రాహారములను మానివైచెను. ఈ సంగతి ఆమె చెలికత్తెలు ఆమె తండ్రి యగు భీమసేనునితోఁ జెప్పిరి. అతఁడు చక్రవర్తి

నాకూఁతు నెట్లు పెండ్లియాడు నని చింతించి తుదకు దమయంతీ స్వయంవరము దేశమునందు అంతటను చాటింపించెను.

త్రిలోకసంచారి యగు నారదుఁడు స్వర్గమున ఇంద్రునితో మాటలవరుసను దమయంతీ స్వయంవర వృత్తాంతము చెప్పెను. అది విని వెంటనే ఇంద్రుఁడు, యముఁడు,వరుణుఁడు, అగ్నియు నామెను మోహించి స్వయంవరమునకు బయలువెడలిరి. అప్పుడే నలుఁడు గూడ దమయంతినిఁ బెండ్లియాడ వలెనని బయలు దేరెను. లోకపాలకులకు, నలుఁడును ఒకచో సమావేశమైరి. అప్పుడు ఇంద్రుఁడు తొలుత నలునకు తన్మెఱింగించి ఏమి కావలసినను జేసెద ననిపించికొని "మా నలుగురలో నొకనిని దమయంతి పెండ్లియాడునట్లు దౌత్యము నెరపి రమ్ము" యని చెప్పెను. అది విని నలుఁడు తెల్లఁబోయి "అయ్యో! నేనును దమయంతిమీఁదనే ఆశపెట్టుకొని వచ్చుచున్నాను. అట్టి రాయిడల మీరు నన్ను ఇది కోరవచ్చునా?" యని అడిగెను. అందులకు ఇంద్రుఁడు "ఓయీ! నీవు తొలుత ఏమి కోరినను చేసెద నని ఇప్పుడు ఇట్లు అందువా? ఇది నీకు ధర్మమా? వీరసేనకుమారుఁడవు అగు నీవు అన్నమాట తప్పెదవా?" యని ఏమేమో చెప్పెను. అందులకు నలుఁడు ఏమియు చెప్పలేక వల్లె యని అంగీకరించెను. ఎవ్వరికినిఁ గాన్పింపకుండ అంతఃపురము ప్రవేశింపఁగలుగుటకు ఇంద్రుఁడు నలునకు తిరస్కరిణి అను విద్య నొసంగెను.

తిరస్కరిణీసాహాయ్యమున నలుఁడు దమయంతి అంతఃపురము ప్రవేశించెను. మన్మథునికంటె అందగాఁడు అగు నలునిఁజూచి దమయంతియు ఆమెచెలికత్తెలును ఉలికిపడిరి. అప్పుడు

దమయంతి మోహాతిరేకమువలన సిగ్గువిడిచి మెల్ల మెల్లఁగ "సుందరుఁడా! నీవు ఎవఁడవు? ఇక్కడకు ఎందులకు వచ్చితివి?" యని అడిగెను. అందులకు నలుఁడు "నేను దేవదూతను, నా పేరు నలుఁడు. ఇంద్రుఁడు, యముఁడు, వరుణుఁడు, అగ్ని అను నల్గురు లోకపాలకులు నిన్ను తమలో నొకనిని వరింపఁ బ్రార్థించుటకు నన్ను పంపిరి" యని చెప్పి "అట్లు చేయవలసినది" యని చెప్పెను. అప్పుడు దమయంతి "నేను నిన్ను తక్క ఇఁక ఎవ్వరిని వరింపను. నా చెంత నీవు ఇతరులమాట చెప్ప వలదు. అది నీకు తగదు. నీవు నన్ను వలదు అనినచో ఉరిపోసికొనియో, విషముఁ మ్రింగియో, కత్తితోఁ బొడుచుకొనియో, జలంబునఁబడియో ప్రాణములఁ బాసెదను" యని చెప్పెను. నలుఁడు ఎన్నివిధముల ప్రార్థించినను, ఎంత సుఖాశ చూపినను దమయంతి ఈ మాటలే చెప్పెను. అంత నలుఁడు చేయునది లేక వెడలిపోయి దేవతలతో ఆమె మాటలను విన్నవించెను.

పిదప భీమసేనుఁడు స్వయంవరసభ చేసెను. రాజకుమారులు అందఱును వచ్చి కూర్చుండిరి. ఇంద్రుఁడును, యముఁడును, వరుణుఁడును, అగ్నియు, కామరూపులు గావున నలుని రూపములు ధరించి నలుని దగ్గఱఁ గూర్చుండిరి. ఆకారణము వలన సభలో అయిదుగురు నలులు ఉండిరి. వారిలో నిక్కమైన నలుఁడు ఎవఁడో తెలియలేక దమయంతి "ఓ దేవతలారా! నా యెడల ననుగ్రహము వూని మీ మీ నిజరూపములను ధరింపుఁడు" యని దీనముగ ప్రార్థించెను. అప్పుడు ఆ నలుగురు లోకపాలకులును ఆమె దైన్యమునుజూచి మనస్సుకరిగి భూమిని తాఁకక అంతరాళమున నిలిచిరి. వెంటనే దమయంతి నలుని

మెడలో పూలదండ వేసెను. దేవతలు పుష్పవర్షము గురిసిరి. బ్రాహ్మణులు ఆశీర్వదించిరి. మంగళధ్వనులు చెలరేగెను.

పిదప భీమసేనుఁడు నలదమయంతులకు మహావైభవముతో పెండ్లి చేసెను. అప్పుడు నలునకు ఇంద్రుఁడు యజ్ఞసమయములయందు నిజరూపము చూపునట్లుగా, అగ్నియు వరుణుఁడును వలసినచోట అగ్నియు, జలమును గలుగునట్లును, యమధర్మరాజు ఎల్లప్పుడును నలుని బుద్ధి ధర్మమునందే ఉండునట్లును వరములు ఇచ్చి స్వర్గమునకు వెడలిరి.

మార్గమధ్యమున వారికి కలిపురుషుఁడు ప్రత్యక్షమయ్యెను. "నీవు ఎక్కడికి పోవుచున్నావు?"యని ఇంద్రుఁడు అడుగగా కలి 'దమయంతిచే వరింపఁబడుటకు'యని చెప్పెను. అది విని ఇంద్రుఁడు అతనికి జరిగిన సంగతి అంతయు చెప్పెను. కలి చాల కోపించి మాఱు పలుకక నిషధకుఁ బోయి తటివేచి నలునియందు ఆవేశించి మతి విఱిచి తాను బ్రాహ్మణవేషమున పుష్కరుఁడు అను రాజు చెంతఁ జేరి, ఆతనిచే నలుని జూదమునకుఁ బిలిపించెను. జూదమునకు రమ్మని పిలువ వెళ్ళకపోవుట ధర్మము గాదని నలుఁడు అందులకు అంగీకరించెను. పుష్కరుఁడును నలుఁడును జూదము ఆడిరి. నలుఁడు ఉన్న దంతయు నోడిపోయెను. మంత్రులు, ప్రధానులు, పురోహితులు, దమయంతి మున్నగువారు జూదము మానుమని ఎన్నివిధములఁ బ్రార్థించినను కలిప్రేరణమువలన నలుఁడు మానలేక పోయెను. అప్పుడు దమయంతి గురుజనుల అనుజ్ఞ వడసి ఇంద్రసేనుఁడు, అను కుమారుని, ఇంద్రసేన అను కుమార్తెను వార్ష్ణేయుఁడు అను వానికి అప్పగించి రథము ఎక్కించి విదర్భకుఁగొనిపొమ్మని

చంపివైచెను. పిదప అంతయు తాను గెలుచుకొనుటవలన పుష్కరుఁడు నలుని పురినుండి వెడలఁగొట్టెను.

పురిబయటి అరణ్యమున నిద్రాహారములు లేక నలుఁడు దమయంతితో మూఁడుదినములు ఉండెను. కాని పుష్కరుని వలని భయంబున అతని నెవ్వరును చూచుటకు పోరైరి. అంత బంగరు రెక్కలు గల కొన్నిపక్షులు అక్కడ సంచరించుచుండుట చూచి వానిని భక్షించి ఆఁకలి తీర్చికొనవచ్చు నని తలంచి నలుఁడు కట్టుకొనిన పుట్టము వీడి వానిపై వైచెను. పక్షులు ఆవస్త్రమును ఎత్తుకొని ఆకసమున నిలిచి "ఓయీ! మేము జూదమున నిన్ను ఓడించిన పాచికలము. నీకట్టుపుట్టము హరింప ఇట్లు వచ్చితిమి" యని చెప్పి ఎగసిపోయెను. నలుఁడు అప్పుడు జరిగిన మోసమును తెలిసికొని విచారించి దమయంతి చీరలో కొంత చించి కట్టుకొని బయలువెడలెను. కొంతదూరము పోవునప్పటికి రాత్రి అయ్యెను. నలుఁడును దమయంతియు ఆయరణ్యమునందే పండుకొనిరి. ఆయాసమువలన దమయంతికి గాఢనిద్ర పట్టెను, గాని నలునకు కునుకే రాలేదు. కొంతసేపు అయిన తరువాత నలుఁడు దమయంతిని అక్కడ విడిచి ఎందో పాఱిపోయెను.

దమయంతి నిద్రమేల్కాంచిచూచి భర్తనుగానక గోలుగోలున ఏడ్చుచు దిక్కు తెలియకపోవుచుండఁగా దారిలో నొక కొండచిలువ అడ్డువచ్చి ఆమెను మ్రింగఁజొచ్చెను. ఆమె రోదనమునువిని ఒక ఎఱుకులవాఁడువచ్చి ఆపామును చంపివైచెను; గాని వెటనే అత్యంతసుందరి యగు దమయంతిని మోహించి తన కోర్కెని ఆమెకు తెలిపెను. అది విని సహింపలేక ఆమె

"నేను పతివ్రతనైతినేని ఈదురాత్ముఁడు చచ్చిపోవు గాక" యని శపించెను. వెంటనే ఎఱుక చచ్చిపోయెను.

పిదప దమయంతి కొంతదూరమునడచి చేదిపురమునకుఁ బోవుచున్న కొందఱు వర్తకులం గలిసికొని వారితోఁగూడ ఆ పట్టణమునకు అరిగెను. ఆ పురవీథులలో ఆమె మతిపోయిన దానివలె తిరుగుచుండఁగా రాజమాత చూచి తనచెంతకు పిలిపించెను. దమయంతి ఆమెచద్ద సైరంధ్రియై పాతివ్రత్యము చెడకుండ నలునిఁ దలంచుచు దినములు గడుపఁ జొచ్చెను. అట నలుఁడు అరణ్యమునఁ బోవుచుండఁగా నొకచోట అడవి తగులఁబడి పోవుచుండెను. అందున్న ఒకనాగుబాము 'నన్ను రక్షింపుము, నన్ను రక్షింపుము' అనిఅరచెను. కనికరించి నలుఁడు దానిని బైటకుఁ దీయఁగా అది నలునిఁ గఱచెను. వెంటనే నలునిరూపము మాఱిపోయెను. అప్పుడు కర్కోటకుఁడు అగు ఆపాము నలునితో "ఓయీ! ఇట్లు అయినందులకు విచారింపకుము. నీమంగళమును గోరియే నే నిట్లు చేసితిని. నీకు నీ నిజరూపము ఎప్పుడు కావలయు నని కోరెదవో అప్పుడు నన్ను తలఁచికొనుము. నీపూర్వరూపము వచ్చుటయే కాక నీ పూర్వవస్త్రము గూడ నీకు లభించును. నీవిప్పుడు ఋతుపర్ణమహారాజు చెంతకుఁ బోయి బాహుకుఁడు అను పేరుతో అతని వంటలవాఁడవై యుండి అతనికి అశ్వహృదయము అను విద్య ఇచ్చి అతనివలన అక్షహృదయము అను విద్యను గైకొనుము. కొలఁదిదినములయందే నీవు మరల దమయంతితోఁ గూడుకొని నిషధదేశాధిపతివి అయ్యెదవు" యని చెప్పి మాయ మయ్యెను. కర్కోటకుని ఆజ్ఞను అనుసరించి నలుఁడు అయోధ్యానగరము

నకుఁ బోయి ఋతుపర్ణునివద్ద వంటలవాఁడుగను, అశ్వశిక్షకుఁడుగను ప్రవేశించెను

తన కూఁతురును అల్లుఁడును రాజ్యమును వైభవమును గోలుపోయి అడవులపాలైనా రని చారులవలన విని భీముఁడు వారినిఁ దీసికొనివచ్చినవారికి గొప్ప బహుమతులు ఇచ్చెద నని ప్రకటించెను. వెంటనే అనేకబ్రాహ్మణులు బయలువెడలిరి. అందు సుదేవుఁడు అను నాతఁడు చేదిపురమున రాజాంతఃపురమున సునంద అను రాజకుమార్తెతో నుండఁగా జూచి ఆనవాలు పట్టి విదర్భయందలి వారిసేమము చెప్పఁగా దమయంతి ఏడువఁదొడఁగెను. అదిచూచి సునంద ఆసంగతి రాజమాతతో చెప్పెను. రాజమాత సుదేవునివలన సంగతి అంతయు విని దమయంతితో "అమ్మా! నీతల్లియు నేనును అక్కచెల్లెండ్రము. మేము దశార్ణరాజు కూఁతుండ్రము" అని చెప్పి ఆమెను కౌఁగిలించికొని అనేకవిధముల బుజ్జగించెను. పిదపఁ గొన్నినాళ్లు అచ్చట నుండి రాజమాతతో దమయంతి "విదర్భయందలి వారినిఁ జూడవలయు నని కోరిక యున్నది. పంపవలయును" అని కోరెను. వెంటనే రాజమాత దమయంతిని బంగరు పల్లకిమీఁద విదర్భకుఁ బంపెను.

అట కొన్నిదినములుండి దమయంతి తల్లితో "నన్ను వెదకించి తెప్పించినట్లు నా భర్తను గూడ వెదకించి రప్పింపవలయును. లేకున్న నేను బ్రదుకఁజాలను" అని చెప్పెను. ఆమె తనభర్తతో నీవృత్తాంతము చెప్పెను. అప్పుడు "భీమరాజు నిపుణులగు బ్రాహ్మణులను రప్పించి నలుని వెదకి రండు" అని చెప్పె. "ప్రాణసమానురా లగు భార్యను వనమున విడిచి

దానిచీరలో సగము చించుకొని కఠినుఁడై ఎటకో పోయిన నలునివంటివారు ఎచ్చటనైనఁ గలరా ? అని రాజసభలలోఁ బలుకుఁడు" అని దమయంతి ఆబ్రాహ్మణులతోఁ జెప్పెను. వారు ఎల్లరును బయలుదేరి పోయిరిగాని ఏ సంగతియు తెలిసికొన నేరక తిరిగి వచ్చిరి. అందు పర్ణాదుఁడు అను నాతఁడు మాత్రము తిరిగివచ్చి దమయంతితో "తల్లీ! నీవు చెప్పిన పలుకులు అయోధ్యానగరమున ఋతుపర్ణునియాస్థానమున పలుకఁగా పొట్టివాఁడును, వంటలవాఁడును, అశ్వశిక్షకుఁడును అగు బాహుకుఁడు అనువాఁడు నన్నొంటిగాఁ జూచి 'ఏ కారణము వలన నైన మగవానివలన తప్పుచేయఁబడినను దానిని సహించుకొని యుండు స్త్రీరత్నము పొందరానిది లేదు' అని పలికి మూలుపల్కక ఎటకో పోయెను" అని చెప్పెను. బాహుకుఁడే నలుఁడై ఉండునా యని సందేహించి దమయంతి తల్లితోఁ జెప్పి సుదేవుఁడు అను బ్రాహ్మణుని రావించి "అయ్యా! నాయందు దయయుంచి నన్ను వెదకి తీసికొనివచ్చినట్లే నాప్రాణనాథునిఁ గూడఁ దీసికొని రావలయును. నీవు ఋతుపర్ణుని యొద్దకుఁబోయి 'నలుఁడు కాన్పింపకుండుటచే దమయంతికి ఎల్లి ద్వితీయస్వయంవరము చేయఁబడును. అందులకు దేశదేశములనుండి రాజులు ఎల్లరును వచ్చియున్నారు' అని చెప్పుము" అనియెను.

సుదేవుఁడు అట్లే చేసెను. అది విని ఋతుపర్ణుఁడు బాహుకునితో "ఓయీ! ఎల్లి దమయంతీద్వితీయస్వయంవరము కానున్నది. మనము వెంటనే విదర్భకుఁబోవలయును" అనిచెప్పెను బాహుకుఁడు వెంటనే బక్కగుఱ్ఱములు పూన్చిన రథమును సిద్ధముచేసికొని వచ్చెను. అది చూచి రాజు "బాహుకా! యీ

ఒక్కగుఱ్ఱములు ఒక్కదినమునమూఱు యోజనములదూరమున ఉన్నవిదర్భకు మనలను దీసికొని పోఁగలవా?" అని అడిగెను.

"రాజా! నీవు ఇందులకు సందియింపడవలదు. నా నేర్పు వలన నేఁడే ఈవేదగుఱ్ఱములు మనలను విదర్భకుఁ జేర్పఁగలవు" అని చెప్పెను. "అట్లయిన నీకుఇష్టముచేసెద"నని ఋతుపర్ణుఁడు వార్ష్ణేయుఁడు అను తన తొల్లిటి సారథితో రథ మెక్కెను. బాహుకుఁడు వెంటనే రథము నడిపింపసాగెను. రథము నడక మొదలుపెట్టిన తరువాత రాజునకు చెట్టు పుట్ట అనుభేదము తెలి యక ప్రపంచము అంతయు ఒక్కవిధముగాఁ గాన్పింపసాగెను. ఇట్లు కొంతదూరము పోయినపిదప ఋతుపర్ణుఁడు "బాహుకా! ఉత్తరీయము జారి పడిపోయినది. రథము ఆపుము" అనియెను. "అయ్యా! ఉత్తరీయము పడిన స్థలమునుండి అప్పుడే రథము యోజనదూరము వచ్చినది. ఇఁక లాభము లే"దని బాహు కుఁడు సమాధానము చెప్పెను. అది విని రాజు ఆశ్చర్యపడెను.

మఱికొంతదూరము పోయిన పిదప వారు లెక్కలేని పండ్లతోడను, ఆకులతోడను నిండియున్న విభీతకవృక్షమును చూచిరి. అంత ఋతుపర్ణుఁడు లెక్కింపకయే ఆచెట్టుయొక్క పండ్లయొక్కయు, ఆకులయొక్కయు సంఖ్యను దెలిపెను. ఆ సంఖ్య సరిగా నుండుటఁ జూచి బాహుకుఁడు ఆశ్చర్యపడెను. అప్పుడే ఋతుపర్ణుఁడు అక్షహృదయము అను ఆ విద్యను కోరఁగా బాహుకునకు నేర్పెను. ఆవిద్య నేర్పఁగానే కలి నలుని ఆవేశించి ఉండఁజాలక తొలఁగిపోయెను. నలుని హృదయము శాంత మయ్యెను. తోడనే బయలుదేరి బాహుకుఁడు క్షణ

ములో రథమును విదర్భకుఁ దెచ్చెను. భీమరాజు సేవ పడసి ఋతుపర్ణుఁడు విదర్భ ప్రవేశించెను.

దమయంతి ఋతుపర్ణుఁడు వచ్చుట చూచి కేశిని అనుచెలికత్తెను బిలిచి "అరథముమీఁద రాజు ఋతుపర్ణుఁడు అనియు రెండవ యాతఁడు అతని సారథి యగు వార్ష్ణేయుఁడు అనియు తోఁచుచున్నది. మూఁడవయాతని నెప్పుడును జూచి యుండలేదు. అతఁడు పర్ణాదునకు ప్రత్యుత్తరము ఇచ్చిన బాహుకుఁడే యగు నని తోఁచుచున్నది. పోయి వానిసంగతి తెలిసికొని రమ్ము" అని చెప్పెను. వెంటనే కేశిని అచ్చటకుఁ బోయి బాహుకునితో సందుచూచి "దమయంతి నీక్షేమము తెలిసికొని రమ్మన్నది. నీవు ఇక్కడకు ఏలవచ్చితివి" అని అడిగెను. అందులకు బాహుకుఁడు "అతివా! దమయంతి రెండవ స్వయంవరమునకు రాజులు అందఱును వచ్చుచున్నారని వినిఋతుపర్ణుఁడు వచ్చెను. ఆతనితోఁగూడ నేను వచ్చితిని. ఆతనిరథమును ఒక్కదినమున నూఱుయోజనములు నడిపించుకొని వచ్చిన నేను అతని క్రొత్తసారథిని"అని చెప్పెను. అప్పుడే కేశిని "నాఁడు అడవిలో నిద్రించునపుడు నలుఁడు చించికొనిపోఁగా మిగిలినసగముచీరనే కట్టుకొని నేలమీఁదఁ బరుండుచు సకలభోగములను విడిచి దమయంతి నలునికొఱకు పరితపించుచున్నది. ఆతని జాడ ఏరికినిఁ దెలియుటలేదు. ముందు ఏమగునో తెలియదు" అనుచుండఁగా బాహుకుఁడు విచారింపసాగెను. అదిజూచి కేశిని దమయంతిచెంతకుఁ బోయి జరిగినది అంతయుఁ జెప్పెను.

పిదప దమయంతి కేశినితో 'బాహుకుఁడు ఋతుపర్ణుని సారథియే కాక వంటలవాఁడు కూడనఁట. ఇంకను సంగతులు

తెలిసికొని రమ్ము" అని పంపెను. కేశిని ఆమె యాజ్ఞ చొప్పున అచ్చటకుఁ బోయి వచ్చి దమయంతితో "అమ్మా! అతని చరిత్రము అద్భుతముగా నున్నది. అతఁడు వంటఁ జేయ మొదలు పెట్టినపుడు పిడికెఁడు గడ్డి చేతఁ బట్టుకొని ఒకసారి విసరెను. వెంటనే అది మండి కట్టెలు అక్కఱలేకయే వంట పూర్తి యగువఱకును అట్లే ఉండెను. నీళ్లు కోరినంతమాత్రాన బిందెలు అన్నియు నిండిపోయెను. పూవులు చేతితో నలిపినను వాడిపోవుట లేదు" అని చెప్పెను. అదివిని దమయంతి బాహుకుఁడు వండిన పంటకములు తెప్పించుకొని భక్షించి బాహుకుఁడు నలుఁడే యను సందేహము ఇనుమడింప కూఁతును కొడుకును ఇచ్చి కేశినిని మరల బాహుకుని వద్దకు అంపెను.

బాహుకుఁడు ఆపిల్లలను జూచి కౌఁగిలించికొని ముద్దాడుచు విచారింపసాగెను. కేశిని అట్లేల విచారించెద వనఁగా బాహుకుఁడు "నాకొడుకును కూఁతురును ఇట్లే యున్నవారు. వీరినిఁ జూడఁగానె వారు జ్ఞప్తికి వచ్చిరి" అని చెప్పి మఱియు "నీవు ఇఁక ఇక్కడకు రావలదు. లోకము మంచిది గాదు. పెక్కు వదంతులు పుట్టవచ్చును. మేము దేశాంతరమునుండి వచ్చిన అతిథులము. మాతో నీకు ఏమి పని?" అని మందలించెను. వెంటనే కేశిని వెడలిపోయి "అమ్మా! ఇఁక సందియ మేల? బాహుకుఁడే" యని దమయంతికి విన్నవించెను.

వెంటనే దమయంతి తల్లితో "బాహుకుఁడు నలుఁడు అగుట నిశ్చయము. ఆ నిశ్చయము చేయుటకు అతని నిచ్చటకు రప్పింతువా? నేనే అచ్చటకుఁ బోవలెనా?" అని చెప్పెను. అది విని ఆమెతల్లి భీమరాజు సెలవుపొంది బాహుకుని రప్పించెను.

బాహుకుఁడు దీనాననయు, మలిన వస్త్రధారిణియు, వాడిన శరీరము గలదియు, తపస్వినియు, కన్నీటి ధారచేఁ దడిసిన చెక్కిళ్లుగలదియు అగు దమయంతినిఁ జూచెను. దమయంతి వికృతాకారుఁడై యున్నను బాహుకుని నలుఁ డనియే భావించుచు వివశయై "జనశూన్య మగుభయంకరారణ్యమున గాఢనిద్రచే మైమఱచి యున్న నన్ను, సాధ్వినై తన యానందమే జీవితపరమావధిగా నెంచుకొని సేవించు నన్ను, అగ్నిసాక్షికముగా వివాహమైన నన్ను, దేవతలను ఈసడించి తన్నే వరించి సుఖించుచున్న నన్ను, సంతానవతినైన నన్ను, నా ప్రాణేశ్వరుఁడు, నా పాలిటి వేల్పు, మహానుభావుఁడు, సర్వలోకపూజ్యుఁడు అగు నలచక్రవర్తి ఏల విడిచిపోయెనో తెలియదు. ఆ పురుషోత్తమునకు నేను ఏమి యెగ్గు గావించితినో యెఱుఁగను" అని వగవసాగెను. అది విని బాహుకుఁడు "దమయంతీ! కలి ప్రేరణచే నేను బుద్ధిని, బలమును, స్మృతిని, సమస్తమును గోలుపోయి నిర్భాగ్యుఁడ నైతిని. నేఁడు నాయదృష్టమువలనను నీ సంతాపాగ్నికి భీతిల్లియు కలి నన్ను విడిచిపోయె. కాని అతివా! నీవే ప్రాణముగా నెంచికొనియున్న నన్ను విడిచి మఱియొకనిఁ గోరి యిట్లు ద్వితీయస్వయంవరమును జాటించుట సాధ్వి వని చెప్పుకొనుచున్న నీకు తగునా?" యని అడిగెను. అందులకు దమయంతి నగుచు "ఆర్యా! వికృతాకారుఁడవై నీవు ఋతుపర్ణుని చెంత నుంటి వని పర్ణాదునివలనను, సుదేవునివలనను ఎఱింగి నిన్ను రప్పించుటకై అట్టి యుపాయమును పన్నితిని. నీవు తక్క ఈలోకములో నొకదినమున రథమును నూఱుయోజనములు నడుపఁగలవారు లేరు. ఋతుపర్ణుఁడు ఒక్కదినములో

అయోధ్యనుండి యిక్కడకు రాగలఁ డేని అందులకు నీవే కారణముగుదువనియు, నిన్ను నిస్సందేహముగా నెఱుఁగ వచ్చు ననియు ఋతుపర్ణునిచెంత స్వయంవరమును అత్యవధిగా చాటింపించితిని. నా యదృష్టవశమున తలఁచినది తలఁచినట్లు ఫలించినది. ఇంతకంటె నేను ఏమియు నీయెడల ద్రోహము తలంచి యెఱుఁగను. నేను అట్లు ద్రోహము తలంచితి నేని సూర్యుఁడు చంద్రుఁడు ముప్పదిమూఁడుకోట్ల దేవతలు నా తల వ్రక్కలగు నట్లు శపింతురు గాక" యని పలికి ఊరకుండెను. వెంటనే వాయుభట్టారకుఁడు పెద్ద ఎలుఁగున "నలసార్వభౌమా! పతివ్రతా తిలక మగు ఈ దమయంతీ దేవిని మూఁడు సంవత్సరములనుండి నేనును,సూర్యచంద్రులును ప్రాణపదముగఁ గాపాడుచున్నాము. సందేహము మాని నీవు ఆమెను స్వీకరింపుము" అని పలికెను. వెంటనే నలుఁడు సంతోషించి కర్కోటకునిఁ దలంచి ఆతఁడిచ్చిన వస్త్రము ధరించి నిజరూపము దాల్చెను.

తోడనే దమయంతి భర్తను కౌఁగిలించుకొని భోరన నేడ్చెను. నలుఁ డామెను ఊరడించెను. ఎల్లరును సంతసించిరి. ఋతుపర్ణుఁడు "మహాత్మా! చక్రవర్తి వగు నిన్ను అజ్ఞానము వలన నీచకృత్యములు చేయించిన నన్ను క్షమింపు"మని ప్రార్థించి నలునివలన అశ్వహృదయ మను విద్య నుపదేశముంది అయోధ్యకు వెడలిపోయెను. నలుఁడు దమయంతిని, బిడ్డలను విదర్భయందె యుంచి ఒకరథమును, పదియాఱు ఏనుంగులును, ఏఁబది గుఱ్ఱములును, ఆఱునందల కాల్బలమును వెంటఁబెట్టుకొని నిషధపురమునకు అరిగి మరల జూదమాడి పుష్కరుని ఓడించి

సకుటుంబమునకు స్వసామ్రాజ్యమును బడసి భార్యను బిడ్డలను రప్పించుకొని కుశలయాహ్లాదకరముగ చాలకాలము ప్రజలను బాలించెను.

## వీరాబాయి

అక్బరు ఢిల్లీసింహాసనము నాక్రమించి భారతదేశమునకు చక్రవర్తి అనిపించుకోవలయు నను తలంపుతో అక్కడక్కడ స్వతంత్రముగ దేశముల నేలుచున్న రాజులపై దండు వెడలి చిత్తూరుకోటను ముట్టడించెను. అప్పుడు ఆ కోటలో మేవాడ దేశమునకు ప్రభువు అగు ఉదయసింహుఁడు వసించియుండెను.

ఉదయసింహునకు యుద్ధము అనిన ఎంతో భయము. అంతటి పిఱికిపంద ప్రపంచమున ఇఁక లేఁడు అని అతనికి పేరు వచ్చెను. అట్టివాఁడు అగుటవలన నతఁడు అక్బరు కోట ముట్టడించెనని విని గడగడ వడఁకిపోయెను. ఈ ఆపత్తు ఎట్లు తప్పిపోవును? ప్రాణములు ఎట్లు దక్కును? అని ఆతనికి భయము పుట్టెను. ఆ హేతువు చేత అతఁడు శత్రువునకు కప్పము ఇచ్చి పంపివేయవలయునని తలంచెను; గాని సరదారులు ఆ యాలోచనను సాగనీయరైరి. వారు శత్రువును ఎదిరించి యుద్ధము చేయక తీరదని పట్టుపట్టిరి. తుదకు వారు ఉదయసింహునితో "యుద్ధము చేయనియెడల నిన్ను సింహాసనమునుండి క్రిందికి తోసివేసెదము" అని చెప్పిరి. ఇఁక తప్పదని యెంచి అతఁడు యుద్ధమునకు సిద్ధపడెను.

అంతపట్టుఁబట్టినగాని యుద్ధరంగమునకు రానివాఁడు ఏమి చేయఁగలఁడు ? తన సొంతకార్యమును గుఱించియే ఇతరులు ప్రోత్సాహపెట్టినఁగాని ప్రయత్నపడనివాఁడు ఏమి నెఱవేర్పఁగలఁడు ? సరదారుల ప్రోత్సాహవచనములు ఆతనిని యుద్ధరంగమునకు తీసికొని రాఁగలిగెను; గాని అతనికి హృదయమునందలి భయమును తొలగింపలేవయ్యెను. శత్రుసైనికులనుజూచిన వెంటనే అతని భయము మఱింత యయ్యెను. వారిచికిలీ కత్తులతళతళలు చూడఁగనే అతని కన్నులు మిఱుమిట్లు గొనెను. తుదకు ఇఁక చేయునది ఏమియు లేక అతఁడు తన వారికి యుద్ధమునకు ఆజ్ఞ ఇచ్చెను.

వెంటనే యుద్ధము ప్రారంభ మయ్యెను. రాజపుత్రులు జయము మనదే అని తలంచి ఘోరముగఁ బోరసాగిరి. కాని ఏమి లాభము? యజమానుఁడు అట్లు జడియుచున్నపుడు వారికి ఏమి ఉత్సాహ ముండును. అయినను వారు శక్తికి మించి పోరుచునే యుండిరి. ఈ నిరుత్సాహమువలనను, శత్రుసేన అధికముగ నుండుటవలనను వారి యాశ ఫలింప దయ్యెను. పిఱికిపంద అగు ఉదయసింహుఁడు శత్రువులకు దొరకిపోయెను. అక్బరు అతనిని చెఱపట్టెను.

రాజు శత్రువులకు దొరకిపోవుటవలన రాజపుత్రులు విచారముతో కోటలో ప్రవేశించిరి; గాని వారి స్త్రీలు వారిని అనేకవిధముల నిందించిరి. వారు "యుద్ధరంగమునుండి పాఱి పోయి వచ్చిన మీ ముఖములు మేము చూడము" అని తలుపులు వేసికొనిరి. ఈ నిందలు పడలేక రాజపుత్రులు రాజు

సభకువచ్చి "ఉదయసింహ మహారాజును విడిపించుట ఎట్లు?" అని ఆలోచింపఁదొడఁగిరి.

ఈ సంగతి రాణి అగు వీరాబాయికి తెలిసెను. అట్లు జరిగినందులకు ఆమె అనేకవిధముల వగచెను. "నాభర్తను తురకలు ఖైదుచేసిరి. రాజపుత్రులు ఓడిపోయిరి. చిత్తూరు ఇఁక తురకలపాలు అగును. మనము గూడ వారి స్వాధీన మగుదుము" అని అనేకవిధములఁ నాలోచింపఁదొడఁగెను. ఇట్టి ఆలోచనతో ఉన్న ఆమె తన యెదుట పడియున్న కత్తులు కటారులు మున్నగు ఆయుధములు చూచెను. వెంటనే ఆమెకు కోపము వచ్చెను. "రాజపుత్రులు ఓడిపోయెదరా? మహారాజును తురకలు ఖైదుచేయఁగలరా?" అని తలంచుచు ఆమె వెంటనే పురుషవేషము వేసికొని గొప్ప ఆయుధములను ధరించి రాజపుత్రులు ఉన్న సభకు వచ్చెను.

యోధవేషముతో నున్న రాణినిఁ జూచి వారు ఆశ్చర్యపడిరి. అప్పుడు ఆమె వారిని అందఱను జూచి "మీరు అందఱును ఏమిచేయుచున్నారు? మహారాజు శత్రువులచేఁ జిక్కెను. చిత్తూరునకుఁ గూడ ఆగతి పట్టునా? మీ పౌరుషము అంతయు ఏమైపోయినది? మీకు ఎట్టిపేరు వచ్చునో ఊహించుకొంటిరా? రాజుగారిని తురకలకు అప్పగించి వచ్చి ఈసభలోఁ గూర్చుండుటకు మీకు సిగ్గు లేదా? ఓ శూరులారా! లెండు. మీ ప్రతాపము వెల్లడిసేయ నిదియే సమయము. రాజపుత్రులు అసాధ్యులు అని శత్రువులకుఁ జాటింప నిదియే సమయము. జయహర! జయమహాదేవ! అను రణఘోషముతో విరోధులచెవులు గింగురువోవునట్లు చేయుఁడు. ఒరనుండి కత్తులు

దూసి తురకలపై నుఱుకుఁడు. నే నిదే యుద్ధమునకుఁ బోవు చున్నాను" అని గుఱ్ఱము ఎక్కెను.

ఆమెమాటలు వినియు, ఆమెచేతలు చూచియు రాజపుత్రులు సిగ్గుపడి వెంటనే మండిపడుచు లేచి "ఇదే మేము యుద్ధరంగమునకుఁ బోవుచున్నాము. మేము శత్రువులను చంపెదము. లేకున్న చచ్చెదము" అని చెప్పి తటాలున లేచిరి. వెంటనే రాణి గుఱ్ఱమును ఉఱికించెను. రాజపుత్రులు ఆమె వెంట యుద్ధమునకు పరుగెత్తుకొనిపోయిరి.

ఈ విధముగా రాజపుత్రులు ఆకస్మికముగా మీఁదఁ బడుటఁ జూచి తురకలు తెల్లవోయిరి; కాని వెంటనే ధైర్యము తెచ్చుకొని రాజపుత్రులను ఎదిరించిరి. ఘోర ఘోరము అయ్యెను. క్షణములో రక్తనదులు ప్రవహింపఁ జొచ్చెను. సింహములవలె ఒడలు మఱచి తురకలను సంహరించు రాజపుత్రులనుజూచి వీరాబాయియు, కాళికాదేవివలె మండిపడుచు మ్లేచ్ఛులను కసిమసంగు వీరాబాయినిఁ జూచి రాజపుత్రులు ను మఱింతధైర్యముతోఁ బోరసాగిరి. అట్టిచో ఇఁక తురకలు ఎన్నిలక్షలు ఉండిన ఏమి లాభము? తురకలు రాజపుత్రుల ధాటికి తాళఁజాలక పాఱిపోసాగిరి. అయినను రాజపుత్రులు వారిని విడువక వెంటనెంటి పొడిచివేసిరి. ఈ యుపద్రవమును జూచి అగ్బరు ఇఁక ప్రయోజనము లేదని తలంచి తెల్ల బావుటా ఎత్తించెను. తోడనే వీరాబాయి శాంతించెను. ఆమెను జూచి రాజపుత్రులు గూడ శాంతించిరి. అగ్బరు ఉదయసింహుని విడిచి పెట్టి వీరాబాయి వద్ద అపరాధమును ఒప్పుకొని బ్రతుకుజీవుఁడాఅని డిల్లీకి పాఱిపోయెను.వీరాబాయి భర్తతోఁ

కూడ రాజపుత్రుల జయఘోషములతో కోటలోఁ బ్రవేశించెను. మేవాడు దేశమునందలి ప్రజలు ఎల్లరును ఆమెను చాల పూజించిరి.

---

# చంద్రమతి

దేవలోకమున సుధర్మ అను తన సభలోఁ గొలువుదీఱియుండి దేవేంద్రుఁడు, ఒకనాఁడు వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు, అత్రి, గౌతముఁడు మున్నగు మునీశ్వరులను జూచి భూలోకములో ఎట్టి సమయమందైనను అబద్ధ మాడని మానవోత్తముఁడు కలఁడా? అని ప్రశ్నించెను. ఇది విని మునులు అందఱును ఏమియుఁ దోఁచక ఊరకుండిరి. వసిష్ఠుఁడు మాత్రము అట్లు ఊరకుండుట మంచిది గాదని తలంచి దిగ్గున లేచి నిశ్శబ్దమై ఉన్న సభ ప్రతిధ్వనించునట్లు చేయెత్తి "ఇంద్రా! నీవు చక్కఁగాఁ బ్రశ్నించితివి. భూలోకము సత్యసంధుల విషయమున గొడ్డుపోలేదు. హరిశ్చంద్రచక్రవర్తి యంతటి సత్యసంధుఁడు ముల్లోకములయందును లేఁడు" అని చెప్పెను.

అది విని విశ్వామిత్రుఁడు "హరిశ్చంద్రుఁడు మానవులందఱియందును సత్యసంధుఁడుగావచ్చును; గాని అంత పొగడవలసిన ఆవశ్యకము ఉండదు" అనియెను. ఆమాట సహింపక వసిష్ఠుఁడు విశ్వామిత్రునితో "నీవు అట్లు ఏల పలుకుచున్నావో

ఎఱుంగ లేకున్నాను. ఆ హరిశ్చంద్రచక్రవర్తిని గుఱించి నీవు అంత చులకనగా తలంచుట ధర్మము గాదు. అతనిని గుఱించి చెప్పుటకు నేను తగను. అతఁడు అంతటి గొప్పవాఁడు" అని చెప్పెను. మరల విశ్వామిత్రుఁడు "అట్లు చెప్పవద్దు. బ్రహ్మాండము మునిఁగిపోవునంతటి స్థితి వచ్చినఁ గాని అతఁడు అబద్ధము ఆడకపోవచ్చును. ఆ హేతువువలన అతఁడు మానవులలో ఉత్తమోత్తముఁడు కావచ్చును. గాని అంతమాత్రమున జరామరణదూషితు లగు మనుష్యులలో అబద్ధమును దరికిఁ జేరనీయనివాఁడు ఉండు నని చెప్పుటకు వీలు లేదు" అని యొత్తి పలికెను. వసిష్ఠుఁడు విశ్వామిత్రుని వాదమును మరల ఖండించెను. వసిష్ఠుని వాదమును విశ్వామిత్రుఁడుగూడ తిరిగి విమర్శించి పస లేదనియెను. ఈతీరున వాదము పెరిగిపోయెను. ఒకరిమాట ఒకరికి నచ్చ దయ్యెను. తుదకు విశ్వామిత్రుఁడు "నేను ప్రత్యక్షముగఁ జూచినఁ గాని ఈవిషయమును నమ్మఁ జాలను. నేను హరిశ్చంద్రునకు అబద్ధ మాడకున్న కొంప మునింగిపోవు అవస్థలను అన్నిటిని సంభవింపఁ జేసెదను. అప్పటికిని అతఁ డసత్య మాడనిచో అతనికి నా తపస్సులో సగము ధారవోసెదను" అని శపథము కాల్చెను. కొందఱు మునులు "అది బాగుగ నున్న"దనిరి. మఱికొందఱు "మీమీ వాదము లెట్లున్నను హరిశ్చంద్రునిబాధించుట ధర్మముగా" దనిరి. మఱికొందఱు "అగ్నిలోఁ బడవేయకున్న బంగారమునకు వన్నె కలుగునట్లు ఆపత్తులు వచ్చినఁ గాని మహాత్ముల తేజస్సు ప్రకటన గాదు. అప్పుడు గాని వారి మాహాత్మ్యము తెలియదు. కావున పరీక్ష ఆవశ్యకమే" అనిరి. ఇట్లు అందఱును

అన్నివిధములఁను జెప్పిరి. తుదకు హరిశ్చంద్రుని పరీక్షింపవలయు నని యే నిశ్చయింపఁబడియెను.

"అయ్యో! ఈవిశ్వామిత్రునితో నేను ఏలవాదించితిని? ఈతఁడు భల్లూకమువలె పట్టినపట్టు విడువఁడు. పరీక్ష పేరుచెప్పి ఈతఁడు హరిశ్చంద్రుని ఏమి తిప్పలు పెట్టునో" యని వసిష్ఠుఁడు తొలుత నొకింత వగచెను; గాని తుదకు ఈపరీక్షవలన ప్రథమమున ఆయాసమే గలిగినను ఆ మహాత్ముని కీర్తిలతి దశదిశల వ్యాపింపఁగలదు" అని భావించెను. ఇట్లు దేవసభలో నిశ్చయింపఁబడిన వెంటనే విశ్వామిత్రుఁడు ఇతరవిషయముల నన్నిటిని విడిచి హరిశ్చంద్రుని సత్యసంధతను పరిశోధింపఁ బూనుకొని హరిశ్చంద్రుని ఆస్థానమునఁ బ్రత్యక్షమయ్యెను. అట్లు వచ్చిన మునిని హరిశ్చంద్రుఁడు యథావిధిగఁ బూజించి "ఏమి కావలయును" అని కోరఁగా ముని "నేను ఒక యాగము చేయుటకు నిశ్చయించితిని. దానికి ఏనుఁగుమీఁద నొకమనుష్యుఁడు ఎక్కి రత్నమును మీఁదికి విసరిన ఎంత ఎత్తునకుఁ బోవునో అంత యెత్తు ధనరాశి కావలెను" యని చెప్పెను. హరిశ్చంద్రుఁడు "ఇచ్చితిని" అనియెను. "రాజా! అంతధనము మాపర్ణశాలలలో ఎటు దాఁపఁగలము? కావలసినప్పుడు తీసికొని పోయెద. అంతవఱకు నీవద్దనే ఉండనిమ్ము" అని చెప్పి విశ్వామిత్రుఁడు వెడలిపోయెను.

ఒకనాఁడు హరిశ్చంద్రుఁడుభార్య అగుచంద్రమతితోడను కొడుకగు లోహితాస్యునితోడను తగుపరివారముతోడను అరణ్యమునకు వేఁటకు అరిగి ఇచ్ఛవచ్చినట్లు మృగములను సంహరించి ఆయాసమువలన ఒకచో విశ్రమించెను. అప్పుడు

ఇరువురు మాలవనితలు వచ్చి "మేము సంగీతము పాడెదము. మమ్ము రాజు నెదుటకుఁ గొనిపొండు" అని భటులతోఁ జెప్పిరి. భటులు రాజుగారి సెలవు పొంది మాలెతలను లోనికిఁ గొని పోయిరి. వారియద్భుతసంగీతమునకు ఆనందించి హరిశ్చంద్రుఁడు "మీ కేమి కావలయు"నని చెప్పఁగా మాలెతలు "రాజా! నిన్ను మోహించి వచ్చితిమి. నీతో సుఖించుటయే మా కోరిక" అని చెప్పిరి. అది విని రాజు "హరహరా!" అని చెవులు మూసికొని "నిముసములో నాయెదుటనుండి ఈమాలెతలను తొలఁగింపుఁడు" అని భటులకు చెప్పెను. ఎంత చెప్పినను మాలెతలు అక్కడ నుండి కదలకపోవుటచే భటులు వారిని కొట్టి ఈడ్చివేసిరి. అంత గోలుగోలున ఏడ్చుచు మాలెతలు వెడలిపోయిరి. వెంటనే విశ్వామిత్రుఁడు మండిపడుచు వచ్చి "ఆబాలికలు మాయాశ్ర మమున కన్నకూఁతుండ్రవలె మెలఁగుచున్నారు. వారిని అల్లం దులకు కొట్టించితివి?" అని అడిగెను. అందులకు హరిశ్చంద్రుఁడు "నేను వారిని కొట్టింపలేదు. వారు నన్ను అయోగ్యమగు కోరికను కోరఁగా భటులతో నాయెదుటనుండి వారిని తొలఁగిం పుఁ డని చెప్పితిని. మాలెతలు ఎంతకును కదలకపోవుటచే భటులు కొట్టిరి" అని ఎంత చెప్పినను వినక ముని "వారి కోరికను తీర్పుము. లేకున్న నా కోపము చల్లారదు" అని చెప్పెను. "పరస్త్రీలకు వక్షస్థ్సలము తక్క ఇఁక నేమి కోరినను ఇచ్చెదను" అని హరిశ్చంద్రుఁడు అనియెను. "అటులయిన నీ రాజ్యమును నీ యధికారమును నాకు ధారవోయుము" అని ముని చేయి చాపెను. "నాథా! సందేహము వలదు. ఇట్టి పాత్రుఁడు దొర

కుట కష్టము. వెంటనే మునికోరిక తీర్పుడు" అని చంద్రమతి భర్తతో చెప్పెను. హరిశ్చంద్రుఁడు మునికోరిక తీర్చెను.

ముని "వెనుక నీవు నా యాగముకొఱకు దానముచేసిన ధనము ఇప్పుడు ఇమ్ము" అని కోరెను. బొక్కసముతోఁగూడ రాజ్యము అంతయును మీా స్వాధీనము చేసితిని గాదా" యని రాజు అడుగఁగా "దానికిని దీనికిని సంబంధము లే"దని ముని చెప్పెను. "అట్లు అయినచో ఎట్లో కష్టపడి నెలదినములలో ఆ సొమ్ము తీర్చెదను" అని రాజు చెప్పెను. అందులకు అంగీకరించి ముని "హరిశ్చంద్రునివలననుండి సొమ్ము వసూలుచేసికొనిర"మ్మని నక్షత్రకుఁడు అను శిష్యునితో చెప్పి "ఇఁక నారాజ్యమునుండి వెడలిపొమ్ము" అని రాజుతో చెప్పెను. రాజు అక్కడనుండియే కాశికిఁ బ్రయాణ మయ్యెను. ఎట్లో హరిశ్చంద్రునివలన అబద్ధ మాడింపు మని ముని నక్షత్రకునకు ఉపదేశించెను.

ఇట్టి అవస్థ వచ్చినందులకు చంద్రమతి ఏమియు వగవ లేదు. ఆమె భర్తకు అనేకవిధముల ధైర్యము గొలుపఁ దొడఁగెను. "మునులు సదయహృదయులు. అందును విశ్వామిత్ర మహర్షి రాజ్యపాలనమున నేర్పరి. ఆమహానుభావుని ఏల్బడిలో ప్రజలు తొల్లిటికంటె ఎక్కుడు సుఖించెదరు. పాత్రదానము చేయుటవలన మనము ధన్యుల మగుట్యదము. అంతయు బాగు గ జరిగినది, మునిఋణము తీర్చివైచి శ్రీవిశ్వేశ్వరుని సన్నిధిని, అన్నపూర్ణను గంగాభవానిని సేవించుచు మనము కాశిలో జీవితములు గడుపుకొనవచ్చును" అని ఆమె తఱుచు చెప్పుచు భర్త విచారములను ఉడుపఁ జొచ్చెను. చంద్రమతి బోధవలనను సహజముగ ధీరుఁడు అగుటవలనను అతఁడు విచారమును విడిచి

పెట్టెను. కాని మునిఋణము తీర్చుట ఎట్లు అని మాత్రము ఆతనికి బెంగ తటస్థించెను.

ఒకనాఁడు వారుఉన్నచోట అడవినాల్గువైపులను అంటుకొని దారుణముగ మండిపోఁజొచ్చెను. ఆ విపత్తునుండి తప్పించుకొనుటకు హరిశ్చంద్రునకు ఉపాయము తోఁచదయ్యెను. "మనము చనిపోయెదమని నాకు విచారము లేదు. మునిఋణము తీర్చుటకు వీలు లేక పోవునేమో అనియు, సుకుమారుఁడు అగు ఈ మునిబాలకుఁడు మన కారణమున చనిపోవునేమో అనియు నేను విచారించుచున్నాను" అని హరిశ్చంద్రుఁడు చెప్పెను. "మీకు ఆ చింత వలదు. మనకు ఏమియు విపత్తు కలుగఁబోదు. భగవంతుఁడు ఈ దీనులను కాపాడక పోఁడు" అని చెప్పి చంద్రమతి పతి పాదములను మనస్సులో ధ్యానించుచు ఆ అగ్నిహోత్రమున దుమికెను. వెంటనే అగ్ని చల్లారెను. అది చూచి నక్షత్రకుఁడును, హరిశ్చంద్రుఁడును,లోహితాస్యుఁడును అబ్బురపడిరి. మఱియు హరిశ్చంద్రుఁడు "చంద్రమతిని భార్యగాఁ బడసినందులకు నేను ధన్యుఁడను. ఇఁక నన్ను ఎట్టి ఆపదలును పీడింపఁజాలవు" అని ధైర్యము వహించెను. మఱి నాల్గు దినములకు వారు క్షేమముగ కాశీనగరము చేరికొనిరి.

వారు అక్కడ చేయవలసిన పనులు అన్నియు ముగిసిన తరువాత నక్షత్రకుఁడు రాజును సొమ్ము ఇమ్ము అని కోరెను. మఱియొకమార్గము కాన్పింపనందున హరిశ్చంద్రుఁడు భార్యను అమ్మ చూపెను. కాలకౌశికుఁడు అను బ్రాహ్మణుఁడు ఆమెను చాల ధనము ఇచ్చి కొనియెను. నక్షత్రకుఁడు ఆసొమ్ము పుచ్చుకొని "ఇది నా భత్యముక్రింద చూచుకొనియెదను. మా

గురువు ఋణము నీవు ఇంకను తీర్చవలసియున్నది" అని చెప్పెను. చంద్రమతి లోహితాస్యునితో కాలకౌశికుని ఇంటికిఁబోయెను. పిదప హరిశ్చంద్రుఁడు తాను వీరబాహువు అను చండాలునకు అమ్ముడువోయి ఆ ధనముతో ముని ఋణము తీర్చెను. అతనికి కాటి కాపరితనము వచ్చెను.

ఒకనాఁడు లోహితాస్యుఁడు అడవిలో చెట్టు ఎక్కి ఆకులు కోయఁబోగా పాము కరచి చనిపోయెను. దిక్కులేనిది అగుట వలన చంద్రమతి స్వయముగ కుమారుని వల్లకాటికి తీసికొని పోయెనుగాని వీరదాసు అను పేరుతో కాటిని కాపాడుచున్న హరిశ్చంద్రుఁడు "మాడ ఇచ్చినఁ గాని దహనముచేయుటకు వీలులేదు" అని ఆమెను నిరాకరించెను. పిమ్మట వారు ఇరువురును ఒకరినొకరు ఆనవాలు పట్టుకొనిరి. మాడ తీసికొని వచ్చుటకు చంద్రమతి బసకు పోయెను.

కుమారుఁడు చనిపోయినందులకు హరిశ్చంద్రుఁడు అక్కడ విచారించుచుండఁగా రాజభటులు చంద్రమతిని కట్టితీసికొని వచ్చి "ఈమె నగలకొఱకు మా రాజకుమారుని చంపినది. కావున ఈమెను చంపుమని రాజుగారి సెలవు అయినది" అని చెప్పిరి. అది విని హరిశ్చంద్రుఁడు ఆశ్చర్యపడెను. "ఇఁక లాభములే"దని పూని కత్తివిసరఁగా ఆమె చావదయ్యెను. అప్పుడు హరిశ్చంద్రుడు "నేను ఎప్పుడును అధర్మము చేయకపోయినయెడ ఈతడవ చంద్రమతి కంఠము తెగుఁగాక" అని మరల కత్తి విసరఁబోవుచుండఁగా ఈశ్వరుఁడును, శ్రీమన్నారాయణుఁడును, విశ్వామిత్రుఁడును, వసిష్ఠుండును వచ్చి వారించిరి. అతని సత్యసంధతకు మెచ్చి విశ్వామిత్రుఁడు తన తపస్సులో సగము ధార

పోసెను. రుద్రుఁడు మున్నగు వారు అనేకవరములు ఇచ్చిరి. లోహితాస్యుఁడు బ్రతికెను. మరల రాజ్యమును పొంది జనులు ఎల్లరును జయజయ అని కొనియాడుచుండ హరిశ్చంద్రుఁడు వచ్చి రాజ్యమును పాలింపఁదొడఁగెను. చంద్రమతి పాతివ్రత్యమును జూచి అందఱును ఆమెను పూజింపసాగిరి.

---

# దుర్గావతి.

ఉత్తరభారతదేశమునందలి బుందేలు ఖండు అను సంస్థానమునకు ఏలిక అగు చందేలు రాజునకు దుర్గావతి అను ఒక కుమార్తె యుండెను. ఆమె వయసు వచ్చినకొలఁది సుగుణరాశియై, విద్దెల ప్రౌఢయయ్యెను. ఇన్నిటికిని ఆమె సౌందర్యము అలంకారము అయ్యెను. అట్టి సుందరి ఇఁక భూలోకమున నుండదని ఆమె పేరు గాంచెను. ఆమె సంపూర్ణయౌవనవతి యగునప్పటికి ఆమెసౌందర్యము లోకమునందు అంతటను తెలిసెను.

అట్టి త్రిలోకసుందరి అగు దుర్గావతిని పెండ్లియాడవలయునని అనేక రాజపుత్రులు ముచ్చటపడసాగిరి. వారిలో అనేకులు అందులకే చందేలురాజును ఆశ్రయింపఁ జొచ్చిరి. చాలమంది వర్తమానము లంపిరి. కొందఱు తిన్నగ దుర్గావతికే రాయబారములు అంపిరి. మఱికొందఱు ఆమె తల్లిని ప్రార్థింపఁ దొడఁగిరి. ఇట్లు ఎందఱు ఎన్నివిధములఁ బ్రయత్నములు చేసినను ప్రయోజనము లేదయ్యె. చందేలురాజు వారిని లెక్కసేయలేదు.

స్త్రీలలో దుర్గావతివలెనే ఆకాలమున గఢామండలమును పరిపాలించు గోండురాజు పురుషులలో చాల అందగాఁడై యుండెను. కొలఁది దినములయందే దుర్గావతి అందగత్తె అని గోండురాజును, గోండురాజు అందకాఁడు అని దుర్గావతియు వినిరి. వెంటనే తాము పెండ్లియాడవలె నని వారు తలంచిరి. అప్పుడు గోండురాజు "దుర్గావతిని తనకు ఇచ్చి పెండ్లిచేయుము" అని చందేలురాజునకు వర్తమానము చేసెను.

గోండురాజు కులమున తనకంటె తక్కువవాఁడు అగుటవలన చందేలురాజు దుర్గావతిని ఆతనికి ఇచ్చుటకు తొలుత కొంత సందేహించెను; గాని ఆతఁడు చాల బలవంతుఁడు అగుటవలనను, సుగుణములు కలవాఁడు అగుటచేతను, విశేషించి రసికుఁడు అగు అందగాఁడు అగుటం జేసియు మాఱుమాటలు పల్కక తుదకు అంగీకరించెను. దుర్గావతికిని గోండురాజునకును వివాహము అయ్యెను.

దుర్గావతి అత్తవారింటికి వెళ్లినపుడు చిన్నతనము నుండియు తన్ను పెంచిన దాదులకు పెద్ద పెద్ద బహుమతులు చేసెను. చెలికత్తెలకు అనేకములగు నగలను ఒసంగెను. బ్రాహ్మణస్త్రీలకును, చదువు చెప్పిన గురువులకును మాన్యములు ఒసంగెను. చాలమంది బీదలకు చాల దానములు చేసెను. అది అంతయుఁజూచి ప్రజలు అందఱును చాల సంతసించిరి, చాల దీవించిరి. వారిని విడువలేక విడువలేక దుర్గావతి గఢామండలమునకు భర్తయింటికి వెడలిపోయెను.

చక్కనిచుక్క అగుటవలనను, సుగుణశాలి అగుటవలనను, విశేషించి జాణ అగుటవలనను దుర్గావతితోడనే గోండు

రాజు ఎల్లప్పుడును కాలము గడుపసాగెను. రాజ్యపాలనమున అశ్రద్ధ చూపసాగెను. ఎంతసేపును అతఁడు దుర్గావతిని వెంటఁబెట్టుకొని నర్మదానదీతీరములయందును, ఉద్యానవనములయందును విహరించుటయందును ఆసక్తి చూపఁదొడఁగెను. వినోద భవనములకొఱకును, వింతవస్తువులకొఱకును ఎక్కుడు ధనము వ్యయపెట్టఁజొచ్చెను. రాజ్యాధికారము అంతయు మంత్రులకు అప్పగించివేసెను. ఇది తగదని దుర్గావతి భర్తకు అనేకపర్యాయములు నయమునను, భయమునను, జనవునను బోధించెను; గాని ఫలము లేదయ్యెను. ఆమాటలు ఏమియు అతఁడు వినిపించుకొనఁడయ్యెను. కాలము ఇట్లు కడచిపోవుచుండఁగా దుర్గావతి గర్భవతి అయ్యెను.

తొమ్మిదిమాసములు కడచినతరువాత దుర్గావతి కుమారునిఁ గనియెను. పుత్రుఁడు కలిగినందులకు గోండురాజు చాల సంతసించెను. దేశమునందలి ప్రజలు గూడ సంతసించిరి. బుందేలుఖండమునందలివారుగూడ చాల ఆనందించిరి. అప్పుడు గూడ దుర్గావతి మఱల భర్తకు "రాజ్యపాలనమున శ్రద్ధ చేయుఁడు" అని చెప్పుచు వచ్చెను; గాని రాజు వినఁడయ్యెను. తుదకు కుమారుఁడు పదియేండ్లవాఁడు అయినప్పుడు గోండురాజు ఏదో రోగమువలన చనిపోయెను.

ఇఁకఁ దుర్గావతి విచారమును ఏమని చెప్పగలను? ఆమెకు ఆక్షణము పిడుఁగు మీఁదఁబడినట్లు అయ్యెను. అయినను ఏమి చేయవచ్చును? ఆపదలు వచ్చినప్పుడు ధైర్యము చిక్కఁబట్టకున్న ఏమగును? అట్టి సమయములయందు విచారించుటవలన ఫలము ఏమి? దుర్గావతి ధైర్యముగలది అగుటవలన విచార

మును అడఁచివేసికొని కుమారుని శుభము గోరి స్వయముగ రాజ్యమును పాలింపఁదొడఁగెను. కొలఁది దినములయందే దుర్గావతి రాజ్యముచేయుటలో చాల తెలివితేటలు గలది అనియు, చాలమంచిదనియు పేరు గాంచెను. దేశదేశములయందు ఆమెను అనేకులు కొనియాడఁ దొడఁగిరి.

ఢిల్లీని పాలించుచున్న అక్బరు ఇది విని ఇంత తెలివితేటలుగల రాణి తనకు సామంతురాలై యున్నచో గౌరవము అని భావించి గొప్ప సైన్యమును ఇచ్చి అసఫ్‌ఖానుఁడు అను వీరుని దుర్గావతిమీఁదికి యుద్ధమునకుఁ బంపెను. ఇట్టి ఆపద తటస్థించినందులకు ఆమె ఏమియు భయపడక "క్షత్రియస్త్రీని అగు నేను ఈతుర్కీవానికి సామంతురాల నయ్యెదనా?" అని తలంచి పురుషులకంటె ఎక్కుడు ధైర్యముతో శత్రువీరులను ఎదిరించి యుద్ధమునకు స్థిరపడియెను.

గఢామండలసైనికులు తమ రాణిధైర్యమును జూచి మఱింత ఉత్సాహముతో శత్రువులను సంహరింపసాగిరి. పోరు చాల ఘోరమయ్యెను. అసఫ్‌ఖానుఁడు తన సైన్యము తఱిగి పోవుట చూచి ఢిల్లినుండి మఱికొంత సైన్యమును పిలిపించుకొనియెను. ఈక్రొత్తదండు చాల ఎక్కుడుగా వచ్చుటచే గఢామండలసైనికులు చాలమంది చనిపోయిరి. ఇఁక మనకు జయము గలుట అబద్ధము అని వారు నిశ్చయించుకొనిరి. ఇట్లుండఁగా దుర్గావతి ఒకచో యుద్ధము చేయునపుడు అసఫ్‌ఖానుఁడు వచ్చి ఆమెను సంహరింపఁ జూచెను; గాని చెంతకు చేరలేక దూరమునసిలిచి బాణవర్షమును గురియసాగెను. దుర్గావతి ఆ బాణములను అన్నిటిని దునిమెను; గాని ఒకబాణము

వచ్చి తటాలున ఆమె కన్నున గ్రుచ్చికొనియెను. రాణి వెంటనే ఆబాణమును ఊడఁబెఱికివైచెను. అక్కడతన చాలరక్తము ప్రవహించి ఆమెను దడిపివైచెను. అయినను ఆమె యుద్ధముఁ జేయుట మానలేదు.

ఇట్టి సమయమున ఒక వీరుఁడు ఏనుఁగును ఎక్కివచ్చి దుర్గావతినిఁ బిలిచి అమ్మా యువరాజు శత్రువుల బాణములు తగులుటచే మూర్ఛవచ్చిపడిపోయినారు. మనసైన్యము నశించి పోయినది. ఇఁక పోరుటవలన లాభము లేదు. కొలఁది కాలములో శత్రువులువచ్చి మిమ్ము కైదు చేయఁగలరు. కావున ఈ ఏనుఁగును ఎక్కరండు. మిమ్ము అపాయములేనిచోటికిఁ గొని పోయెదను" అని చెప్పెను. అందులకు దుర్గావతి విచారింపక 'నీవు పోయి యువరాజును కనిపెట్టుకొని యుండుము. ఇప్పుడు నేను ఇక్కడనుండి కదలుటకు వీలు లేదు. నేను క్షత్రియస్త్రీని. నాకు భయములేదు' అని ప్రత్యుత్తరము ఇచ్చి మరల పోర సాగెను.

కాని ఆమె కొలదిసేపటిలోనే మిగుల డస్సిపోయెను. అప్పుడు ఆమె ఆవీరునితో 'ఓయీ! నేను వెనుకకు రాఁజాలను. నన్ను ఇక్కడ చంపివేయుము. అట్లు అయిన నాకు వీరస్వర్గము వచ్చును.' అని చెప్పెను గాని ఆవీరుఁడు ఆపని చేయఁజాలక పోయెను. ఆ హేతువుచేత దుర్గావతి స్వయముగ కత్తితోఁ బొడుచుకొని ప్రాణములు విడిచెను. వెంటనే ఆమెదేహమును తుర్కివాండ్రు ముట్టకుండ ఏనుగుమీఁదఎక్కించుకొని ఆతఁడు ఎక్కడకో పోయెను.

# లోపాముద్ర



సత్యవ్రతుఁ డనుమహారాజు విదర్భదేశమును ఏలుచుండెను. అతనికి తలిదండ్రులు చిన్నతనమున మఱియొక పేరుపెట్టిరి; గాని యెల్లప్పుడును ఆతఁడు సత్యమునే పలుకుచుండుటచేత సత్యవ్రతుఁడు అని యెల్లరును పిలువఁదొడఁగిరి. ఆతఁడు చాల మంచివాఁడు అగుటచే దేశమునందలి ప్రజలు అందఱును చాల సుఖముగా నుండిరి.

ఆరాజునకు లేక లేక లోపాముద్ర అనుకొమార్తె పుట్టెను. రాజును రాణియు ఆబిడ్డను ప్రాణములవలెఁ జూచుకొనుచు చాల గారాబముతో పెంచుకొనసాగిరి. లోపాముద్ర అస్వస్థతగానున్నను ఏ చిన్నికారణమువలననైన నేడ్చినను వారు ఇరువురును చాల కళవళపడసాగిరి. యుక్తసమయమున రాజు కొమార్తెకు అక్షరాభ్యాసము చేయించి యోగ్యుఁడు అగు ఒక బ్రాహ్మణుని ఆమెకు చదువుచెప్పుటకు ఏర్పఱిచెను. స్త్రీలలో మేలుబంతి కావలె నని ఆమెను తల్లి చాల మెలఁకువతో సన్మార్గమున నడుపఁజొచ్చెను.

లోపాముద్ర కుశాగ్రమతి యగుటచే గురువు చెప్పిన పాఠములను చాల మెలఁకువతో గ్రహించుచు స్త్రీలకు ఆవశ్యకములైన సకలవిద్యలను స్వల్పకాలమునందే ఎంతోసులభముగ నేర్చెను. తల్లివద్ద సత్ప్రవర్తనము గూడ నేర్చికొనెను. అప్పటికి సంపూర్ణయౌవనవతి గూడ అయ్యెను. ఇన్నిటివలన

నామె పరిమళ మబ్బిన బంగారమువలెను, మార్దవ మబ్బిన కప్పురమువలెను ప్రకాశింపసాగెను.

లోపాముద్రయొక్క సౌందర్యమును సత్ప్రవర్తనమును విని అనేకరాజకుమారులు ఆమెను పెండ్లియాడవలయు నని యువ్విళ్లూరసాగిరి. సత్యవ్రతుఁడును కుమార్తెకు తగినవరునిఁ దెచ్చుటకై చాల ప్రయత్నించుచుండెను. పురోహితులుపోయి అందగాండ్రు అగు రాజకుమారుల చిత్రపటములను దెచ్చిరి; గాని లోపాముద్రను వారు ఎవ్వరును నచ్చరైరి.

ఇట్లుండఁగా నొకనాఁడు సత్యవ్రతమహారాజు కొలువు కూటమునకు అగస్త్యమహాముని వచ్చెను. అగస్త్యుఁడు చాల గొప్పవాఁడు. అతఁడు మాయచేసి బ్రాహ్మణులను చంపుచుండిన వాతాపి, యిల్వలుఁడు అను ఇరువురు రాక్షసులను రూపు మాపిన మహాత్ముఁడు. ఒకప్పు డాతఁడు సముద్రమునందలి జల మంతయు ఒక్కపుడిసిటఁ జేర్చికొని ఆపోసనము పట్టెను. మఱి యొకప్పుడు చాలఎత్తుగాఁ బెరిగిపోయి సూర్యచంద్రుల మార్గము నరికట్టినవింధ్యపర్వతమును నేలమట్టము గావించెను. అంత గొప్పవాఁడు అగుటవలన అగస్త్యమహామునిని సత్యవ్రతుఁ డెంతో యాదరించి సంతోషింపఁజేసి నావలన మీకు కావలసినపని యేమైనా సెలవిచ్చినచో నవశ్యము చేసెదనని చెప్పెను. అది విని అగస్త్యుఁడు ముమ్మాటికి అట్లు చేసెద నని రాజుచే వనిపించుకొని "ఒకనాఁడు నాపితృదేవతలు ప్రత్యక్షమై 'వత్సా! నీవు సకలవిద్యలు నేర్చిన విద్వాంసుఁడవు. మంచిమార్గమున ప్రవర్తించుచు కులమునకు పేరు తెచ్చితివి. తపస్సువలన మహామహిమము సంపాదించిన మునిశ్రేష్ఠుఁడవు. మునీశ్వరు

లయం దెల్ల నీవే గొప్పవాఁడవు. నీ మాటకు దేవతలు గూడ గడగడలాడుచున్నారు. అన్నియు బాగుగనే యున్నవి; గాని యింతవాఁడవై యుండినను నీవలన మాకు సద్గతి కలుగకున్నది. నాయనా! మాకొఱకైన నీవు పెండ్లియాడి సంతానమును గనుము" అని చెప్పిరి. అప్పటినుండియు నావలన నాపితృదేవతలకు ముక్తి లేకుండఁ బోయినది గదా యని విచారించుచు పెండ్లియాడఁ దలంచి తగిన కన్యకకొఱకు దేశము లన్నియు తిరుగుచున్నాను; గాని యింతవఱకును నాకు ఏకన్నియయు యోగ్యురాలుగాఁ గాన్పింపలేదు. ఇట్లుండ నిన్న నీకుమార్తె యొక్క గుణాతిశయమును సత్ప్రవర్తనమును దెలియవచ్చెను. నిన్నటినుండియు నా చిత్తము నీకొమార్తెపై హత్తియున్నది. కావున ఆ గుణవతిని నాకిచ్చి పెండ్లిచేయుము. ఇంతకంటె నీవు నాకు చేయవలసినదియుఁ జేయఁగలదియు లేదు" అని చెప్పెను.

అగస్త్యుని కోరికను రాజు తనకూఁతునకు ఎఱిఁగించెను. అది విని యామె పరమసంతోషముతో ఆ మునీశ్వరుని పెండ్లియాడుటకు అంగీకరించెను. పేదవారి యాఁడుపిల్లలకు రాజపుత్రులు ఎట్లు లభింపరో యట్లే రాజకుమారికలకు మునీశ్వరులు లభించుట కష్టమని యెఱింగినది యగుటచే నామె అగస్త్యమునీశ్వరునిఁ బెండ్లియాడుట కెంతో యానందముతో సమ్మతించెను. తన కోరిక తెలిసిన వెంటనే యందులకు అంగీకరించుటవలన లోపాముద్రసుగుణములు అగస్త్యునకు మఱింత విశదముగా నెఱుకపడెను. అతఁడు తన పితృదేవతలు పెండ్లియాడుమని చెప్పినందులకు తగిన కన్యయే దొరకె నని చాలసంతసిం

చెను. సత్యవ్రతుఁడు తోడనే యానందముతో కొమార్తె నగస్త్యునకు ఇచ్చి పెండ్లి చేసెను.

పెండ్లి యైనపిదప అగస్త్యుఁడు కొన్నిదినములు అత్త వారి యింటనే యుండెను. చెలికత్తెలును దాసీలును తనకును తన భర్తకును అనేకవిధములఁ బరిచర్య చేయవచ్చినను వారిని వారించి తానే పతికి వలయు నుపచారము లన్నియుఁ జేయుచు లోపాముద్ర యెల్లరకు నాశ్చర్యము గొలుపసాగెను. ఇట్లు అయిదాఱు మాసములు కడచిపోయిన పిదప అగస్త్యుఁ డొక నాఁడు లోపాముద్రను బిలిచి "ప్రతిదినమును నీతల్లిపంపుచున్న యావుపాలు నాకు చాలుట లేదు. అయినను మొగమోటము వలన నింకను తెమ్మని యడుగఁజాలకున్నాను. మొగమోటము వలననే యింతవఱకు ఈ విషయము నీతోఁ గూడ చెప్పలేదు. ఆఁకలి దహించుకొనిపోవుచున్నది. కావున నే నిఁక సహింపఁ జాలను. నీవు నాకు వలసినన్నిపాలు ఇచ్చెదవా?" యని అడిగెను. అది విని లోపాముద్ర చాల కటకటంబడి "మహాత్మా! సముద్ర మొక్కమాఱుగ నాపోసనపట్టిన నీవాహామును నీ యాఁకలిని నేను తీర్పఁగలనా? అయినను పాలుదెచ్చెద" నని చెప్పి యొక కలశముతో తెచ్చి అగస్త్యుని పాదములను స్మరించి యీపాలు అక్షయము కావలె నని ప్రార్థించుచు కలశము అందించెను.

వెంటనే అగస్త్యుఁడు పాలు అన్నియు త్రాగివైచెను; గాని మరల చూచునప్పటికి కలశము నిండి యుండెను. ఎన్ని తడవలు త్రాగినను కలశ మట్లే నిండి యుండసాగెను. అప్పు డది

యంతయు లోపాముద్ర పాతివ్రత్యప్రభావ మని తెలిసికొని యామెను చాల నాదరించెను.

పిదప అగస్త్యుఁడు లోపాముద్రతో చాలకాలమై నేను వచ్చి యుండుటవలన ఆశ్రమము పాడుపడి యుండును. ఇఁక మనయింటికిఁ బోదము అని చెప్పెను. లోపాముద్ర తల్లిదండ్రులతోఁ జెప్పి భర్తతో వెంటనే ప్రయాణ మయ్యెను. తలిదండ్రు లామెకు ఎంతో వెలగల వస్త్రములను ఇచ్చిరి; గాని ఆమె వానిని విడిచిపెట్టి నారచీరలు ధరించెను. ఇదియు ఆమె భర్తతోఁ గూడ పాదచారిణియై కొరడవులకుఁ బోవుటయుఁ జూచి లోకులందఱును చాల నాశ్చర్యపడి ఆమె ననేకవిధముల కొనియాడుచు మ్రొక్కసాగిరి.

పిదప ఆశ్రమమునకుపోయిన కొన్ని దినములకు అగస్త్య మహాముని కి కుమారుఁడు గలిగెను. ఆసంతోషమువలన నాతఁ డనేకమునీశ్వరులను విందునకు పిలిచెను. ఇంట తమకు సరిపడు నంతవఱకైనను భోజనసామగ్రి లేని యిప్పుడు లోపాముద్ర యేమిచేయునో చూడవలయు నని అగస్త్యుఁడు ఏమియు నెఱుఁగనట్లు ఉండెను. పిదప మునులందఱితోఁగూడ అగస్త్యుఁ డును స్నానము చేసి భోజనమునకు సిద్ధముగా వచ్చెను. అది చూచి లోపాముద్ర యొక్కమాఱు పతి పాదములను స్మరించెను. తోడనే వంటయింటినిండ భోజనపదార్థములు నిండి యుండెను. శిష్యులందఱును వచ్చి మునుల కందఱకును తృప్తిగా భోజనము పెట్టిరి. సకలసన్మానములను గావించి మునుల నంపివైచి అగస్త్యుఁడు భార్యచెంతకు వచ్చి "నీ ప్రభావమువలన నా మర్యాద నిలిచినది. నిన్ను పెండ్లియాడినందులకు నేను

ధన్యుఁడ నైతిని." అని యామెను అనేకవిధముల కొని యాడెను.

ఇట్లుండఁగా నొకప్పుడు విపులుఁడు అనుముని యొకఁడు విమలాంగి అను భార్యతో అగస్త్యుని ఆశ్రమమునకు వచ్చెను. లోపాముద్రయు అగస్త్యుఁడును వారిని లక్ష్మీనారాయణులను వలె పూజించిరి. కొంతతడవు ఇష్టాలాపంబులఁ బ్రొద్దుగడచిన పిదప విమలాంగి లోపాముద్రను జూచి "అమ్మా! నీకు నీ తలి దండ్రులు ఎన్నో నగలు పెట్టఁగా అన్నియు వారియింటనే యుంచి వచ్చితి వఁట. ఎంత వెఱ్ఱిపని చేసితి వేమమ్మా!" అని యడిగెను. అది విని లోపాముద్ర "నా భర్తయే నాకు కావలసినన్ని నగలు ఇచ్చెను. ఇఁక పుట్టింటివారు పెట్టిన నగలు ఏమిచేసికొందునమ్మా!" యని బదులు చెప్పెను. విమలాంగి ఆనగల నొకమాఱు చూపు మనఁగా లోపాముద్ర యొకచిన్న చెట్టును చూపెను. చూడఁగా ఆచెట్టుకొమ్మలపై ఎన్నోవిధము లగునగలు వ్రేలాడుచుండెను. అది చూచి విమలాంగి లోపాముద్రమాహాత్మ్యమునకు ఆశ్చర్యపడి క్షమింపు మని యామెకు నమస్కరించి భర్తతోఁ గూడ అగస్త్యునివద్ద సెలవు గైకొని ఆశ్రమమునకు పోయెను.

లోపాముద్ర యిట్లే భర్తనే దేవునిఁగా బూజించుచు ఏస్త్రీయు కనలేని గొప్ప మహిమను గాంచి ప్రకాశించెను.

# అనసూయాదేవి

గొప్పకీర్తి వహించిన ఏడుగురు మహామునులలో నొక్కఁడును, చాలకాలము ఘోరతపస్సుచేసి చాల మహిమ సంపాదించి రెండవ బ్రహ్మవలె ప్రకాశించుచున్నవాఁడును అగు అత్రిమహాముని అన్ని యాశ్రమములయందును గృహస్థాశ్రమమే మిక్కిలి గొప్పది యని తెలిసికొని మంచిగుణములుకలదియు, పెద్దలయెడల భయభక్తులు చూపి గౌరవముతో పూజించునదియు, సౌందర్యవతియు, విశేషించి తనకు తగినదియు నగు అనసూయాదేవి అనుకన్యను పెండ్లిచేసికొనియెను.

చాల వివేకముగల అనసూయ అత్రిమహాముని తన్ను పెండ్లిచేసికొనినందులకు చాల సంతసించెను. అంతటి మహానుభావుఁడు ఎంత పుణ్యము చేసికొనిన భర్త యగును? అనసూయాదేవి తక్కిన కన్యలవలె కేవలము ఇహసౌఖ్యములనే కోరునది గాదు. ఆమె హృదయము చాల విశాలమైనది. నేఁడు అనుభవించుచున్న ఇహసౌఖ్యము రేపు నిలువదు. దానివలనఁ గలుగుఆనందము కూడ శాశ్వతముగాదు. నిదురమత్తువలె నది తొలఁగిపోయిన వెంటనే మరల కష్టములుపీడించును. ఆధ్యాత్మికానందము అట్టిది గాదు. దానికి అవధి లేదు; గాని దానిని సంపాదించుట కష్టము. శాంతచిత్తమున గాని యది యంకురింపదు.

దానిని పెంపొందించుటకు చాల కష్టముల ననుభవింపవలెను. ఇహసౌఖ్యములపైఁ గోరిక యున్నంతకాలము నది యంకు రింపదు. మనస్సు చాల నిశ్చలము గావలెను. అనసూయ హృద యము నిశ్చలము గావుననే నిర్మలహృదయుఁ డగు అత్రి నామె సంతోషముతో పెండ్లియాడెను.

పెండ్లియైన పిదప అనసూయకు అత్రికంటె మఱియొక దేవుఁ డున్నాఁడు అని తోఁచలేదు. సద్గుణములుగల స్త్రీలకు దైవమువలనఁ గలుగు ప్రయోజనములు అన్నియు భర్తవలననే కలుగును. ఈసంగతి నెఱుఁగని స్త్రీలు భర్తలను మరచి భగ వంతుని ఎంత పూజించినను ప్రయోజనము కలుగదు; గావు ననే అనసూయాదేవి భర్తయే దైవమని నమ్మెను. ఆమె యాత నికి చేసిన ఉపచారములు సాధారణకన్యలు చేయఁజాలరు. ఆమె యెప్పుడును భర్తకంటె ముందు నిద్రించిగాని పతికంటె వెనుక మేల్కాంచిగాని యెఱుఁగదు. ప్రాతఃకాలమున నామె తొలుదొల్త చేయుపని భర్త పాదపూజ. ఇది యెప్పుడు నామె యేమరలేదు. ఇట్లు చేయుటవలన భర్త సంతోషించి తన కోర్కెలు తీర్చునను తలంపుతోఁ గాక ఆమె తనకు ఇది విధి యని చేసెను. ఇట్లు ఆమె స్త్రీలు భర్తను ఎన్నివిధముల ఆనంద పెట్టఁగలరో అన్నివిధముల నానందపెట్టెను.

ఈరీతిని గొన్ని దినములు గడచిపోయినపిదప అత్రిమహా ముని వయస్సున చిన్నది యయ్యు, బుద్ధియందు చాల గొప్పది యగు భార్య గుణములను ప్రవర్తనమును గాంచి చాల సంత సించి "నీకేమి గావలయునో కోరుకొనుము" అని చెప్పెను. అప్పు డనసూయాదేవి చాల వినయముతో నమస్కరించి దేని

వలన స్త్రీలు సకలకష్టములను బాసి పతితో మోక్షమును బడయుదురో అది యొసంగు మని భర్తను కోరెను. ఆహా! ఇట్టి కోరిక యెంత జ్ఞానము గల స్త్రీలు కోరఁదగినది! అప్పు డత్రి మహాముని అట్లు కోరిన భార్యకు పాతివ్రత్యమే స్త్రీలకు సకల కామ్యముల నొనగూర్చు నని తత్త్వ ముపదేశించెను. నాఁటి నుండి అనసూయాదేవి మఱింత భక్తితో భర్త నారాధింప సాగెను. సాధారణముగా లోకములో స్త్రీలు చనువు ఇచ్చిన కొలఁది నెత్తి యెక్కెద రఁట! అనసూయాదేవి యట్లుగాక తొల్లిటికంటె నెక్కుడు వినయముతో భర్తను పూజింపఁ జొచ్చెను.

ఒకదినమున బ్రహ్మ సరస్వతితోడను విష్ణుమూర్తి లక్ష్మీదేవితోడను మహేశ్వరుఁడు పార్వతీదేవితోడను హంసను, గరుడుని, వృషభమును ఎక్కి విహారమునకు బయలు దేరిరి. ఆ సాయంసమయమున చల్లనిగాలి వీచుచుండుటవలన వారు చాల ఉల్లాసముతో మేరుపర్వతము దెసకుఁ బోవుచుండిరి. ఇట్లు కొంతదూరము పోవునప్పటికి హంసయు, గరుడుఁడును, వృషభమును గూడ ముందునకు కదలఁజాలకపోయెను. త్రిమూర్తులు గూడ ఎంతో ప్రయత్నము చేసిరి; గాని ఫలము లేకపోయెను. అప్పుడు వారు ఇందులకు కారణము ఏమని యడుగఁగా "దేవా! క్రిందనున్నది మహాపతివ్రత నివసించియుండు ఆశ్రమమని తోఁచుచున్నది. ఆమె ప్రభావమునఁ గలుగు అగ్నిశిఖలు మిన్నంటుచున్నవి. అక్కతన మేము ముందునకు పోలేకున్నా" మని చెప్పెను. ఇఁక చేయునది లేక త్రిమూర్తులును వెనుకకు పోయిరి.

ఒకనాఁడు వారు ముగ్గురును ఒకచోఁ జేరి అనసూయాదేవి ప్రభావమును బరీక్షించి ఎట్లయిన నామె పాతివ్రత్యమును భంగపఱుపవలె నని నిశ్చయించుకొని జాముననర ప్రొద్దెక్కిన తరువాత వృద్ధబ్రాహ్మణరూపములతో అత్రిమహర్షియాశ్రమమునకు వచ్చిరి. అట్లు వచ్చినవారిని అత్రియు, అనసూయయు దేవులనువలె పూజించి యీపూట మాయాతిథ్యమును స్వీకరించి పోవలె నని వేఁడుకొనిరి. వారందులకే వచ్చినవారైనను బెట్టుకొఱకు ఎంతోసేపు అటునిటు చెప్పి తుదకు అంగీకరించిరి.

వెంటనే అనసూయ చక్కఁగా వంటఁజేసి భర్త కెఱింగించెను. అప్పు డత్రి ఆబ్రాహ్మణులను "స్నానముచేసి మడిగట్టుకొనుఁ"డని చెప్పెను. వెంటనే వారు అట్లుచేసి పీటలమీఁదకు వచ్చి కూర్చుండిరి. తోడనే భర్త యనుజ్ఞఁగొని యనసూయ వడ్డించుటకు సిద్ధపడెను. అంత నాముగ్గురు బ్రాహ్మణులును ఒక్కమాఱుగ అత్రిమహర్షినిఁ బిలిచి "అయ్యా! మాకొక్క నియమ మున్నది. ఆనియమప్రకారము మీరు నడచుకొనకున్నచో మేము భుజింపకయే వెడలిపోదు" మని చెప్పిరి. అత్రి అది యేమని యడుగఁగా "నీ భార్య చీర విప్పివేసి, అనఁగా దిగంబరురాలై మాకు వడ్డింపవలె" నని చెప్పిరి. అత్రి యది విని యాశ్చర్యపడెను. అనసూయ భర్తను జూచెను. ఇఁక నిప్పుడిందులకు అంగీకరింపకున్నచో నీబ్రాహ్మణులు లేచిపోయెదరు. అట్లయిన నాతపస్సు అంతయు బుగ్గియై పోవును. పైఁగా మహాపాతకము చుట్టుకొనును. అని తలంచి అత్రి అట్లేచేయు మని భార్యకు సెలవిచ్చెను?

ఈయనుజ్ఞను విని యనసూయ సంతోషముతో పంచాక్షరీమంత్రమును జపించెను. తోడనే యాముగ్గురు బ్రాహ్మణులు చంటిపిల్లలు అయిపోయి కేరుకేరుమని యేడువసాగిరి. అప్పుడనసూయ వస్త్రమును విప్పివేసికొని అతి త్వరగా వచ్చి యాముగ్గురు పాపలకును బువ్వ తినిపింపసాగెను. అది చూచి అత్రి ఆశ్చర్యపడి యిది యేమనియెను. "నాథా! మీరింకను కనిపెట్టలేదా? బ్రాహ్మణులు మువ్వురును బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. నావ్రతమును పరీక్షించుటకై వారిట్టి వేషముతో వచ్చినారు" అని చెప్పెను. అది విని అత్రి త్రిమూర్తులుచేసిన కొంటెతనమునకును తనభార్యప్రభావమునకును ఎంతోయబ్బురంపడెను.

అనసూయాదేవి యాబాలకులకు బువ్వ పెట్టుట పూర్తియైనపిదప మూఁడుయొయ్యలలను నిర్మించి వారి నందు పవ్వళింపజేసి జోకొట్టి నిద్రపుచ్చి తిరిగి వచ్చి భర్తకు భోజనము పెట్టి తానును భుజించెను. అంతయు అత్రిమహర్షికి చాల నాశ్చర్యముగా నుండెను. ఆశ్చర్యము తక్క నాతనికి మఱియేమియుఁ దోఁచినది గాదు. ఇట్లుండఁగాఁ సాయంత్ర మయ్యెను. రాత్రి అనసూయ యాముగ్గురు బిడ్డలకును యథాప్రకారము భోజనము పెట్టి మరల పరుండఁబెట్టెను.

మఱునాఁడు లక్ష్మియు, పార్వతియు, సరస్వతియు నొక్కచోఁ జేరి తమ భర్తలకొఱకు విచారింపసాగిరి. వారు ఏమైపోయినదియుఁ గూడఁ దెలియదయ్యెను. ఎందున్నదియు,ఎప్పుడు వచ్చునదియుఁ గూడఁ దెలియ దయ్యెను. అప్పుడు పార్వతి యొక దేవశాస్త్రిని ఈశ్వరుని జాడ తెలిసికొనిరమ్మని పంపఁగా నామె పోయి సంగతి యంతయు తెలిసికొని వచ్చెను. అది విని

ఆముప్పురును అనసూయచేసిన పనికి చాల భయపడి తమపతుల యవస్థ యేమగునో యని యడలి, వారికిని తమకు నిఁక మరల సమావేశము కలుగునో కలుగదో యని భీతిల్లి మాఱుపల్కకుండ అనసూయ కాళ్లపైఁ బడి ప్రార్థింత మని నిశ్చయించుకొని వెంటనే బయలుదేరి అత్రిమహర్షి ఆశ్రమము చేరికొనిరి.

ఆముప్పురను గాంచి అనసూయ చాల గౌరవము చేసి పూజించి ఏందులకు వచ్చితి రని యెఱుఁగనట్లు ప్రశ్నించెను. అప్పుడు వారు దీనవదనలై సంగతియంతయుఁ జెప్పి యామెను పతిభిక్ష పెట్టు మని ప్రార్థించిరి. అనసూయ యేమియు నెఱుఁగనట్లు నటించుచు ఆముప్పురు బాలురను దీసికొనివచ్చి వారికిఁ జూపెను. బాలకులైయున్న తమ భర్తలను జూచి సరస్వతియు లక్ష్మియు, పార్వతియు ఒక్కమాఱుగ సంతోషమును విచారమును గూడ బొంది వారి పూర్వరూపములు దయచేయు మని అనసూయను ప్రార్థించిరి. అప్పుడును ఆమె నావల్ల నేమగు నని తెలుపుచు తన దివ్యప్రభావమువలన క్షణములో త్రిమూర్తులకును పూర్వపురూపములు గలిగించెను. వెంటనే త్రిమూర్తులు అనసూయ పాదములమీఁదను అత్రి కాళ్లమీఁదను బడి తమ తప్పు క్షమింపవలె నని ప్రార్థించిరి. అనసూయయు అత్రియు తిరిగి మమ్ము కాపాడుఁడని త్రిమూర్తుల పాదములపై వ్రాలిరి.

పిదప త్రిమూర్తులును అనసూయకు మ్రొక్కి "తల్లీ! మాకు ముగ్గురకును నీకడుపునఁ బుట్టి నీచే పెంపఁబడి, నిన్ను అమ్మా! అని పిలువవలె నని కోరిక యున్నది. ఈవరము దయచేయుము" అని ప్రార్థించిరి. "ఇంతకంటె మాకేమి కావలెను. ఎవ్వరిమీఁదను జూపని అపారప్రేమను మాయెడఁ జూపుటకు

మీకుఁ గారణ మేమియు లేదు. ఇది యంతయు మాయదృష్టముకాక వేఱు గాదు. భార్యలతోఁ గలసియున్న మీపాద ధూళిచే మాయాశ్రమము, మాజన్మములు, మాతపస్సులు, మాపూజలు పవిత్రములైనవి. మహానుభావులారా! మీరువచ్చిన పనికి నన్ను నియోగింపుఁడు" అని అనసూయ వారికి వందనము చేసెను. పిదప వారు భార్యలతోఁ గూడ స్వస్థానములకుఁ బోయిరి. కొన్ని దినములకు బ్రహ్మ చంద్రుఁడును విష్ణుమూర్తి దత్తాత్రేయుఁడును, మహేశ్వరుఁడు దూర్వాసుఁడును అయి అనసూయ కడుపునఁ బుట్టిరి.

---

# అరుంధతీదేవి

మునులలో నెల్ల గొప్పవాఁడగు వసిష్ఠుఁడు చాల గొప్పవాఁడై వివాహము చేసికొనఁదలఁచి తగిన కన్యక దొరకక చిక్కుపడుచుండెను. అనేకస్థలములయందు ప్రయత్నించెను; గాని యేమియుఁ బ్రయోజనము లేకపోయెను. "ఇట్లు ఉన్న చోటనే యుండి ప్రయత్నించుట దగ" దని తలంచి యాతఁడు కన్యను వెదకుచు బయలుదేఱెను.

ఒకప్పు డాతనికి మతంగమహామునికి అరుంధతి అను కొమార్త కలదనియు, ఆమె చాల సుగుణవతియు, విశేషించి సుందరి అనియు తెలియవచ్చెను. తోడనే వసిష్ఠుడు మతంగాశ్రమమునకు బయనమై పోయెను. వసిష్ఠుని రాకకు మతంగుఁడును, అతని భార్యయు, కొమార్తయు చాల సంతోషించి

మీరువచ్చుటచే మాయాశ్రమము పవిత్రమైనదని కొనియాడి అర్ఘ్యపాద్యాదివిధులచేఁ జాలభక్తితోఁ బూజించి ఆనందపెట్టిరి.

వసిష్ఠుఁడు అరుంధతినిఁ జూచి ఆమె తెలివితేటలను వినయ వివేకములను, భక్తి శ్రద్ధలను, గుణరూపములను జూచి చాల సానందించి యామె పెండ్లియాడుటకు తగిన దని నిశ్చయించు కొనియెను. ఆ కారణముచే నాతనికి మతంగుఁడు నాతని భార్య యు చేసిన సపర్యలకంటె అరుంధతి చేసిన యుపచారములె చాల సానందము గలిగించెను. మఱియు నీతీరున దేశములు తిరుగకున్న నీకన్యామణి కాన్పించియుండదు గదా యని గూడ నాతఁ డనుకొనెను.

పిదప మతంగుఁడు చేతులు జోడించికొని వసిష్ఠునిజూచి "మహాత్మా! ననుఁబోలు కొలఁది వాని యింటికి మిముఁబోలు మహర్షిశేఖరు లూరక రారు. మీ రాకకు హేతువేమో సెలవిచ్చి నన్ను కృతార్థునిఁ జేయుఁడు" అని ప్రార్థించెను. అందులకుఁ జాలసంతసించి వసిష్ఠుఁడు మతంగునిఁ జూచి "మునికులతిలకా! కన్యలున్నవారి యింటికి బ్రహ్మచారు లెందులకు వత్తురో నేను నందులకే వచ్చితిని. నాకు పెండ్లియాడవలె నని కోర్కెపుట్టినది. కన్యకొఱకు వెదకుచుండగా నీకొమారిత సద్గుణభూషిత యని తెలియవచ్చినది. నే నిప్పుడు నీయింటికి భిక్షుకుఁడనై వచ్చితిని. నీకొమార్తను నాకిచ్చి పెండ్లిచేసి నన్ను అనుగ్రహింపు" మని చెప్పెను.

అది విని మతంగుఁడు ఆమాటలకు చాల ఆశ్చర్యపడెను. అతని భార్యయు నాతఁడును తమ కూతురు యదృష్టమునకు చాల సానందించిరి. ఇది విని అరుంధతి పొంగిపోయెను. వెంటనే

నాకులము పవిత్ర మయ్యె నని చెప్పుచు మంతగుఁడు అరుం
ధతిని వసిష్ఠున కిచ్చి పెండ్లిచేసెను. దేవతలెల్లరును ఆదంపతు
లనుజూచి హర్షించిరి.

పెండ్లియైన తరువాత కొన్ని దినములు అత్తవారియింటనే
యుండి పిదప వసిష్ఠుఁడు అరుంధతిని వెంటఁగొని తన యాశ్ర
మమునకు పోయెను. పెండ్లియైనదిమొదలుకొని అరుంధతి
భర్తను అతిభయభక్తులతో పూజింపసాగెను. తనయెడ నరుంధ
తికిఁ గల పూజ్యభావమునుగ్రహించి పరమానందభరితుఁడై
వసిష్ఠుఁ డొకనాఁడు అరుంధతిని చేరఁదీసి "సాధ్వీ! నీసుగుణ
ములకు ఆనందమైనది. నీకు ఏమికావలెనో కోరుకొనుము.
అమూల్యములగు వస్త్రములో, రత్నాభరణములో, భోగ
ములో నీవేమికోరినను నేను తీర్చెద" నని చెప్పెను. అది విని
అరుంధతి భర్తకు తనయెడల గలిగిన యనుగ్రహమునకు జాల
సంతసించి ధన్యురాల నైతి నని తలంచి "నాకు మోక్షమును,
మీా పదభక్తియుమాత్రమే కావలెను. ఆరెండును నాకుఁగలుగ
నాశీర్వదింపుఁ" డని భర్తను వేఁడుకొనెను. ఆమెగుణవివేకము
నకు మిక్కిలి మెచ్చుకొని వసిష్ఠుఁడామె కప్పుడు జ్ఞాన ముపదే
శించెను. నాఁటినుండి అరుంధతి మఱింత భక్తిశ్రద్ధలతో భర్తను
పూజించుచుండెను.

ఇట్లుండఁగా నొకప్పుడు నారదునకు అరుంధతీదేవి పాతి
వ్రత్యప్రభావమును అసమానము అని తెలియవచ్చెను. సరస్వ
తియు, లక్ష్మియు, పార్వతియు పదునాల్గు భువనములయందును
గూడ తమయంతటి పతివ్రతలు లేరని గర్వపడుచుండుట గూడ
నాతనికి తెలిసియే యుండెను. అక్కతన నాతఁ డరుంధతి

సాయంబున త్రిమూర్తులభార్యలకుగర్వభంగముగావింపవలెనని తలంచి సెనగగింజలతో సమానమైన మూనెఁడు కంకరరాళ్లు పరికొని వైకుంఠమునకు వెళ్లి లక్ష్మీనారాయణులకు మ్రొక్కి మనఃపూర్వకముగా కొనియాడెను. అందులకు వారెంతయు సంతోషించి యాతని నాశీర్వదించిరి. పిదప నారదుఁడు కంకర రాళ్లమూట విప్పి లక్ష్మీదేవికి చూపి "నాకు వేయించిన సెన గలు తినవలెనని కోరిక కలిగినది. ఈరాళ్లు వేయించి సెనగలు చేసి యీవలె" నని కోరెను. అది విని లక్ష్మీదేవి ఆశ్చర్యముతో "నారదా! రాళ్లు ఎవరైన సెనగలు చేయఁగలరా? ఇదియేటి మాట" అని పలికెను. వెంటనే నారదుఁడు వారిచెంత సెలవు తీసికొని కైలాసమునకు ప్రయాణము సాగించెను.

అతఁ డక్కడ సైత మిట్లే తొలుత నమస్కరించి పిదప కొనియాడి యాపిమ్మట కంకరరాళ్లు వేయించి సెనగలుచేసి యీఁగోరెను. పార్వతియు లక్ష్మివలెనే ఆశ్చర్యపడి నావలనఁ గాదని చెప్పెను. పిదప నాతఁడు సత్యలోకమునకుఁ బోయి సర స్వతినిగూడ ప్రార్థించెను; గాని ఆమెయు నట్లే చెప్పెను.అప్పుడు నారదుఁడు త్రిమూర్తుల భార్యల పాతివ్రత్యమును గుఱించి నవ్వుకొనుచు వసిష్ఠుని ఆశ్రమమునకు బయలుదేరెను.

సంగీతముపాడుచు వచ్చుచున్న నారదుని అల్లంతదూర మునందే చూచి అరుంధతియు వసిష్ఠుఁడును ఎదురేగి తోడు కొనివచ్చి అర్ఘ్యపాద్యములు ఇచ్చి మర్యాదచేసిరి. కొంతతడవు లోకాభిరామాయణము జరిగినతరువాత నారదుఁడు తొల్లిటి వలెనే రాళ్ల నరుంధతికిఁ జూపి వేపి సెనగలు చేసి ఇమ్మని కోరెను. వసిష్ఠుఁ డది చూచి యబ్బురంపడెను; గాని అరుంధతి

వెంటనే యాకంకర రాళ్లను గైకొని పతిపాదములు తలంచి పంచాక్షరి జపించి మంగలములో వోసి యారాళ్లను వేయింప సాగెను. చూచుచుండఁగనే యారాళ్లు సెనగలై పోయెను. అవి బాగుగ వేగిన పిదప నరుంధతి వానిని తీసికొనివచ్చి నారదున కిచ్చెను. నారదుఁడును చాల సంతసించి యాశెనగలు మూట గట్టుకొని యాదంపతులకు నమస్కరించి బయలుదేరి వైకుంఠ మునకుఁబోయి లక్ష్మీనారాయణులకును, కైలాసమునకుఁ బోయి పార్వతీపరమేశ్వరులకును, సత్యలోకమునకుః బోయి వాణీ హిరణ్యగర్భులకును జరిగిన సంగతి యంతయుఁ దెలిపెను.

అది విని వారు చాల ఆశ్చర్యపడిరి. సరస్వతియు, లక్ష్మి యు, పార్వతియు ఆపని తమవలనఁ గానందున చాల సిగ్గుపడిరి. వెంటనే త్రిమూర్తులును భార్యలతో గూడ వసిష్ఠాశ్రమమునకు వచ్చి యాదంపతులకు సాష్టాంగ నమస్కారములు గావించి యనేకవిధములఁ గొనియాడి అరుంధతీదేవిని జూచి "తల్లీ! నీపాతివ్రత్యమాహాత్మ్యమును మేమేమని కొనియాడఁగలము? నీదర్శనమువలన మేము ధన్యుల మైతిమి. నేఁడు మొదలు నిన్ను భక్తితోఁ బూజించువారికి సకలసంపదలును సిద్ధించును. వివా హకాలమున నిన్ను పూజించు దంపతులు సకలైశ్వర్యములను బడసి తుదకు పుణ్యలోకమునకుఁ బోదురు" అని వర మిచ్చి స్వస్థలములకుఁ బోయిరి.

---

# మీరాబాయి

మారవాడదేశమునందలి మేరతనగరమున జయమల్లుం డను రాజు ప్రజలను పరిపాలించుచుండెను. ఆతఁడు చాల దయ గలవాఁడగుటవలన దేశమునందలి ప్రజ లెల్లరును సుఖించు చుండిరి. అతఁడు తీరికయైనప్పు డెల్ల భగవత్కీర్తనలు పాడుట యందే కాని మఱియొక వ్యర్థకార్యమునందు కాలము గడిపి యెఱుఁగఁడు. అతనికి మీరాబాయి యను ఒకకొమార్త గలిగెను. జయమల్లుఁడు భక్తుఁడగుటచేఁ దండ్రినిఁ జూచి కొమార్తెయు భక్తురా లయ్యెను.

ఆమెకు జ్ఞానము వచ్చినప్పటినుండియు, భారతము, రామాయణము, విష్ణుపురాణము, భాగవతము మున్నగు సద్గ్రంథముల ననేకపర్యాయములు చదువసాగెను. క్రమక్రమముగ నామెకు వయస్సుతోఁ గూడ జ్ఞానమును భక్తియు హెచ్చెను. పదాఱేండ్లు వచ్చునప్పటి కామె సంపూర్ణ యౌవనవతి యయ్యెను. అప్పుడు జయమల్లుఁడు తన మర్యాదకుఁ దగినవాఁడును, సరసుఁ డగు పండితుఁ డని పేరొందినవాఁడును, ఉదయపుర రాజును అగు కుంభరాణా మీరాబాయికి తగినవాఁ డని యోచించి యిరువురకును వివాహము గావించెను.

మీరాబాయియు కుంభుఁడును సౌందర్యమునందును, సౌజన్యమునందును, పాండిత్యమునందును, తెలివితేటలయందును, కవిత్వమునందును సమానులు. వా రిరువురును ఒకరి

సాయమున నొకరు చక్కని కవిత్వము చెప్పుచుండిరిగాని కుంభుఁడు చేయుపద్యములయందు శృంగారరసమును, మీరా చేయు పద్యములయందు భక్తిరసమును వెల్లివిరియుచుండెను. కుంభుని భక్తిరసము వర్ణింపు మని మీరాబాయియు, మీరను శృంగారరసము వర్ణింపు మని కుంభుఁడును చెప్పు చుండిరి; గాని కవిత్వము చేయునపుడుమాత్రము ఎవరిమార్గమును వారు మానువారు గారు.

ఇట్లు కొంత కాలము జరుగునప్పటికి కుంభునితండ్రి చని పోయెను. మేవాఁడురాజ్యమునకు కుంభుఁడు రాణాయయ్యెను. కొలఁది దినములయందే కుంభరాణా రాజ్యపాలనమున చాల నేర్పరి యని పేరొందెను. తన భర్త రాణాయైన తరువాత మీరాబాయికి స్వాతంత్ర్య మెక్కుడయ్యెను. ఆమె రాణియై నపు డిఁక స్వాతంత్ర్య మేమి కొదవ ? అప్పటినుండియు నామె భర్త యనుజ్ఞఁబడసి ఈశ్వరుని పూజించుటయందును కొనియా డుటయందును, ప్రార్థించుటయందును ఎక్కుడు కాలము గడుప సాగెను. తనకు నౌకరిచేయుట కేర్పఱుపఁబడిన దాసీస్త్రీల కును, చెలికత్తెలకును ఆమె యెల్లప్పుడు శ్రీమన్నారాయణ మూర్తి మహిమలను జెప్పుచు, నాతనిపై తాను రచించినపద్య ములను కీర్తనలను చదివి వినిపించుచు ఆనందమును బొందు చుండెను. ఆమెను జూచియు ఆమె బోధనలను వినియు వారు గూడ క్రమక్రమముగ శ్రీమన్నారాయణునియందు భక్తిగలిగి యుండిరి.

ఇట్లు మీరాబాయికి క్రమక్రమముగ భక్తి పెరిగి పోఁ జొచ్చెను. ఉదయపురమున రాజగృహముఁనకు బైట నొక కృష్ణ

మందిర ముండెను. మీరాబాయి దినదినము నాకృష్ణమందిర మునకుఁ బోయి ఆకృష్ణుని సేవించుట ప్రారంభించెను. ఒకప్పు డామె కృష్ణుని మహిమలను బాడుచు ఆనందాతిరేకముచే నృత్యము చేయసాగెను. ఇట్టి యద్భుతకృత్యముల వలన ఈ సంగతి వెంటనే దేశము దంతటను వ్యాపించెను. వెంటనే ఆమెను జూచుటకై యోగులును, భక్తులును, తత్త్వజ్ఞులును అనేకులు రా సాగిరి. వారివలన నామె మఱింత విజ్ఞానమును బడసెను.

అట్లు మఱికొన్ని దినములు జరుగునప్పటికి మీరా బాయి రచించిన పాటలు పద్యములు దేశమున నలుమూల లందును వ్యాపించెను. వానిని విని అప్పుడు ఢిల్లీని పాలించు చున్న అక్బరు ఆమెను జూడఁ గోరి తానసేనుఁడు అను నొక ఖారతీయుని వెంట నిడుకొని బైరాగివేషము వేసికొని రహ స్యముగా నుదయపురము వచ్చి శ్రీకృష్ణదేవాలయములో ప్రవే శించి అక్కడ జరుగు సంగతులు అన్నియు చూచి జనసంఘము తొలఁగిపోయిన పిదప మీరాబాయికి నమస్కారము చేసెను. "సర్వేశ్వరుఁ డుండఁగా నాకు నమస్కరించుటవలన నీకేమి ప్రయోజనము? నీకేమి కావలయును?" అని మీరాబాయి యడుగఁగా అక్బరు "నాకు పరమార్థసాధన ముపదేశింపు"మని యెను. "పరమేశ్వరుని నిశ్చలచిత్తముతో గొల్చుటయే పర మార్థసాధన" మని మీరాబాయి చెప్పఁగా నందులకు సంతో షించినట్లు అక్బరు తాను రహస్యముగాఁ గొనివచ్చినరత్నహార మును ఆమె కీయఁబోయెను; గాని యామె వల దనుటచే మా-

యాని యగు అక్బరు ఆరత్నహారమును కృష్ణవిగ్రహాము మెడలో వేసి పోయెను.

ఆరత్నహారము చాలవెలగలది అగుటచే నీవార్త క్షణములో దేశమంతయు వ్యాపించెను. ఇది విని కుంభరాణా అనుమానించి యారత్నహారమును తెప్పించి రత్నపరీక్షకులచే పరీక్ష చేయింపఁగా నందొకఁడు "ఈరత్నహారమును నేనే తయారు చేసితిని. ఒకసంవత్సరము క్రిందట నేనిది అక్బరునకు అమ్మితిని" అని చెప్పెను. అది విని కుంభరాణా అక్బరు మాయవేషముతో వచ్చి తనభార్య నవమానముచేసె నని తలఁచి ఇట్లు బహిరంగముగా మీరాబాయి బైరాగులు మున్నగువారితో కలసి మెలసి శ్రీకృష్ణమందిరమునకు పోవుచుండుటకు చాల కోపించి "నీవు వెంటనే నీకు నీవే యీలోకమును విడిచి పోవలె" నని మీరాబాయికి జాబు వ్రాసి పంపెను.

మీరాబాయి శ్రీకృష్ణమందిరము నుండి యింటికివచ్చినపుడు మంత్రి యామె కాజాబు నిచ్చెను; గాని దానిని జదువుకొని యామె యొంతమాత్రమును భీతిల్లలేదు. దుఃఖింపలేదు. చాల గంభీరముగఁ జూచుచు "మీరాజుగారి దర్శనము నాకొకసారి యగునా?" యని యడిగెను; గాని "రాజుగారు మీమొగము చూడ నని శపథము తాల్చి" రని మంత్రి చెప్పెను. అప్పు డామె "మీభార్య మీసెలవుప్రకారమే నడచుకొనును" అని చెప్పుము. అని మంత్రి నంపివైచెను. ఈ వర్తమానము నామె తన చెలికత్తెలకును, దాసీలకును గూడ చెప్పక సాయంకాలము ఎల్లరును నిద్రించునంతవఱకును ఈశ్వరభజనము

గావించి పిదప బీదవేషమును దాల్చి ఎవరికిని జెప్పకుండ ఇల్లు వెడలెను.

కొంతతడవున కామె యొక నదీతీరమునకు అరిగెను. అప్పు డానది పూర్తిగా ప్రవహించుచుండెను. అందుల కెంతయు సంతసించి మీరాబాయి యందుదికెను; గాని తెల్ల వాఱునప్పటి కామె ఒక యిసుకతిన్నెపై బడియుండెను. పిదప నామె నిద్దురవోయిన దానివలె లేచి కూర్చుండెను. నీటిలోఁ బడి కొట్టుకొనిపోవునపు డామెకు "మీరా! నీవు నీభర్తయాజ్ఞ చొప్పున ఆత్మహత్య చేసికొనుటకు నదిలో నుఱికితివి; గాని నీ కింకను ఆయుర్దాయము పూర్తి కాలేదు" అని యేదో యొక గంభీరవాక్యము వినవచ్చెను. అక్కతన నామె బృందావన మునకుఁ బోదలఁచి యీశ్వరభజనచేయుచు బయలు దేరెను. మార్గమధ్యమున కొందఱు గొల్లవాండ్రు పాలు ఇచ్చి ఆమె యాఁకలిబాధను తీర్చిరి. ఆమెను చూచిన స్త్రీపురుషులందఱు ఎంత వలదనుచున్నను ఆమెవెనుక తాముగూడ భజనచేయుచు బయలుదేరిరి. ఇట్లు చాల కష్టముతోఁ బ్రయాణముగావించి కొన్నిదినములకామె బృందావనము చేరికొనెను. ఇట్లు అనేక స్త్రీపురుషులు వెంట వచ్చుచుండ ఆనందపరవశయై ఈశ్వర భజనచేయుచు వచ్చు ఆమెనుజూచి బృందావనమునందలివారు కైలాసమునుండి ప్రమథగణములతో వచ్చు పార్వతీదేవి యని భావించిరి.

ఈమె అచ్చటకు వెళ్లునప్పటి కచ్చట జీవగోసాయి యను నొక జ్ఞానియగుభక్తుఁడుండెను. అతఁడు తనశిష్యులకు "మీరు జ్ఞానమును గోరెదరేని ధనమును స్త్రీలను కోరకపోవుటయే కాక

కన్నులతో నైనను చూడఁగూడ" దని బోధించుచుండెను. ఇది మీరాబాయికి తెలిసెను; గాని ఆమెదర్శనమునకు వచ్చుటకు సెల వీయవలసినదని గోసాయికి కబురంపెను. అతఁడు తిరస్కరించెను. అప్పుడు మీరాబాయి "మీరు శ్రీకృష్ణభక్తులని వినుచున్నాను. ఆగుటచే మీరును స్త్రీలే యగుచున్నారు ఇఁక స్త్రీలను చూడ మను మాటకు అర్థ మగుట లేదు" అని మరల కబురంపెను. అప్పు డిఁక చేయునది లేక జీవగోసాయి శిష్యులతోఁ గూడి తానే యామెను దర్శించుటకు వచ్చెను. సంభాషణమును బట్టి జీవ గోసాయి జ్ఞానమున తనకంటె మీరాబాయియే గొప్పది యని తెలిసికొనెను. అక్కడ తన నాతఁడా మెకు శిష్యుఁడై యామెవలన జ్ఞానమును బడయుచుండెను. మీరాబాయి మాత్రము తాను గోసాయికి శిష్యురాల నని చెప్పుచుండెను; గాని గోసాయి యది యబద్ధ మనియు తానే యామెకు శిష్యుఁడ ననియు వెంటనే చెప్పసాగెను. అచ్చటివారు గూడ నట్లే భావించుచుండిరి.

ఇచ్చట కుంభరాణా ఎచ్చటికిఁబోయినను తమ భార్యను గుఱించిన స్తోత్రపాఠములును, ఆమె రచించిన పాటలును పద్యములును అబాలగోపాలమునుండి వినవచ్చుచుండెను. అంతేకాక ఎల్లరును అట్టి మహాత్మురాలగు భార్యను విడిచిపెట్టి నందులకు రాణాను నిందింపసాగిరి. ఇదియంతయు విని రాణా తనభార్యయెడల అక్రమము చేసితి నని తెలిసికొని మాఱు వేషముతో బృందావనమునకుఁ బోయి మీరాబాయికి సాష్టాంగనమస్కారము చేసి నాకొక వర మిమ్మని కోరెను. అందుల కామె తన భర్త యని తెలియక "నీవు గొప్పవారిని వేఁడుము. నావంటిబీదలు నీకేమి యీఁగలరు?" అనెను.

రాణా 'యాచకుఁడు సామర్థ్యమును దెలిసికొనియే కోరు' నని చెప్పఁగా నామె నీకేమికావలెనని యడిగెను. అప్పు డాతఁడు మాఱువేషము తీసివేసి నన్నుక్షమింపు మని మరల భార్య కాళ్లపైఁబడెను. అదిచూచి మీరాబాయి సంభ్రమముతో నాతనిని లేవనెత్తి యాతనిపాదములకు మ్రొక్కి 'దేవా! నేఁటికి కరుణ గలిగినందులకు నేను ధన్యను' అని చెప్పెను. తరువాత రాణా మీరాబాయిని గొప్పయుత్సవముతో తన రాజధానికి తీసికొనిపోయెను. ప్రజ లందఱును ఆనందించిరి. నాఁటినుండి మీరాబాయి నెంతో ప్రేమతో నాదరింపసాగెను. మీరాబాయియు నెంతో భక్తితో భర్తను పూజింపసాగెను. ఆమె సంవత్సరములో నాఱుమాసములు బృందావనము నందును, ఆఱుమాసములు భర్తపాదములవద్దను నివసించుచు కొంతకాలమునకు ఈదేహమును విడిచి వైకుంఠమునకుఁ బోయెను.

---

# సంధ్యావలీ దేవి

మాళవదేశపురాజునకు సంధ్యావలి యను నొక కుమార్తె జన్మించెను. ఆబిడ్డను తల్లిదండ్రులు లేకలేక పుట్టినదగుటచే నెంతో గారాబముతో పెంచుకొనుచుండిరి. రాజు కుమార్తెకు యుక్తసమయమున విద్యాభ్యాసము చేయింపఁదొడఁగెను సంధ్యావలి కుశాగ్రమతి యగుటచే గురువు చెప్పినదంతయు క్షణములో గ్రహించుచు నెల్లరకు ఆశ్చర్యము గలుగునట్లు సకల

విద్యలును పదాఱుసంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికే నేర్చెను.

ఆమె పదాఱేండ్ల జవ్వనియై, ఎల్లవిద్యలయందును ప్రౌఢ యగునప్పటికి పదునాల్గు భువనములయందును ఇంతటి సుందరిగూడ లేదని పేరుగాంచెను. ఆమె సౌందర్యమునుజూచి స్త్రీలే మోహపడుచుండిరి. అట్టి సుందరికి తగినవరుని తెచ్చుటకై తల్లిదండ్రు లనేకవిధముల ప్రయత్నింపసాగిరి. తోలు తొల్త రాజు పురోహితులను బంపి ఎల్లదేశముల రాజకుమారుల పటములను దెప్పించి చూచెను. ఆపటములయందెల్ల విదర్భదేశపు రాజకుమారుఁ డగు రుక్మాంగదుని పటము అసమానమై యుండెను. ఆతఁడు గుణములయందును, విద్యయందును గూడ అసమానుఁడై యుండెను. అక్కతన సంధ్యావళిగూడ నాతనిపై మనస్సు నిలిపెను. అది రాజెఱింగి రాజు సంధ్యావళి పటమును పురోహితుల కిచ్చి విదర్భదేశమునకుఁ బోయి సంబంధమును కుదుర్చుకొని రండని పంపెను. అంత వారు అతివేగముగఁ బోయి తమరాజు చెప్పినచొప్పునఁ జేసిరి. రుక్మాంగదుఁడు సంధ్యావళి పటమును జూచి ఆమె సౌందర్యమునకు అబ్బురంపడి పెండ్లియాడుట కంగీకరించెను. సంధ్యావళికిని రుక్మాంగదునకును వివాహము నిశ్చయ మయ్యెను. అంతఁ గొన్నినాళ్లకు శుభముహూర్తమునఁ బెండ్లి యయ్యెను.

పెండ్లియైన వెంటనే సంధ్యావళి భర్తయింటికి వెడలిపోయెను. ఆదంపతులను జూచినవా రందఱును ఇంత సౌందర్యవంతులును, ఇంతగా నొకరికొకరు తగినవారు నగు దంపతులు ఎందైన నుందురా యని యబ్బుర పడసాగిరి. తాను

మహారాణి యనియు, తనయంతటి యదృష్టవంతులు ఈలోక
మున లేరనియు నెంతమాత్రమును గర్వపడక సంధ్యావళి దాసి
వోలె భర్తకు ఎల్లయుపచారములును చేసి సంతోషపెట్ట
సాగెను. రుక్మాంగదుఁడు గూడ ఆమె నంతగా ప్రేమించుచు
చాల నాదరించుచుండెను.

సంధ్యావళికి పూవులనిన ఎంతో ప్రీతి అగుటచే రుక్మాం
గదుఁ డామెకొఱకు ఒక్క గొప్పయుద్యానవనమును నిర్మింపఁ
జేసెను. ప్రపంచమున నున్న గొప్పగొప్పవృక్షజాతులు, తీఁగలు
మున్నగునవి యన్నియు నందు నాటించెను. దానిని జూచిన
ప్రజలు ఇది దేవేంద్రుని నందనవనమును మించియున్న దని
పలుకసాగిరి. ఇట్లుండఁగా దేవేంద్రునకు రుక్మాంగదుఁడు వేయిం
చిన పూలతోఁట తన నందనవనమును మించి యున్నదని
తెలియవచ్చెను. వెంటనే యాతఁడు ప్రతిదినమును అందలి
పూలను కోసికొనివచ్చుచుండవలె నని దేవతాస్త్రీల కాజ్ఞాపిం
చెను. నాఁడు మొదలు ఆవనమునందలి పూవు లన్నియు
మాయమైపోఁజొచ్చెను. అప్పుడు కావలివారు వచ్చి రాజుతో
నీసంగతి చెప్పిరి. రాజు జాగ్రత్తగా కాచియుండి ఆదొంగలను
బట్టి తీసికొని రండని చెప్పెను. వారు రాజాజ్ఞప్రకారము
చాల మెలఁకువతో కాచియుండిరి; గాని చోరులు దొరకరైరి.

ఆవనములో నొకయోగి తపస్సు చేసికొనుచుండెను.
అది విని రాజు ఆయోగిచెంతకుఁ బోయి జరుగుచున్నది అం
తయుఁ జెప్పఁగా నాతఁడు దివ్యదృష్టినిచూచి పూలు గోసికొని
పోవుచున్న దొంగలు దేవతాస్త్రీలని చెప్పెను. అది విని రాజు
'ఆదేవతాస్త్రీలతో నాకు మాట్లాడవలె నని యున్నది. ఇది

మీరు సంఘటింపవలె' నని ప్రార్థింపఁగా యోగి 'ఆయుద్యాన వనమునం దంతటను పుచ్ఛగింజలు చల్లింపు' మని చెప్పెను. యోగి చెప్పిన ప్రకారము రాజు పుచ్ఛగింజలు చల్లించెను. రెండుమూఁడు దినముల కా గింజలు చక్కఁగా అంకురించెను. ఒకనాఁటి రాత్రి దేవతాస్త్రీలు వచ్చి పూలు కోసికొని స్వర్గమునకుఁ బోఁబోవఁగా పుచ్ఛమొక్కలు త్రొక్కుటవలన వారి కామగమనము తొలగిపోయెను. ఆ కారణముచే వారు చేయునది లేక ఉద్యానవనమంతయు తిరుగుచు విచారించుచుండగా యోగి చూచి రాజునకు వర్తమానము చేసెను. రాజు వచ్చి దేవతాస్త్రీలతో చాలతడవు మాట్లాడెను. వా రాతనికి ఏకాదశీవ్రతము చేయు మని యుపదేశించిరి. పిదప దేవతా స్త్రీలు యోగిదయవలన స్వర్గమునకు పోయిరి.

రాజు అంతటినుండి దేవతాస్త్రీలు చెప్పినప్రకారము ఏకాదశీవ్రతము చేయుటకుఁ బ్రారంభించెను. తాను చేయుటతో మాత్రమే యూరకుండక తన దేశమునందలి అందఱును గూడ ఏకాదశీవ్రతమును చేయవలయు నని శాసించెను. ఏకాదశీవ్రతము చేయుటవలన ఆదేశమునందలి ప్రజలు తొల్లిటికంటె నెక్కుడు సుఖముగా నుండిరి. వారిపాడిపంటలు ఎక్కుడయ్యెను. ఆనందము హెచ్చయ్యెను. ఆ దేశమునందలి ప్రజల నుజూచి సకలదేశములయందలివారు నీయేకాదశీవ్రతము ప్రారంభించిరి.

ఏకాదశీవ్రతమాహాత్మ్యమువలన చనిపోయినవా రంద ఱును వైకుంఠమునకే పోవసాగిరి. నరకలోకమునకు పోవు మార్గమునిండ గడ్డి తుప్పలు మున్నగునవి పెరిగిపోయి భయం

కరమై పోయెను. నరక మంతయు ఖాళీయైపోయెను. యమదూ
తలకు పని లేకపోయెను. పాపులను బాధించు సాధనములన్నియు
మూలఁబడెను. చిత్రగుప్తుని కలమునకు తీటపట్టెను. యమ
ధర్మరాజు మనస్సులో ఆరాటము పడెను. ఈదైన్యమును అనుభ
వింపలేక యముఁడు బ్రహ్మదేవునితోఁ దన యవస్థను చెప్పుకొని
వాపోయెను.

మానవులందఱును వైకుంఠమునకే పోయినచో ప్రపం
చము తలక్రిందై పోవు నని తలంచి బ్రహ్మదేవుఁడు సమస్తమా
నవులను ఏకాదశీవ్రతము చేయునట్లు నియమించిన రుక్మాంగ
దుని వ్రతము చెఱుప నిశ్చయించెను. ఆనిశ్చయముతో త్రిలోక
సుందరి యగు మోహిని అను నొక రమణీమణిని సృష్టించి
విదర్భదేశమందలి యొక వనము నుండి తగునదనున రుక్మాం
గదుని వెంటఁ జేసి యాతని వ్రతమును భంగము చేయు మని
యామెను నియమించెను.

మఱియు రుక్మాంగదుని మోహిని యున్న వనమునకుఁ
బోవునట్లు చేయుటకై ఆవనమునిండ క్రూరమృగములను తం
డోపతండములుగా సృజించెను. ఆవనమునందలి వారు చాల
భీతిల్లి ఆమృగములను సంహరింపు మని రాజును ప్రార్థించిరి.
తోడనే రుక్మాంగదుఁడు తన పరివారమును వెంటఁ బెట్టుకొని
యామృగముల నన్నిటిని సంహరించి వైచెను. పిదప కొంత
తడవు శ్రమ దీర్చుకొని రాజధానికిఁ బోవఁ బయనమగుచుండఁగా
రాజునకు ముద్దులుమూటగట్టు నొక లేడి కాన్పించెను. దానిని
పట్టుకొని యింటికి తీసికొనిపోవలె నని రాజునకు బుద్ధిపుట్టెను.
తోడనే యాతఁడు విల్లు నమ్ములు దాల్చి లేచెను.

రాజు తుప్పలచాటునుండి పోయి దానిని పట్టుకొనుటకు సాధ్యమైనంతవఱకు ప్రయత్నించెనుగాని ఫలము లేకపోయెను. అక్కడతన నాతఁడు విల్లెక్కువెట్టి నారిమోఁయించి బయలు దేరెను. ఆలేడి యెట్లు ప్రయత్నించినను చిక్కక రుక్మాంగదుని తిన్నగ మోహిని యున్నచోటికి తీసికొనిపోయెను. అప్పుడు మోహిని యొక చక్కని చెట్టుక్రిందఁ గూరుచుండి ప్రొద్దు లిగురించునట్లు సంగీతము పాడుచుండెను. ఆమెను జూచి రాజు లేడిసంగతి మఱచిపోయెను. పిదప నాతఁడామెదగ్గరకుఁ బోయి పలుకరించెను. కొంతతడవున కాతని కామెపై మోహము గలిగెను. ఎల్లప్పుడును తనతో నుండుటకును, అట్లుండని నాఁడు తనయిష్టమువచ్చినది తనకిచ్చునట్లును అంగీకరించునెడ ఆమె రాజును బెండ్లియాడెద నని చెప్పెను. రాజు అందుల కంగీక రించి యామెను వెంటఁబెట్టుకొని రాజధానిం జేరికొనెను.

అప్పటికి ఆతనికి సంధ్యావళీదేవియందు ధర్మాంగదుఁ డను నొక కుమారుఁడు పుట్టియుండెను. అతఁ డేడెనిమిదివేండ్ల వాఁడై యున్నపు డీసంగతి జరిగెను. తనభర్త మఱియొకస్త్రీని తెచ్చినందులకు సంధ్యావళి ఏమియు విచారింపక తన భర్త యిష్టమునకును సౌఖ్యమునకును విఘాతము గలిగించుట ధర్మముగాదని తలంచి మహావైభవముతో మోహినికిని తన భర్తకును వివాహమును జరిపించెను. ఇదిచూచి రుక్మాంగదుఁడు ఆశ్చర్య మందెను. లోకు లెంతో అబ్బురపడిరి.

అంతేకాక రాజు తన మాటయే మఱచిపోయి సర్వ కాలసర్వావస్థలయందును మోహినితోడిదే లోక మని యుండి నను, విచారింపక ఆయిరువురు సుఖపడునట్లు సంధ్యావళి ప్రయ

త్నింపసాగెను. ఇట్లు కొంతకాలము గడచిపోవునప్పటికి మోహి నికి రాజునెడల చాల ధైర్యము కలిగెను. అప్పు డామె రాజు ఓకనాఁ డేకాదశీవ్రతము చేయఁబోవుచుండఁగా వలనుగాదనియు నేఁడు తన యంతఃపురము విడిచి పోరాదనియు శాసించెను. ఎన్నివిధముల చెప్పినను ఏకాదశీవ్రతము మాన నని రాజు చెప్పుటచే మోహిని కోపించి "నీవు మున్నిచ్చిన వాగ్దానప్రకా రము నాయిచ్చవచ్చినది యిప్పుడి" మ్మని చెప్పెను. రాజందులకు అంగీకరించి "నీ కేమికావలె" నని యడుగఁగా "నీపెద్దభార్య యెదుట నీకొమరుని తల నఱికి నా కి"మ్మని కోరెను. ఆమాట విని రాజ వెంటనే మూర్ఛవచ్చి పడిపోయెను.

ఈసంగతి సంధ్యావళికిని ధర్మాంగదునకును తెలిసెను. తోడనే వారిరువురును మోహిని యంతఃపురమునకుఁ బోయి రుక్మాంగదుని లేపి ఇచ్చిన వాగ్దానము తప్పవలదనియు ఏకాదశీ వ్రతముకంటె గొప్పది యేమియు లేదనియు చెప్పిరి. సంధ్యా వళి "ఏకాదశీవ్రతమునకు భంగము రాకుండునెడల కుఱ్ఱవాని తల నఱుకుటగూడ చూచి సహింపఁగల" నని చెప్పెను. ధర్మాం గదుఁడు తనవిషయమై విచారింపవలదనియు ఏకాదశీమహాపర్వ మున ఈపాంచభౌతికశరీరమును బాయుటకంటె కోరఁదగినది లేదనియుఁ జెప్పెను.

ఇట్లెంతతడవు చెప్పినను రాజునకు విచారము తొలఁగ లేదు. ఆతఁడు మోహినియెదుట మోకరించి నిలిచి "నేనింత వఱకు నెప్పుడును మాటతప్పి యెఱుఁగను. ఇప్పుడు తప్పను. ఇఁకముందు తప్పఁబోను; కాని పుత్రభిక్ష పెట్టు మని నిన్ను వినయముతో ప్రార్థించుచున్నా" నని చెప్పెను. ఆతఁ డిట్లెంత

చెప్పినను మోహినికి మనసు కరుగ దయ్యెను. ఆశ్కాలమున సామె మొగమోటము లేకుండ "ఏకాదశీవ్రతము మాట తలంపకుండ నేడు నాతో నుండుము. లేకున్న నా కోరిక చెల్లింపుము. ఈ రెండింట నేదో యొకటి చేయక తప్ప" దని ఖండితముగాఁ జెప్పెను.

సంధ్యావళీదేవి మరల "వాగ్దానమే చెల్లింపు"డని భర్తకు చెప్పెను. "నాతల దునుముటకు సందియము వల" దని ధర్మాంగదుఁడు చెప్పెను. అప్పుడు హృదయము రాయిచేసికొని రుక్మాంగదుఁడు కుమారుని మెడపై కత్తి విసరెను; గాని యది పూలదండ యై పోయెను. మరల ఖడ్గమెత్తి రాజు "నేను ఎప్పుడును ధర్మము తప్పకున్న నాఖడ్గము పనిచేయుఁగాక" అని విసరఁబోయెను. ఇంతలో త్రిమూర్తులును వచ్చి యాతని నడ్డగించిరి. అడ్డగింపవల దని యాతఁ డనేకవిధములఁ బ్రార్థించెను; గాని ఫలము లేకపోయెను. అప్పుడు బ్రహ్మ జరిగిన వృత్తాంత మంతయుఁ దెలిపి నీవ్రతమునకు సంతసించితిమి. నీభార్య పాతివ్రత్యమువలన నీకీ ఏకాదశీవ్రతము నిర్విఘ్నముగా జరిగినది. ఆమెయే నీ యౌన్నత్యమునకు కారణురాలై యున్నది. నీ వింకను చాలకాలము ధరాపాలనము గావించి పిదప వైకుంఠమునకుఁ బోయెద వని చెప్పి మఱికొన్ని వరము లిచ్చి విష్ణుమహేశ్వరులతోఁ గలిసి యంతర్ధానమై పోయెను.

---

# కర్మదేవి

మారవాడదేశమునందలి జౌరింతుసంస్థానమును మాణిక్యరాయఁ డనురాజు పరిపాలించుచుండెను. ఆతనికి కర్మదేవి యనుకుమార్తె కలిగెను. తలిదండ్రు లామె నెంతో ప్రేమతోఁ బెంచుచుండిరి. చిన్నతనమునుండియు నామె వీరుల కథలు వినుటయందును, యుద్ధవార్తలు వినుటయందును చాల ఇష్టము జూపుచుండెను. తఱచుగా నామె తండ్రియొడిలోఁ గూరుచుండి యట్టిమాటలనే యడుగుచుండెను. రామాయణము భారతము వినుట యనిన నామె కెంతో యిష్టము. శ్రీరాముఁడు, శ్రీకృష్ణుఁడు, పాండవులు, కౌరవులు మున్నగు యోధుల ప్రసంగము వచ్చినపు డామె తఱచుగ వారికి జేయెత్తి మ్రొక్కి వారి జన్మములే సార్థకము లని యెంతో కొనియాడుచుండెను.

పదాఱుసంవత్సరముల యీడువచ్చునప్పటికి ఆమె చాల సౌందర్యవతియై విద్యావతియై విద్యకు తగినట్లు వినయవతియై విశేషించి వీరనారి యై యుండెను. అప్పటి కామె పూగల్ పరగణాధిపతి యగు రాణా రణరంగదేవుని కుమారుఁడగు సాధు అనువానిని మోహించి యుండెను.

సాధు గొప్పవీరుఁడు. ఆతఁ డనేకయుద్ధములయందు శత్రువులను బాఱఁదోలి విజయమును జేకొనెను. చిన్నప్పటి నుండియు కర్మదేవికి సాధు అనిన నెంతో ప్రేమ. తుద కామెకు

వయస్సు వచ్చునప్పటికి ఆప్రేమ మితిలేనిదై యాతనిఁ బెండ్లి యాడఁ గోర్కి పుట్టించెను. సాధు తఱుచుగ యుద్ధమునకుఁ బో వునపుడును, యుద్ధరంగమునుండి యింటికి బోవునపుడును జౌరిం తునగరమధ్యమునుండి అనఁగా మాణిక్యరాయుని కోటముందు నుండి పోవుచుండెడివాఁడు. అక్కడఁ తన మాణిక్యరాయఁ డాతని ననేకపర్యాయములు తన యింట నాపి విందు పెట్టుచుండెను. అట్టి సందర్భములయం దెల్ల కర్మదేవి యాతని నే తలుపుచాటు నుండియో చూడకుండ నుండెడిది గాదు. ఈప్రత్యక్షదర్శనము వలన సాధును పెండ్లియాడవలయు నను కోరిక యామెకు దృఢ మయ్యెను.

సాధుగూడ కర్మదేవియొక్క రూపరేఖావిలాసములను విని యామెను హృదయమున మోహించి యుండెను. ఒక నాఁడు సాధు యుద్ధమునుండి స్వస్థలమునకుఁ బోవుచు సాయం కాలము మేడమీఁద విహరించుచున్న కర్మదేవినిఁ జూచెను. అప్పుడు కర్మదేవి గూడ నాతనిం జూచెను. సాధు కర్మదేవి నంతకుము న్నెప్పుడును వినుటయే కాని చూడలేదు. ఈప్రత్య క్షదర్శనమువలన నామెను పెండ్లియాడవలె నను కోర్కి యాత నికిఁగూడ దృఢమయ్యెను గాని కర్మదేవియు, సాధును ఒకరి నొకరు మోహించియున్నా రనికాని, పెండ్లిచేసికొనుట కువ్వి ళ్లూరుచున్నారని కాని కర్మదేవి తల్లిదండ్రులకుఁ గాని, చెలి కత్తెలకుఁ గాని, దాసీలకుఁగాని తెలియదు.

ఇట్లుండఁగా మాణిక్యరాయఁడు తన కుమార్తె యౌవన వతియై యుండుటఁ జూచి యామెకుఁ బెండ్లి చేయుటకు తగిన సమయము వచ్చెనని తలంచి తగిన వరుని వెదకుటకై ప్రారంభిం

చెను. ఉన్న వరు లందఱియందును మందరాధిపతి యగు చండ రాజుయొక్క కుమారుఁడును, రూపవంతుఁడును, శూరుఁడును, ధీరుఁడును, విద్యావంతుఁడును, ధనవంతుఁడు నగు అరణ్యకము లుఁడు కర్మదేవికి తగినవాఁడు అని తలంచి యాసంబంధమును నిశ్చయించి, శుభముహూర్తము నేర్పఱిపించి పెండ్లి ప్రయత్న ములుచేయ నారంభించెను. త్రిలోకసుందరి యని పేరొందిన కర్మదేవి తన రాణి కాఁగల దని అరణ్యకములుఁడు పొంగిపోవ సాగెను.

ముహూర్తదినము సమీప మయ్యెను. కర్మదేవికి మన స్సున ఆనందమునకు మాఱుగ విచారము పెరిగి పోసాగెను. తన నిశ్చయము తల్లిదండ్రులకు తెలుపకున్న కష్టములు సంభవిం చును; గాని వారికిఁ దెలుపుట యెట్లు? ఇది ఎవరిచేఁ జెప్పిం చిన బాగుండు నని కర్మదేవి యోచింపసాగెను. ఈవిచార ముతో నామె యొకమాఱు ఏమియుఁ దోఁచక తన యంతః పురములో గవాక్షముచెంత నిలువఁబడియుండెను. అప్పుడామె తో పరిహాసము చేయుటకై వచ్చిన అమల కర్మదేవిని జూచి యామెస్థితిఁ గనిపెట్టి యేమియుఁ జేయక వెనుకనిలిచెను; కాని కొంతసేపునకు ఉండఁజాలక "అక్కా! ఈసంతోషసమయమున నీవిట్లు విచారముతో నుండుటకు కారణమేమి" మని యడిగెను. ఆమాటకు కర్మదేవి నిజము చెప్పక యేమో చెప్పి మఱపింపఁ దలంచెను; గాని లాభము లేకపోయెను. అమల గ్రుచ్చిగ్రుచ్చి యడుగుటవలనఁ జేయునదిలేక కర్మదేవి తుదకు తన విచార కారణమును దెలిపెను.

ఇది విని అమల నిర్విణ్ణురాలయ్యెను. "సంబంధము నిశ్చయమైనతరువాత నెట్లు త్రిప్ప నగును? ఈసంగతి తొలుత నేల చెప్పవైతివి?" అని యమల యడుగఁగా కర్మదేవి "వరనిశ్చయము చేయునప్పుడు నాకుఁ దెలుపకుండుటయే యనుచితము. ఆయనను నేను వరింప నని యిప్పుడు తెలిపితినిగా? ఆయన యీకార్యమునకుఁ దగడు" అని చెప్పెను. "ఇంతవఱకు జరిగిన తరువాత నిప్పు డీ సంబంధమును త్రిప్పివైచిన లోకు లేమనుకొందురు? అదియుఁ గాక అరణ్యకమలుఁడు రూపవంతుఁడు. విద్యావినయసంపన్నుఁడు, సరసుఁడు, మఱియు నీకు తగిన వరుఁడు. ఆతఁ డేవిషయమున సాధుకంటె తక్కువవాఁడని నీవాతనిని తిరస్కరించెద" వని అమల మరల నడుగఁగా కర్మదేవి "లోకములో నన్నివిషయములయందును సాధుకంటె నెక్కుడువా రుండవచ్చును; గాని నాప్రేమకు సాధుకుమారుఁడే పాత్రుఁడు. నాప్రేమలహరి నాకర్షించు మోహనమంత్రమేమో యాతని చెంత నేయున్నది. నాహృదయము నాతఁడు తన మనస్సులో భద్రపఱిచికొనియెను. అది యింక నాస్వాధీనముకాదు. నీవింక మాఱుపలుకక మాతలిదండ్రులతో నాయభిప్రాయము దెలుపు" మని ఖండితముగాఁ బలికెను.

అది విని యింకఁ జేయునది లేక అమల అట్లే చేసెను. కర్మదేవి నిశ్చయము విని యామె తల్లిదండ్రులు అదరిపడిరి. నిశ్చయమైన సంబంధమును త్రోసివేయు టెట్లు? అరణ్యకమలుఁడు మాత్రము సాధుకంటె తక్కువవాఁడా? కర్మదేవిని సాధున కిచ్చినచో అరణ్యకమలుఁడు నాతనిబంధువులు నీయవమానమును సహించి యూరకుందురా? కర్మదేవికిని, సాధున

కును శాంతి యుండునా? ఇన్ని సందేహములవలన వారు చాలఁ దల్లడిల్లిరి; గాని కర్మదేవిపైఁ గలప్రేమాతిశయమువలన మాటాడఁ జాలక పోయిరి. కావున వారు వెంటనే సాధును బిలువ నంపి యాతనికి తమకుమార్తె నిశ్చయము నెఱింగించిరి. సాధు అంతకు పూర్వమే కర్మదేవిని మోహించియున్నాఁడు. గావున మాణిక్యరాయలు చెప్పిన వెంటనే యామెను పెండ్లి యాడుట కంగీకరించెను. వెంటనే మాణిక్యరాయఁడు అరణ్యకములునివలనఁ గలుగఁబోవు సంకటములను లెక్కసేయక కర్మదేవికి వివాహము చేసివైచెను. సాధుగూడ అరణ్యకములుఁ డెంత యని భావించి కర్మదేవిని పెండ్లియాడెను. కోరుకొనిన వరుఁడు లభించినందులకు కర్మదేవి యెంతో యానందించెను.

ఈవివాహవార్త వెంటనే దేశమెల్లయెడల వ్యాపించెను. ఇది విని అరణ్యకములుఁడును ఆతనిబంధుగులును మండిపడిరి. మఱియు వారందఱును కర్మదేవికిని సాధుకుమారునకును మాణిక్యరాయనికిని తగిన ప్రాయశ్చిత్తము చేయవలయునని నిశ్చయించుకొనిరి.

వివాహమైన కొన్నిదినములకు సాధుకుమారుఁ డత్తమామల సెలవుగైకొని కర్మదేవిని వెంటనిడుకొని స్వస్థలమునకు బయలుదేఱెను. అరణ్యకములుఁడు దారిలో వీరి నడ్డుకొనవచ్చు నని తలంచి మాణిక్యరాయఁడు పండ్రెండువందల వీరభటులను కూఁతునల్లుండ్రతోఁ బంపెను. అనుకొనినట్లే అరణ్యకములుఁడు సైన్యముతో మార్గమధ్యమున సాధు నెదిరించెను. అంత ఘోరఘోరముగఁ బ్రారంభ మయ్యెను. ఒకింతతడవున కరణ్య

కములునకు గెలుచుట కష్టమని తోఁచెను. వెంటనే యాతఁడు సాధును జూచి "నీవు నిజమైన క్షత్రియుఁడ వైనచో నాతో ద్వంద్వయుద్ధమునకు రమ్మ"ని పిలిచెను. కర్మదేవి యనుజ్ఞగొని సాధువు సిద్ధపడెను. ద్వంద్వయుద్ధము ప్రారంభ మయ్యెను గాని సాధువు చనిపోయెను. వెంటనే అది యంతయుఁ జూచుచున్న కర్మదేవి చితిపేర్ప భటుల కాజ్ఞాపించి తన యెడమచేయి నఱుకు కొని యొకభటున కిచ్చి "ఈ చేయి నామామగారి కిచ్చి 'యిఁక మీకోడలు ఈలోకమునఁ గాన్పింప' దని చెప్పు" మనియెను. మఱియొక నౌకరుని తన కుడిచేయి తెగగొట్ట నియమించి యది మఱియొకని కిచ్చి "దీనిని మాతలిదండ్రుల కిచ్చి 'మీకుమార్తె ముఖ మిఁక మీకుఁ గాన్పింపదు. మీకూఁతురు నల్లుఁడును స్వర్గమున సుఖులై యున్నా' రని చెప్పు" మని చెప్పి చితిపై భర్తకళేబరము చెంతగూర్చుండి వీరస్వర్గమునకుఁ బోయెను. ఆమె తలిదండ్రులు అత్త మామలు నామె కొఱ కెంతో వగచిరి. ఆమె జ్ఞాపకార్థ మామె మామగా రామెచేతి కగ్నిసంస్కారము చేసిన చోట బ్రహ్మాండమైన యొక సరోవరము త్రవ్వించి దానికి కర్మసరోవర మని పేరు పెట్టెను. అది యిప్పటికిని గలదు.

---

# సుమతీదేవి



అధిష్ఠానపురమున కౌశికుఁడను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. తల్లిదండ్రు లాతనికి బాల్యమునందే చక్కని చుక్క యగు సుమతి యను కన్యను పెండ్లిచేసిరి; గాని యీడువచ్చిన వెనుక నాతఁడు వేశ్యాలోలుఁ డయ్యెను. కొన్నిదినములకు సుమతి కాపురమునకు వచ్చెను. అయినను కౌశికుఁడు వేశ్యలను విడిచి భార్య నాదరింపఁ డయ్యె. ఇంతలో నాతని తల్లిదండ్రులు గూడ చనిపోయిరి. కౌశికునకు మఱింత స్వేచ్ఛ యొదవెను.

ఇంతవఱకును అంతగా సంబంధము లేకపోవుటవలన నాతఁడుభార్యను తిట్టుటయేకాని కొట్టుటయెఱుఁగఁడు. ఇప్పుడు వంట చేయునదియు, భోజనము పెట్టునదియు, ఇంటి పనులన్నియుఁ జేయునదియు భార్యయే యగుటవలన 'నది పాడుచేసితివి. ఇది మాడ్చివేసితివి. అందుప్పు ఎక్కువయ్యెను. ఇందు కారముచాలదు. అది చేదుగా నున్నది' యని ఇట్లేవేవో కారణములు పన్ని సుమతిని కొట్ట నారంభించెను. ఆదెబ్బలవలన నామె యొక్కొక్కప్పుడు గడియలకొలఁది మాటలేక పడిపోవుచుండెడిది. భార్య యట్టి స్థితియందుండగనే యామెను విడిచి యిల్లు విడిచి యాతఁడు వేశ్యావాటికకు పోవుచుండెను. అంతేకాక అప్పుడప్పుడు గారెలు బూరెలు మొదలగు పదార్థములను చేయించి, సాధ్యమైనన్ని తిని సుమతి కొక్కటియైన లేకుండ.

నట్లు సుమతిచేతనే భోగముదాని యింటికి పట్టించుకొని వెళ్లు చుండెను.

ఒకనాఁడు తండ్రి యాబ్దికము వచ్చెను. నాఁడు గారెలు అరిసెలు చాల చేయించి తాను భోజనము చేసిన వెంటనే సుమతి భోజనము చేయక పూర్వమే సుమతిచేతనే అన్నియు భోగముదాని యింటికిఁ బట్టించుకొనిపోయి భోగముదాని సెలవుచొప్పున నిష్కారణముగా సుమతిని కొట్టి పంపివైచెను. సుమతి యందులకు చేయునది లేక విచారించిన ప్రయోజనములేదని తలంచి యింటికి బయలుదేరెను మార్గములో నామె కొకత్రాఁచుబాము అడ్డువచ్చెను. దానినిఁ జూచి సుమతి జీవితముపై నాసరోసి దానిని బట్టుకొనఁబోయెను; గాని పాము ఆమె కందక బెదరి తప్పించుకొనెను. సుమతి మరల దాని కడ్డువెళ్లెను. అప్పుడాపాము మనుష్యుల మాటలతో "సుమతీ! నీధైర్యసాహసములను పరీక్ష చేయుటకు నేనిట్లు వచ్చితిని. నేను ధర్మదేవతను. నీకొకయుపదేశము చేయుచున్నాను. భర్తవలన బాధలు గలుగుచున్నందులకు నీవిప్పు డేమియు వగవవలదు. దేవతలు నిన్ను పరీక్షించుచున్నారు. నీపతిభక్తిని మఱువకుము'' అని చెప్పెను. అది విని సంతసించి సుమతి యాధర్మదేవతకు మ్రొక్కి యింటికి పోయెను.

ఆమెకు భర్తవలని బాధలు క్రమక్రమముగఁ బెరిగిపోయెను. అయినను, ఆమె యందులకు కోపపడి అకృత్యముచేయుటకు తలంపలేదు. కొలఁదిదినములలో కౌశికుఁ డున్న యాస్తి యంతయు బగ్గంపాడుచేయుటవలన తినుట కన్నము లేకపోయెను. అప్పటికి ఒకింత బుద్ధి తెచ్చికొని కౌశికుఁడు "ధనము

సంపాదించుకొనివచ్చెద" నని భార్యకు చెప్పి ప్రయాణమయ్యెను. సుమతి వెంటవచ్చెద ననియెను. వెంటనే యామె నాతఁడు చితుకబాది లేచిపోయెను. సుమతి యందుల కేమియు వగవక యాతనికిఁ దెలియకుండ యాతనివెనుక బయలుదేఱెను.

కౌశికుఁడు అడవిలో కొంతదూరము పోవునప్పటికి కొందఱు దొంగలు ఎదురుపడి తమలోఁ గలిసి రమ్మని పట్టుబట్టిరి. చేయునది లేక కౌశికుఁ డందులకు సమ్మతించి వారితోఁ గలిసి దొంగతనములు ప్రారంభించెను. ఒకనాఁ డొక యడవిలో సుమతి తనభర్త దొంగలలోఁ జేరియుండఁగాఁ జూచెను. అప్పుడామె సంగతియంతయుఁ దెలిసికొని దొంగలను బతిమాలికొని భర్తను విడిపించుకొనివచ్చెను; గాని కొంతదూరము వచ్చినతరువాత దుర్బుద్ధియై కౌశికుఁడు, సుమతిని మరల చితుకఁగొట్టి యొక చెట్టునకు కట్టివెట్టి తనదారిని బోయెను. ఆవనమునందలి కొందఱు కిరాతులది చూచి కౌశికునిపట్టుకొని భార్య నేలుకొమ్మని బుద్ధిచెప్పిరి. అప్పు డాతఁడు సుమతిని వెంటనిడుకొని యొక బ్రాహ్మణాగ్రహారమునకు వచ్చి వసించెను.

అప్పటికి నాతనికి బుద్ధి వచ్చినదిగాదు. ఒకనాఁటి రాత్రి భార్య భోజనము చేయుచుండఁగా నాతఁడు దొంగతనముగా భోగముదాని యింటికిపోయెను. సుమతి భోజనముచేసి వచ్చి భర్తను గానక రాత్రి యంతయు విచారముతోఁ గడపెను. కౌశికుఁడు తెల్లవారినపిదప నింటికి వచ్చెను; గాని యాతఁడు జాడ్యములచే లేవలేకుండ మంచము పట్టెను. అది తన దురదృష్టమే యనుకొని సుమతి వైద్యుల కాళ్లపైఁ బడి ప్రార్థించి భర్తకు ఔషధ మిప్పించెను. ఔషధసేవవలన కౌశికుఁ డొకింత

తేరికొనెను. ఇట్టిస్థితిలో నాతఁ డొకనాఁడు సుమతిని పిలిచి "ఫలానివేశ్యతో నొకరాత్రి గడుపవలె నని కోరికగా నున్నది. నీవిది సంఘటింపవేని నేను చచ్చిపోయెద" నని చెప్పెను. సుమతి అట్లే చేసెద నని చెప్పి ముందుగా తాను భోగముదాని యింటికిఁ బోయి దాని నెట్లో అంగీకరింపఁజేసి నాఁటిరాత్రియే భర్తను ఒకగంపలో కూర్చుండఁబెట్టుకొని భోగముదాని యింటికిఁ బోయెను. కౌశికుఁడు మరునాఁటి రాత్రివఱకు భోగముదాని యింటనే యుండి ఆరాత్రి యది వలనుపడ దనుటచే నింటికి బయలుదేరెను. సుమతి యథాప్రకారము భర్తను గంపలోఁ గూర్చుండఁబెట్టుకొని బయలుదేర గాఢాంధకారమగుటచే దారి తప్పి పోయెను. కొంతతడవున కామె మాండవ్య మహాముని యాశ్రమమునకు వచ్చెను. ఒకచెట్టుక్రింద ఆముని ఒంటికాలిమీఁద నిలిచి తపస్సు చేసికొనుచుండెను. అంధకారమగుటచే సుమతి నెత్తిమీఁది గంప తగిలి ముని కూలఁబడెను. అప్పు డాతఁడు మండిపడ "భర్త జబ్బుపడుటచే గంపలో నుంచుకొని యింటికిఁ బోవుచు దారితప్పిపోయి యిట్లువచ్చితిని. అంధకారవశమున నీయాపత్తువచ్చినది. రక్షింపు" మని యెన్ని విధములఁ బ్రార్థించినను వినక "నీవు మగనిం జూచుకొని గర్వాంధురాలవై క్రిందును మీఁదును తెలియకుండ నున్నావు గావున నీమగఁడు సూర్యోదయమైనవెంటనే చచ్చిపోవుఁగాక" అనిశపించెను. సుమతి "అట్లయిన సూర్యోదయమే కాకుండుఁగాక" అని చెప్పి యింటికిఁ బోయెను.

ఇల్లు చేరినతరువాత కౌశికుఁడు ఆయింటియజమానుని పిలిచి "అయ్యా! నేను చాల దుర్మార్గుఁడను, మొదటినుండియు

నేను నాభార్యను కోపపెట్టితిని. ఈముద్దుగుమ్మ సుఖమునుమాట యెఱుఁగదు. ఇట్లుండఁగా సూర్యోదయమైన వెంటనే చచ్చి పోవునట్లు మాండవ్యమహాముని నాకు శాపమిచ్చెను. ఈసుమతి దిక్కు లేనిదై పోవనున్నది. దీనిని మీరు కాపాడవలె" నని ప్రార్థించెను. ఆబ్రాహ్మణుఁడు కౌశికునకు సంభవించిన శాపము నకు వగచి సుమతిని కాపాడుట కంగీకరించెను; గాని సూర్యో దయము కాదయ్యెను. ఇట్లు ఎనిమిది దినముల కాలము గడచి పోయెను. జగ మంతయు తలక్రిందులై పోవుటకు సిద్ధముగ నుండెను. అప్పుడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అక్కడకు వచ్చి కౌశికునకును సుమతికిని ఆరోగ్యమును, దీర్ఘాయుర్దాయమును సకలైశ్వర్యములును ఇచ్చిరి. అంతమున వైకుంఠమునకు వత్తు రనికూడ చెప్పి వారు అంతర్ధానమై పోయిరి.

---

# వీ ర మ తి

గుజరాతీ దేశమున బిరజాఁ డను రాజు టుకటోడా యను గ్రామమును రాజధానిగాఁ జేసికొని ప్రజాపాలనము చేయుచుండెను. ఆతనికి వీరమతి యను గారాబుచెల్లెలుండెను. కడసారపు చెల్లె లగుటచే బిరజాఁ డామె నెంతో ప్రేమించు చుండెను. తక్కినవారు కూడ నట్లే యామెను ప్రేమించుచుం డిరి. ఇట్లెల్లరచే గారాబముగఁ బెంపఁబడుచున్న వీరమతి పదా ఱేండ్లప్రాయము వచ్చునప్పటికి చాల సుందరిదయ్యె గుఱ్ఱము నెక్కుట, ఏనుఁగు నెక్కుట, సాము చేయుట, యుద్ధము చేయుట,

సంగీతము, సాహిత్యము మున్నగు కళలను చక్కఁగ నేర్చికొని జగన్మోహినియై యుండెను.

అప్పుడామెకు పెండ్లిచేయఁదలఁచి బిరజాఁడు పురోహితులనుబంపి దేశదేశములయందలి రాజపుత్రులపటములను దెప్పించెను. ఆబ్రాహ్మణులు వీరమతికి పటములు చూపుచు ఆయారాజకుమారుల వృత్తాంతములను వినిపించిరి. ఇదియంతయు నైన పిదప వీరమతి జగదేవుఁడు అను రాజపుత్రుని వరించెను. బిరజాఁడు వెంటనే జగదేవుని తండ్రి యగు ఉదయాదిత్యునకు "నాచెల్లెలు వీరమతిని మీజగదేవులకిచ్చి వివాహము చేసెద" నని వర్తమానము చేసెను.

ఉదయాదిత్యుఁడు మాలవదేశపురాజు. ఆతని రాజధాని ధారానగరము. ఆతఁడు చక్రవర్తియై కొందఱు రాజులపై నధికారము గలిగియుండెను. బిరజాఁడా రాజులలో నొకఁడు. ఉదయాదిత్యునకు వాఘేలీరాణి యనియు, సోళంకీరాణి యనియు నిరువురు భార్య లుండిరి. వాఘేలీరాణికి రణధవలుఁడు అనియు, సోళంకీరాణికి జగదేవుఁడు అనియు నిరువురుకుమారులు గలిగిరి. వాఘేలీరాణి ఉదయాదిత్యునకు పెద్దభార్య. ఆమెకు సోళంకీరాణి యనిన నెంతో యీర్ష్య. పెద్దభార్య చెప్పిన మాటలువిని రాజు సోళంకీరాణిని కోటనుండి వెడలఁగొట్టి, మంత్రుల ప్రార్థనమీఁద సోళంకీరాణియు, నామె కడుపునఁబుట్టిన జగదేవుఁడును బ్రతుకుటకై రెండు గ్రామములును, ఊరిబైట నొక గృహము నిచ్చెను. సోళంకీరాణి తెలివితేటలుకలది గావున జరిగినదానికి విచారపడక ధనమంతయు వ్యర్థముగా వెచ్చపెట్టక మిగిల్చి దానితో జగదేవునకు రాజపుత్రులకుఁ దగినవిద్య

లన్నియు నేర్పించెను. కొలఁది దినములయందే జగదేవుని బల పరాక్రమములు, తెలివి తేటలు, చాకచక్యము మున్నగు నుత్తమగుణములు దేశమునందు నలుమూలలను వ్యాపించెను. ఇది విని రాజు చాల సంతసించెను; గాని వాఘేలీ రాణికి వెఱచి యానందమును వెల్లడింపఁడయ్యెను. ప్రజ లందఱును జగదేవునియందు చాలప్రేమ గలిగి యుండిరి.

ఇట్లుండఁగా బిరజునివద్దనుండి ఉదయాదిత్యునకు శుభ లేఖవచ్చెను. రాజు అది చూచి చాల సంతసించెను, గాని రణ ధవలున కింకను వివాహముగానందున జగదేవుని వివాహము నకు వాఘేలీరాణి యంగీకరించునో లేదో యని భయపడెను. అయినను జగదేవుని యదృష్టమువలన ఆయభ్యంతరము వెంటనే తీఱిపోయెను. ఆవెంటనే రాజు వీరమతిని తన కుమారునకు పెండ్లిచేసి వెంటఁబెట్టుకొని వచ్చెను. నాఁటనుండి సోళంకిరాణికి మరల కోటలో ప్రవేశము గలిగెను. కొలఁదిదినములు అత్త వారియింటనుండి యొకమాఱు చూచి వచ్చుటకు వీరమతి పుట్టి నింటికి వెళ్లెను.

జగదేవుఁడు ప్రతిదినమును సభకు వచ్చి రాజకార్యము లలో తండ్రికి తోడుపడసాగెను. ఆ కారణముచే కొలఁదిదిన ములయందే యాతనిశక్తిసామర్థ్యములు రాజునకు ప్రత్యక్షముగ తెలియవచ్చెను. ప్రజ లందఱును జగదేవుఁ డనిన నెంతో యాదరము చూపసాగిరి. వాఘేలీరాణి కుమారుఁడైన రణ ధవలుఁడు పిచ్చివానివలె నుండుటచే నాతఁ డనిన నందఱకు నసహ్యముగా నుండెను. ఇది యంతయుఁ దెలిసికొని వాఘేలీ రాణి "ఇట్లు కొన్నిదినములు జరిగిపోయినయెడల జగదేవుఁడు

తనకుమారుని త్రోసివైచి రాజ్యమాక్రమించుకొనును"నని తలఁచెను. తనతండ్రి వాఘేలీరాణి చేతిలోని కీలుబొమ్మ యగుటచే జగదేవుఁడు తనసవతితల్లి యనుగ్రహము సంపాదించుకొనుట మంచిదనితలంచి ప్రతిదినము నామెయంతగపురమునకు పోయి కన్నతల్లికి వలెనే సేవ చేయసాగెను. ఇదె మంచిసమయ మని వాఘేలీరాణి జగదేవునిపై చెప్పరాని యొక గొప్ప నేరము మోపి భర్తతోఁ జెప్పెను. మంచియు చెడ్డయు నెఱుఁగని ఉదయాదిత్యుఁడు వెంటనే జగదేవుని ఇంటినుండి వెడలిపొమ్మని శాసించెను.

జగదేవుఁడు దేశమును విడిచిపోవునపుడు తండ్రియనుజ్ఞబడసి యొక గుఱ్ఱమును ఆయుధమునుమాత్రమే తీసికొని పోయెను. తొలుత నాతనికి ఎక్కడికి పోవలెనో తెలియదయ్యెను; గాని వెంటనే పట్టణ మను నగరమునకుఁ బోయి యచ్చట ఉద్యోగము సంపాదించుకొని జీవింప బుద్ధిపుట్టెను. ఈయూహతో నాతఁడు కొంతదూరము నడచిపోవునప్పటికి పుట్టినింట నున్న తన యనుఁగుభార్య యగు వీరమతి నొకమాఱు చూచి పోవలె నని కోరిక కలుగుటచే గుఱ్ఱమును టుకటోడా దెసకు మఱలించెను.

సాయంకాల మగునప్పటికి ఆతఁడు టుకటోడా పట్టణమునకు వెలుపల నున్న పూలతోఁటచెంతకుఁ బోయెను. ఆపూలతోఁట చాల మనోహరమై శ్రమతీర్చుటలో నద్వితీయ మగు కమ్మ తావుల వెదఁజల్లు మందమారుతము కలిగి యుండెను. గుఱ్ఱము గూడఁ జాల నలసియుండుటచే కొంతవడి కచ్చట

శ్రమతీర్చికొని పోదలంచి గుఱ్ఱములకు నీరు త్రాగించి పచ్చిక బయలుమీఁద విడిచి యాతఁ డొక పొదరింట శయనించెను.

పట్టణము దాఁటిపోయిన తరువాత జగదేవుని కట్టి తెండని వాఘేలీరాణి నలుగురు దురంతకు లగు భటుల నంపెను. వారు జగదేవుని వెనుకనేవచ్చి యాతఁడుపొదరింట నిద్రించినవెంటనే యొక్కుమ్మాడిగ మీఁదఁబడి కాలుసేతులు బంధించి తీసికొనిపోసాగిరి. అది గుఱ్ఱముల నెక్కి వచ్చుచున్న యిరువురు యువకులు చూచిరి, ఆయువకులు జగదేవుని రక్షింపఁదలఁచి పోవునంతలో దురంతకులు జగదేవు నొకచోఁబడవైచి సంహారింతమా వలదా యని యాలోచించుచుండిరి. వెంటనే యాయువకు లిరువురును ఆ నల్వురు పాపులమీఁదికి నుఱికిరి. యుద్ధము ప్రారంభ మయ్యెను. కొంతసేపటి కొకఁడు ఒక యువకుని కత్తివ్రేటునకు తలతెగిచచ్చిపోయెను. మఱియొకఁడు మఱియొక యువకుని బల్లెపుపోటునకు తొడతెగి క్రిందఁబడి పోయెను. ఇది చూచి తక్కిన యిరువురు చోరులును పాఱిపోయిరి, పిదప నాయువకు లిద్దఱును బద్ధుఁడై పడియున్న యాతఁడు జగదేవుఁడై యుండుటఁజూచి యబ్బురపడి యాతని కట్లు విప్పి వేసిరి. జగదేవుఁడు లేచి కూర్చున్న తరువాత నందొక యువకుఁడు ఆతనిపైఁబడి ఘోరన నేడ్వఁజొచ్చెను. అది జూచి జగదేవుడు తెల్లవోయెను. రెండవయువకుఁడు గూడ విచారింప సాగెను.

కొంతతడవునకు జగదేవున కాయువకు లిరువురును వీరమతియు నామె చెలికత్తెయు నని తెలిసెను. వెంటనే యాతఁడు మిగుల నానందించి వీరమతిని కౌఁగిలించుకొని ముద్దాడి, చెలి

కత్తెను తగునట్లు లాలించి యిరువురను నాప్రాణము కాపాడిన వారని మిగుల కొనియాడెను. ఒకక్షణమైనతరువాత నామఃవ్వు రును ఇంటికి బయలుదేరిరి. భర్త రాకవిని వీరమతియు చెలి కత్తెయు జరిగిన సంగతులకు చాల విచారించిరి.

జగదేవుఁడు అత్తవారియింట వారము దినములుండి బయలుదేరెను. బావమఱఁది పోవలదనియు,నిక్కడనే యుండు మనియుఁ జెప్పెను ; గాని "మీరు నాతండ్రికి సామంతులు గావున నేనిక్కడ నుండినచో మీకు మఃప్పుపుమాఁడును" అని జగదేవుఁడు బదులు చెప్పెను. ఇఁకఁ దప్ప దని నిశ్చయించు కొని వీరమతి"అట్లయిన నేను మీ వెంటనే వచ్చెద"నని చెప్పెను. నేనక్కడకు బోయి ఉద్యోగము సంపాదించుకొని నిన్ను పిలు పించుకొనియెద నని ఎంతచెప్పినను వెంటరాక మాన నని వీర మతి పట్టుపట్టుటచే తుదకు జగదేవుఁడు సమ్మతించెను. ఆదంప తులు ఇరువురును మంచిగుఱ్ఱముల నెక్కి బయలుదేరిరి.

ఇట్లు పోవుచుండఁగా నొకచోట వారికి దారిలో నొక పెద్దపులి యున్నదనియు, అది అనేకులను చంపియున్నదనియు, దానికి జడిసి ఆదారి నెవ్వరును పోవుట లేదనియుఁ దెలిసెను ; గాని యాదారినే పోయి జనులను బాధించుచున్న యాబెబ్బు లిని సంహరింపవలయు నని వారికిఁ దోఁచెను. వెంటనే వారు ముందునకు నడచిరి. కొంతదూరము పోవునప్పటికి "ఈపులి బారినుండి మమ్ము రక్షింపుఁడి" యను కేక వినవచ్చెను. ముందు నకుఁ జూడఁగా నొక చెట్టుపై నిరువురు మనుష్యులు గజగజ వడఁకుచుఁ గూర్చుండియుండిరి. క్రింద బెబ్బులి వారినిఁ జంపు టకుఁ బ్రయత్నములు చేయుచుండెను. దానినిఁ జూచి వెంటనే

జగదేవుఁడు బాణము విడిచెను. ఆదెబ్బతో నది వెనుదిరిగి జగదేవునిమీఁదికి వచ్చెను. జగదేవునకు మరలబాణము సంధించుటకుఁ గూడ వీలులేకపోయెను; గాని వీరమతి బల్లెముతో పులిపొట్టలో పొడిచెను. ఆపోటుతో పెద్దపులియఱచుచు క్రిందఁ బడి చచ్చిపోయెను. ఆయఱపు విని పొదలో నున్నయాఁడుపులి వచ్చి వారిమీఁదికి ఉఱికెను. జగదేవుఁడు తోడనే కత్తితో దానిని సంహరించివేసెను గాని యంతలోనే పులిగోళ్లు తగులుటవలన ఆతని గుఱ్ఱము క్రిందఁ బడిపోయెను. జగదేవుఁడు గుఱ్ఱమునుండి దిగుటయే కష్ట మయ్యెను.

రెండుపులులును చచ్చిపడియుండుటఁజూచి చెట్టుమీఁద నున్న యిరువురు మనుష్యులును క్రిందికి దిగివచ్చి యాదంపతులకు నమస్కరించి నేఁడు మీయనుగ్రహమువలన బ్రతికితి మని వారిని గొండాడిరి. అప్పుడు జగదేవుఁడు మీ రెవరని యడుగఁగా నాయిరువురలో నొకఁడుముందునకువచ్చి "అయ్యా! మేము ధారానగరమువద్ద నున్న యొక పల్లెటూరియందలి వారము. మహారాజుగారి రెండవభార్య సోళంకీరాణి తనకుమారుఁడు కాన్పింపకుండ నెటకో పోవుటచే వెదకి తెప్పింపు మని ధీరసింహుఁ డను మంత్రితోఁజెప్పెను. అంత మంత్రి కొందఱు భటులను వెంటఁబెట్టుకొని స్వయముగా బయలుదేరి వచ్చెను. మే మిరువురమును వారి యాజ్ఞచొప్పున ముందుగ్రామములో భోజనసౌకర్యమును గుదుర్చుటకుఁబోవుచు నిక్కడ పులులచేఁ దరికట్టబడితిమి" అని చెప్పెను. అదివిని జగదేవుఁడు తనసంగతి చెప్పి వారితోఁ గూడ ధీరసింహుఁ డున్నచోటికి బయలుదేరెను. ఇట్లుపోవుచుండఁగా మార్గమధ్యమున వారికిఁ గొంద

తాశ్వికులెదురైరి. వారిలోఁదొలుత టుకటోడా సమీపమునఁ దన్ను కట్టివైచిన దురంతకులలోని యొకఁడుండుటచూచి జగదేవుఁడు వారు తన్ను పట్టుకొనుటకు వచ్చుచున్న వారని తలంచి సంగతియంతయు వీరమతికిఁ జెప్పి యామెను హెచ్చరించి యుద్ధమునకు సిద్ధమయ్యెను. క్షణములో వీరమతి గూడ సిద్ధమయ్యెను. సేవకు లిరువురును నిరాయుధు లగుటచే ప్రక్కకుఁబోయి రాళ్లగుట్ట నాశ్రయించిరి. ఇంతలో శత్రువులు వచ్చి యావీరదంపతులను డాఁకిరి. సేవకులు శత్రువులపై రాళ్లవాన కురిపింపఁజొచ్చిరి. కొంతతడవుపోరి శత్రువుల నాయకుఁడు వీరమతి కత్తిదెబ్బతిని మూర్ఛవోయెను. అదిచూచి శత్రువు లందఱు నామెపైఁబడిరి. ఇంతలో మఱికొందఱు కూలిరి; గాని యాయాసమువలన బలము తిరిగిపోయి వీరమతి చేతనున్న కత్తి క్రిందఁబడిపోయెను. అయిన నాశౌర్యవతి మరల కత్తి తీసికొనుటకుఁ బ్రయత్నించుచుండఁగా రెండుబాణములు వచ్చి యొకటి యామె కాలునకు, ఒకటిచేతికిని గ్రుచ్చుకొనెను. వానిని పెఱికివేసికొనునంతలో శత్రువులలో నొకఁడు వచ్చి యామె మెడబట్టుకొనెను. వెంటనే యామె మూర్ఛిల్లెను; గాని తోడనే జగదేవు డాదురంతకుని సంహరించివేసెను. మరల మిగిలి యున్న శత్రువులందఱును జగదేవునిఁ జుట్టుకొనిరి; గాని యింతలో యిరువదిమంది గుజ్జపురౌతులు అచ్చటకు వచ్చిరి. వారి నాయకుఁడు జగదేవుని గుర్తుపట్టి తనయనుచరులకు దురంతకులను సంహరింప నాజ్ఞయిచ్చెను. క్షణములో ఒక్కఁడైన మిగులకుండ దురంతకులందఱును నేలగూలిరి.

ధీరసింహుని జూచి జగదేవుఁడు తటాలున నాతనిఁ గౌఁగిలించుకొనెను. ఇట్లొక నిముసము గడచిపోయిన తరువాత జగదేవునకు వీరమతి మూర్ఛ జ్ఞాపకము వచ్చెను. వెంటనే యాతఁడామెకుపచారములు చేయఁగా నామె మేల్కాంచెను. ధీరసింహుఁడు ఆమె వీరమతి యని తెలిసికొని ఆనందమును, ఆమెకు దెబ్బలు తగులుటవలన విషాదమును పొందెను. ధీర సింహుఁడు ఇంటికి రావలసిన దనియు వాఘేలీరాణి దుర్బోధన ములవలన నీతండ్రి యిట్లుచేసె ననియు, నీవు వచ్చియథార్థ మంతయుఁ జెప్పినచో లాభ ముండుననియు, నీవు నిర్దోషి వని నేను సాక్ష్య మిచ్చెద ననియు జగదేవున కనేకవిధములఁ జెప్పెను; గాని ప్రయోజనము లేకపోయెను. "జరిగిన దేమో జరిగిపోయినది నేను ఇల్లు బయలు దేరినప్పుడు బాహుబల ముచేఁ గీర్తిసంపాదించికాని యింటికి రానని ప్రతిజ్ఞచేసితిని. కావున నీవు నన్ను బలవంతపఱుపకుము. అమితమైన ధనమును కీర్తిని సంపాదించిన వెంటనే నేను మాతల్లిదండ్రుల చెంతకు వచ్చెద" నని జగదేవుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఇఁక నెంత చెప్పినను లాభము కలుగఁబోదని నిశ్చయించుకొని ధీరసింహుఁ డాదంపతుల నాశీర్వదించి గమ్యస్థానమునకుఁ బోవ నాజ్ఞాపిం చెను. మఱియు జగదేవుని గుఱ్ఱము చనిపోవుటచే తన సేవకుల గుఱ్ఱములలో నొకదాని నిచ్చెను. ఒకరిచెంత నొకరు సెలవులు తీసికొని బయలుదేరిరి.

ఒకటిరెండు దినములలో వారు పట్టణము అను మాఱు పేరు గల అణహిలపురము చెంతకు వచ్చిరి. అచ్చట సహస్ర లింగతటాక మను నొక గొప్ప చెఱువుండెను. అచ్చట వారు

చేరునప్పటికి రెండుమూఁడుగడియల ప్రొద్దుండెను. వీరమతిని గుఱ్ఱములను అచ్చటనే యుంచి బస కుదుర్చుకొని వచ్చెద నని చెప్పి జగదేవుఁడు నగరమునకుఁ బోయెను. అతఁ డరిగిన కొంత సేపటికి నచ్చట కొక స్త్రీ జలముకొఱకు వచ్చి సుందరియగు వీరమతి యొంటరిగా నుండుటచే నామెచెంతకు వచ్చి, ఆమాటయు నీమాటయుఁ జెప్పి ఆమెయొక్కయు, భర్తయొక్కయు, అత్తమామలయొక్కయు పేరులను చాల నేర్పుతోఁ దెలిసికొని శీఘ్రముగా నగరమునకుఁ బోయి సంగతి యంతయుఁ దన యజమానురాలితోఁ జెప్పెను.

అప్పు డాపట్టణమును సిద్ధరాజు అను నాతఁడు పాలించుచుండెను. ఆతఁడు చాల మంచివాఁడే; గాని ఉద్యోగు లెట్లు ప్రవర్తించుచున్నారో యని యాతఁ డెప్పుడును పరీక్షించి యెఱుఁగఁడు. అక్కడతన పెద్దయుద్యోగు లందఱును స్వేచ్ఛగా నుండిరి. వారిలో డుఁగరసీ యను కొత్వాలు ఒకఁడు. అతఁడు చాలమంది దొంగలకు నాయకుఁడు. పెక్కు వారకాంతలకు విటుఁడు. అతని కొడుకుఁ గూడ జామోతీ యను నొకచక్కని వేశ్య నుంచుకొనెను. జామోతీ చాల ధనవంతురాలు. చాల వైభవము గలది. అంతచాతుర్యముగల స్త్రీ భూమిపై నుండదు.

జామోతీ తన విటకాఁడయిన లాలుదాసునకు ప్రతిదినము నొక క్రొత్త యువతిని చేకూర్పవలసియుండెను. చెఱువునకు నీళ్లుతీసికొని పోవచ్చిన స్త్రీ యామె దాసి. దానివలన సంగతులన్నియుఁ దెలిసికొని జామోతీ రాజస్త్రీవలె వేషము వేసికొని మేనాయెక్కి కొందఱుభటులతో వీరమతివద్దకు వచ్చి "మీ రిట్లు అన్యులవలె నీనగరములో పరాయిచోట నుండుట

ధర్మమేనా? నేను నీమామగారి పినతండ్రి కూఁతురను. జగ దేవుఁడు నాకు మేనల్లుఁ డగును. అతఁడు వీథిలోఁ బోవుచుం డఁగా వివాహరము పోవుచున్న రాజుగారు చూచి గుర్తించి కోటలోనికి దీసికొనిపోయినారు. జగదేవునివలన నీ విచ్చటఁ నుండుటఁ దెలిసి నిన్ను దీసికొని వచ్చుటకు రాణి నాకు సెల విచ్చినది. రమ్ము పోదము" అని చెప్పెను. కాఁబోలు ననుకొని వీరమతి పల్లకియెక్కి యామెతో బయలుదేఱెను.

అప్పటికి బాగుగా చీఁకటి యలముకొనెను.ఇంటికిఁ జేరిన తోడనే జామోతీ వీరమతికి అభ్యంగనస్నానము చేయించి భోజనమునకు రమ్మని పిలిచెను; గాని యామె మా మేనల్లుఁడు భుజింపనిదే నేను భుజింప నని చెప్పెను. వెంటనే జామోతీ జగ దేవునిఁ దీసికొని రమ్మని యొక దాసినంపెను. కొంతతడవునకు దాసితిరిగివచ్చి"వారును రాజుగారును భుజించినారు. ఏదో విష యమునుగుఱించి రాజుగారును వారును మంత్రియు తీవ్రాలోచ నముచేయుచున్నా"రనిచెప్పెను.అదివిని వీరమతికొంచెముభుజిం చెను. పిమ్మట జామోతీ యామెను మనోహరమైన యొకగది లోనికిఁ దీసికొనివెళ్లి కొంతతడ వచ్చట నామెతో ముచ్చటలాడి 'ఇదిగో వచ్చెద'నని బయటకు వచ్చి మెల్లఁగా తలుపునకు గొళ్లె మువైచెను. జామోతీ యెంతకును రాకపోవుటచే వీరమతి అను మానించుచుండఁగా లాలుదాసు సంతోషముతో నచ్చటికి ప్రత్యక్షమయ్యెను. వీరమతికి వానిని జూడఁగానే సందేహము బలపడి ఆఁదోళనము గలిగెను.వాఁడామెను సమీపింపఁ బోఁగా నామె తొలఁగిపోయెను. వాఁ డనేకవిధములఁ బ్రార్థించెను;గాని ప్రయోజనములేకపోయెను. లాలుదాసు తుదకు విసిగిపోయి

సాహసమువలన కార్యము లేదని తలంచి బలిమిచే పట్టందలంచి యామె నంటఁబోయెను. వెంటనే వీరమతి తన మొలలోనున్న గుప్తఖడ్గమును తటాలున దీసి వాని శిరమును భూమిపైఁబడఁ గొట్టి శిరమును మొండెము నొక దుప్పటమును మూటగట్టి గవాక్షముసుండి క్రిందికిఁ బాఱవేసి లోపల గొళ్లెము బిగించుకొని నేనొక గొప్ప యాపత్సముద్రములో పడిపోయితి నని తలంచి విచారింప సాగెను.

రెండుజాముల రాత్రియైన తరువాత రక్షకభటులు పట్టణములో గస్తీ తిరుగుచుండఁగా వారి కీమూట దొరికెను. అది విప్పి చూచి వెంటనే ఖండితశవమును కొత్వాలునకుఁ జూపిరి. అతఁడాశిరమును, మొండెమును తనకుమారుని వగుటఁ దెలిసికొని, మొత్తుకొనుచు జామోతీయింటికి వచ్చి నాకుమారుఁ డెక్కడ నున్నాఁడని యడిగెను. అందుల కాజామోతీ సంతోషముతో నీకుమారుఁ డొక భూలోకరంభతో క్రీడించుచున్నాఁడని చెప్పెను. అది విని కొత్వాలు జరిగిన సంగతి యంతయుఁ జెప్పెను. వెంటనే యడలిపోవుచు జామోతీ వీరమతి యున్నచోటికి వచ్చెను; గాని తలుపు బిగించి యుండుట వలన లోపలికి పోవుటకు వీలు కలుగ దయ్యెను. అక్కడతన కొత్వాలు వీథిలో గవాక్షమునకు నిచ్చెనవేసి గదిలోనున్న స్త్రీ యేమిచేయుచున్నదో చూచి రమ్మని యొక భటున కాజ్ఞాపించెను. ఆప్రకారము భటుఁడు నిచ్చెనయెక్కి గవాక్షములో తలపెట్టెను; గాని వెంటనే శిరస్సు గదిలోను మొండెము వీథిలోను పడిపోయెను. ఇట్లొకని తరువాత నొకఁడు చొప్పున పదునొకండుగురు వీరభటులు వీరమతిచేతఁ జచ్చిరి. అంతలోఁదెల్ల

వాతెను. ఇదియూరెల్ల నిముసములోఁ దెలిసిపోయెను. జనులెల్ల రును గుంపులు గుంపులుగా వచ్చి చూడసాగిరి. ఒకక్షణములో రాజునకుఁ దెలిసెను. వెంటనే రాజు బయలుదేరివచ్చి సంగతి యంతయు విని నిచ్చెన యెక్కి గవాక్షము చెంతకుఁ బోయి "ఓనారీరత్నమా! నీవెవ్వనిభార్యవో తెలుపుము. ఊరక నా ప్రజలనందఱ నిట్లేల సంహరించెదవు. నే నీదేశమునకు ప్రభు వును. నిన్ను రక్షించెదను" అని చెప్పెను. అది విని వీరమతి జరిగినసంగతియంతయుఁ జెప్పెను. అందులకు రాజు చాల సంతసించి "నీవు క్షత్రియస్త్రీకి తగిన పని చేసితివి. ఇఁక నీకు భయములేదు. నిన్ను నాపుత్త్రికవలెఁ బెంచుకొందును. నీ భర్తను వెదకించి తెచ్చెదను. దయయుంచి యిఁక వెడలిరమ్ము" అని ప్రార్థించెను గాని వీరమతి "నాభర్తవచ్చినఁగాని యీతలుపు తెరవ నని ప్రతిన పట్టియున్నాను. ముందు నాభర్తను రప్పింపుఁ" డని చెప్పెను. వెంటనే రాజు జగదేవుని వెదక భటులనంపెను. ఈపనిచేయుచున్న రమణి తనభార్యయే యైయుండునా యని చూచుచు నక్కడనే నిలువఁబడి యున్న జగదేవుఁడు వెంటనే రాజు భటులకు తన్నెఱిఁగించుకొని రాజువద్దకుఁ బోయెను. రా జాతని తలుపువద్దకుఁ బంపెను. వెంటనే వీరమతి తలుపుతీసి భర్తను కౌఁగిలించుకొని జరిగిన దంతయు భర్తకుఁ జెప్పి విలపింపసాగెను. అప్పుడు రాజు అక్కడకు రాఁగా నాదంపతు లిరువురు నాతనికి మ్రొక్కిరి. పిదప రాజు జామోతీని, ఇంక నీకుట్రలో చేరియున్నవారిని ఉరి తీయ సెలవిచ్చి జామోతీ యాస్తియంతయు రాజస్వములోఁ గలిపి వైచి పూర్వపు

శాస్త్రములను శిక్షించి తెలివితేటలుగలవాఁడగుటచే జగదేవునకు శాస్త్రాలుపని యిచ్చెను.

జగదేవుఁడు ధర్మాత్ముఁ డగుటవలన నాతఁ డుద్యోగము నకు వచ్చినపిదప దుర్మార్గులకు ప్రాణసంకటముగా నుండెను. అగుటచే వారందఱు నీతని నెట్లు రూపుమాపుదమని యోచిం చుచుండిరి. ఇంతలో నానగరమున కలరా ప్రవేశించెను. ప్రతి దినమును వేలకొలఁది ప్రజలు చనిపోవుచుండిరి. అది చూచి రాజు ఈయాపత్తు తప్పవలెనని ప్రతిదినమును పోయి కాళికా దేవినిఁ బూజింపఁజొచ్చెను. ఇట్లు ఒకనాఁడు పూజసేయు చుండఁగా నాతనికి "రాజా! నీభక్తికి మెచ్చితిని. సద్గుణవంతుఁ డైన యొక రాజకుమారునిఁ దెచ్చి నాకు బలియిచ్చినవేని యారోగము నివర్తియగు" నను మాట వినవచ్చెను. అది కాళికాదేవి వాక్యమని తలఁచి రాజు "నాదేశములో అట్టివాఁ డెవ్వఁడున్నాఁడో నీవె చెప్పు" మని దేవి నడిగెను. వెంటనే దేవి "జగదేవుఁడు అట్టివాఁడు" అని చెప్పెను. ఈమాట వినఁగనే రాజునకు మీఁదిప్రాణము మీఁది కెగిరిపోయెను. రాజ్యమును చాల నభివృద్ధిచేసిన జగదేవుని బలియిచ్చు టెట్లు?

ఈచింతతో రాజు కోటలోనికిఁ బోయెను. ఈసంగతివిని జగదేవుఁడు రాజుచెంతకు వెళ్లి "రాజా! నీవు విచారింపవలదు. నేను దేవికి బలిపోయెద" నని చెప్పెను. రాజు ఎన్నివిధముల వలదన్నను జగదేవుఁడు పట్టినపట్టు విడువక రాజుచే నౌనని పించుకొని యీ సంగతి వీరమతితోఁ జెప్పుటకు ఇంటికిఁ బోయెను. ఇదివిని వీరమతిగూడ బలిపోవుటకు సిద్ధపడెను. అణహిల పురమువచ్చిన తరువాత వారి కొక కుమారుఁడు గలిగెను. ఆ

చిన్నవాఁడు తల్లిదండ్రులతోఁ గూడ దేవికి బలిపోవుచున్నది  చెప్పెను. వెంటనే వారు ముగ్గురును గుడికి బయలు దేరిపోయిరి.

ఈఘోరవార్త క్షణములో రాజునకు తెలిసెను. వెంటనే యాకుటుంబమును వారించుటకు రాజు గుడికిఁ బోయి మీరారు బలిపోవలదని చెప్పెను. అప్పుడు మరల నాతనికి "రాజా! వారింపకుము. ఈబలివలన నీవు బాగుపడెదవు" అనుమాట విన వచ్చెను. అది విని రాజు సందేహించి దేవీ విగ్రహము వెనుకకుఁ బోఁగా నచ్చట నొక పురుషుఁడు కూర్చుండి యామాటలు పల్కుచుండెను. వెంటనే రాజు వానిని పట్టి కట్టించి తాడనములవలన వానిగుంపులోని వారి నందఱను దెలిసికొని అందఱను శిక్షించి మహోత్సవముతో వీరమతిజగదేవులను, వారి ముద్దులకుమారుఁడు అగుజగద్ధవలుని తన యింటికిఁ దీసికొని పోయెను. పిదప రాజు ఇన్నివిధములఁ దనయాపదను తొలగించిన జగదేవున కేమియిచ్చినను ఋణము తీరదని భావించి ప్రభావతి యనుతనకొమార్త నాతని కిచ్చి వివాహము చేసి అనేకగ్రామము లల్లునకు బహుమతి చేసి వీరమతికిఁగూడ గొప్ప బహుమతులు చేసి సత్కరించెను.

జగదేవుఁడు అణహిలపురములో నిట్లు సుఖపడుచుండగా అక్కడ నొక శత్రురాజు వచ్చి యాతని తండ్రి నోడించి రాజ్యమంతయు స్వాధీనము చేసికొని యాతని ఖైదుచేసెను. ఈవార్తవిని జగదేవుఁడు వెంటనే మామగారిసైన్యముతో సెలవుగూడఁదీసికొని బయలుదేరి శత్రువులను జయించి తండ్రిని మరల యథాప్రకారము సింహాసన మెక్కించెను.

అప్పుడు ధీరసింహుఁడు రాజుతో సంగతి యంతయుఁ జెప్పఁగా రాజు సోళంకీరాణిని మరల కోటలోనికిఁ దీసికొని వచ్చి వాఘేలీరాణి నూరిబైటనుంచి జగదేవుని యువరాజును గావించి ప్రజలు సుఖపడునట్లు రాజ్యమేలెను. ఉదయాదిత్యుని యనంతరము జగదేవుఁడు పెద్దకాలము రాజ్యమును చక్కఁగాఁ బరిపాలించి కీర్తివహించెను. ఈమహిమ యంతయు జగదేవునకు వీరమతివలననే కలిగినది.



# చంద్రవదన

కాశ్మీరదేశాధిపతి యగు చంద్రశేఖరుఁడు అనురాజునకు లేకలేక చంద్రవదన అను నొక కొమార్తె గలిగెను. తల్లిదండ్రు లామెను గారాబముతోఁ బెంచుచు యుక్తసమయమున విద్యాభ్యాసమునకు బ్రారంభముచేసి గొప్పవాఁ డగు నొక పండితుని గురువుగా నేర్పఱిచిరి. చంద్రవదన చాల తెలివితేటలు గలది యగుటచే కాలము నెంతమాత్రమును వ్యర్థము చేయక అతిసులభముగా విద్య నభ్యసింపసాగెను. యుక్తవయస్సువచ్చునప్పటికి ఆమెకు ఎల్లవిద్యలును కరతలామలకములయ్యెను. అప్పటి కామెకు "ఈప్రపంచ మంతయు మాయ. సంసారము యాతనాపూరితము. ఆముష్మికమును నాశనము చేయు సాధనము. సంసారములోఁ బ్రవేశింపఁగూడదు" అను నిశ్చయము గలిగెను.

ఇట్లుండఁగా నొకనాఁడు చంద్రశేఖరుని సభకు భృగు మహాముని వచ్చెను. ఆతనికి ఉపచారములు చేయుటకై రాజు తన కొమార్తెను ఏర్పఱిచెను. చంద్రవదన తండ్రియనుమతి చొప్పున భృగుమహర్షిని చాల భక్తితోఁ బూజించుచు నాతని దయ సంపాదించి యొకనాఁడు "మహాత్మా! మోక్షమార్గము నుపదేశింపు"మని వేఁడెను. విజ్ఞానవతియగు రాజపుత్రికయొక్క ప్రశ్నలకు మిగుల నానందించి మహర్షి "పతిసేవకంటె స్త్రీలకు నిర్దోషమగు మోక్షసాధనము లేదు. పతిసేవవలన మగువలు మహర్షులు సాధింపలేని కార్యములను అనాయాసముగా సాధింపఁగలరు" అని చెప్పి అజ్ఞానకృతదోషములు తొలఁగిపోవుటకు మనస్సును నిర్మలము గావించుటకును ఆమెకు పంచాక్షరీ మంత్ర ముపదేశించి వెడలిపోయెను. సంసారము అసారమనియు నగుటచే పెండ్లియాడఁగూడ దనియు నిశ్చయించుకొన్న చంద్రవదన భృగుమహర్షివలన నుపదేశము పొందిన క్షణము మొదలుకొని "నాకెప్పుడు పెండ్లి యగును? నేను పతిపాదముల నెప్పుడు పూజింతు" నని యువ్విళ్లూరసాగెను.

ఇంతలో తనకుమార్తెకు యుక్తవయస్సు వచ్చియుండు టచే చంద్రశేఖరుఁడు వివాహము చేయవలయు నని భార్యతో యోచించెను. ఆమె యందునకు సమ్మతించెను. తోడనే యాతఁడు చంద్రవదనను పిలిపించి తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని "తల్లీ! నీవు యుక్తవయస్సురాలవైతివి. ఇఁక నీకు వివాహము చేయ వలసియున్నది. ఇదివఱకే నీవే రాజకుమారునైన మోహించి యుంటివేని తెలుపుము. లేకున్న మేమిప్పు డేమి చేయవల యునో చెప్పు" మని యడిగెను. అది విని చంద్రవదన తొలుత

నొకించుక సిగ్గుపడి తుదకు "తండ్రీ! స్త్రీలకు అలంకారమేది? ఎవనివలన స్త్రీలు పుణ్యపదవికి వెళ్లెదరు? లింగ దేహమన నేమి? మానవులు ఏకర్మలవలన మోక్షము పొందెదరు? జీవాత్మకు పరమాత్మకు తారతమ్య మేమి? ఈయైదుప్రశ్నలకును నాయన స్నునకు నచ్చుప్రత్యుత్తరము లొసంగు యువకుని పెండ్లి యాడెద" నని చెప్పెను. చంద్రశేఖరుఁడు కొమార్త తెలివి తేటల కెంతయు సంతసించి ఆప్రశ్నలను పురోహితుల కిచ్చి దేశములన్నియుఁ దిరిగి రం డని పంపెను.

పురోహితు లెల్లదేశములను తిరిగి సకలరాజకుమారుల వలనను ప్రత్యుత్తరముల గొనివచ్చిరి. అందఱ ప్రత్యుత్తర ములయందును చంద్రవదనకు ఆంధ్ర దేశపురాజపుత్రుఁ డగు విందుఁ డిచ్చిన ప్రత్యుత్తరములు వచ్చెను. ఆతఁ డిట్లు వరుసగా నాయైదు ప్రశ్నములకును సమాధానము వ్రాసెను.

౧. స్త్రీలకు అలంకార మేది? మానము.

౨. ఎవనివలన స్త్రీలు పుణ్యపదవికి వెళ్లెదరు? పతివలన.

౩. లింగదేహమననేమి? భగవంతుని ప్రకృతిరూపము.

౪. మానవులు ఏకర్మచే మోక్షమందెదరు? నిష్కామ కర్మవలన.

౫. జీవాత్మకు పరమాత్మకు తారతమ్యమేమి? జీవాత్మ తామరపాకువంటిది. పరమాత్మ దాని నంటక దానిపై నుండు నీటివంటిది.

కొమార్తె యిష్టము నెఱింగి చంద్రశేఖరుఁడు "తల్లీ! విందున కిదివఱ కొక భార్య గలదు. అయిన నాతనినే పెండ్లి యాడెదవా?" యని యడుగ నామె 'యాతనినే పెండ్లియాడెద'

పని చెప్పెను. చంద్రశేఖరుఁడు వెంటనే విందుని రప్పించి చంద్రవదన నిచ్చి పెండ్లిచేసెను. ఈపెండ్లికి విందుని పెద్దభార్యయగు చిత్రాంగదగూడ వచ్చి యుండెను.

అత్తవారింటఁ గొన్నిదినములుండి విందుఁడు యిరువురు భార్యలను దీసికొని స్వదేశమునకు బయలుదేఱి యొకరాత్రి దట్టమగు నొకయరణ్యమున విడిసెను. రెండుజాములరాత్రి వేళ రంభోర్వశులు లాకసమున నెక్కడకో పోవుచు ఇరువురుస్త్రీల నడుమ శయనించియున్న విందునిఁజూచి యాతని సౌందర్యమున కద్భుతపడి మోహించి వెంటనే స్వర్గలోకమునకుఁ దీసికొని పోయిరి. ఉదయము లేచి చిత్రాంగదయు, చంద్రవదనయు భర్త లేకపోవుటచే చాలవిచారించి వనమెల్ల వెదకిరిగాని యేమి లాభము? అంత చిత్రాంగద చంద్రవదనతో "చెల్లెలా! మన మిట్లు విచారించుచు నిఁక నిక్కడ నుండుటవలన నేమి ప్రయోజనము; ఈసమీపముననే మా తండ్రిగారి గ్రామమున్నది. అక్కడకుఁబోయి సంగతి యంతయు మా తండ్రితో జెప్పుదము. నలుమూలలకును భటుల నంపి భర్తగారిని మా నాయనగారు రప్పింపఁగల" రని చెప్పెను; గాని చంద్రవదన "భర్తవచ్చునంతవఱకు నే నిక్కడనుండికదలను, నీవు పుట్టినింటికి పొమ్ము" అనిచెప్పెను. చిత్రాంగద పుట్టినింటికిపోయెను. చంద్రవదన అక్కడనేయుండి భర్తకొఱకు తపస్సు ప్రారంభించెను.

అతితీవ్రమైన చంద్రవదన తపఃప్రభావమునకు తాళఁజాలక మూఁడులోకములును తల్లడిల్లసాగెను. ఈ యాపద తొలగింపు మని దేవత లందఱురుబోయి యింద్రునిఁ బ్రార్థించిరి. అంత నాతఁడు దివ్యదృష్టివలన సంగతి యంతయు గ్రహిం-

అకృత్యమును గావించిన రంభను ఊర్వశిని మందలించి విందుని తీసికొనిపోయి చంద్రవదనకు అప్పగించి యాదంపతుల ననేక విధముల నాశీర్వదించెను. చంద్రవదనను దీసికొనిపోయి విందుఁడు స్వగ్రామము చేరికొనియెను. చిత్రాంగద యిది యంతయు విని చాల నాశ్చర్యపడి భర్తవద్దకుఁ బోయి చంద్రవదనను చాల కొనియాడెను.

---

# తారాబాయి

---

రాజపుత్రస్థానమున వేదనగర మనుపేరుతో నొక చిన్న సంస్థానము ఉండెను. దానికి ప్రభువు సూరనాథాన్‌రాయఁడు అనునొక క్షత్రియుఁడు. ఈతఁడు చాల బలపరాక్రమములు గల శూరుఁడు. అనేక పర్యాయములు గొప్పగొప్పయుద్ధములు చేసి జయముపొందిన యోధుఁడు; గాని ముసలితనమున ఢిల్లా యను తుర్కీవానికి ఓడిపోయెను. సూరనాథాన్‌రాయని రాజ్యమంతయు ఢిల్లా వశపఱచుకొనియెను. పయింబయిఁగ రాయనిఁ గూడ దేశమునుండి వెడలఁగొట్టెను.

ముసలివాఁ డగుటచే నేమియుఁ జేయలేక రాయఁడు తకపూరు అను చోటికిఁ బోయి యచ్చట నివసించెను. ప్రత్యక్షముగా నేమియుఁ జేయలేకపోయినను ఈతఁడు తుర్కీవాని మీఁదఁ జాల పగబట్టి యుండెను. ఆపగ దీర్చుకొనుట కీతఁడు కొందఱు రాజులను సాయము గోరెను గాని వా రంగీకరింప రైరి. పాప మీవృద్ధుఁ డిఁక నేమిచేయఁగలఁడు? ఇది యిట్లుండఁ

'బులిమీఁద పుట్ర' యనినట్లు దిల్లారాయనిని తకపూరు నుండికూడ లేవఁగొట్టెను. రాయఁడిఁక చేయునది లేక అబూ పర్వతము మీఁదికిఁ బోయెను.

రాయనికి తారాబాయి యను నొక్కకుమార్తె తక్క మఱి కుమారికలు గాని కుమారులుగాని లేరైరి. అక్కతన నాతఁడీకొమార్తనే కొమారునిగా భావించుకొనసాగెను. తారాబాయి చిన్నతనమునందే తల్లి చనిపోయెను. తల్లిలేని బిడ్డయగుటవలన రాయఁడామెను టఱింతప్రేమతోఁ బెంచెను. ఆతఁడీకూఁతురుచేతనే దిల్లా నోడింపఁదలచి యామెకు యుద్ధవిద్య నేర్పఁదొడఁగెను. తార కుశాగ్రమతి యగుటచే తండ్రి చెప్పిన విద్యను క్షణములో గ్రహించుచు నాతని కానందము గూర్చుచుండెను. తార చాకచక్యమును గాంచి, యాతఁడు 'ఈముద్దబాలచే ఆయవనుఁడు తప్పక ఓడింపఁబడు' నని తలంపసాగెను.

పదునాఱుసంవత్సరములప్రాయము వచ్చునప్పటికి తార బలపరాక్రమములయందును, సౌందర్యములయందును గూడ అసమానురా లయ్యెను. ఈసంగతి రాజపుత్రుల కందఱకును దెలిసెను. అందఱు నామెను పెండ్లియాడవలయు నని యువ్విళూరసాగిరి. ఆలసించిన దాఁటిపోవు నని తలంచి మేవాడు రాజు అఘురాయమల్లుని కుమారుఁడు జయమల్లుఁడు రాయని చెంతకుఁబోయి తనకు తార నిచ్చి పెండ్లిచేయు మని కోరెను. జయమల్లుఁడు తనకంటె పెద్దరాజు కుమారుఁడగుటవలన తార నాతనికిచ్చిన బాగుండు నని రాయఁడు తొలుత తలంచెనుగాని వెంటనే యాతలంపు ప్రతిహతమై పోయెను. జయమల్లుఁడు

తన్ను పెండ్లియాడఁదలఁచి వచ్చె నని విని తార తనతండ్రికి "మనశత్రువు నేరాజపుత్త్రుఁడు సంహరించివచ్చునో యాతనిని నేను పెండ్లియాడెద" నని చెప్పెను. ఇది విని మిగుల నానందించి రాయఁడు జయమల్లునితోఁ దనకొమార్తె నిశ్చయమును తెలిపెను.

ఈమాట విని జయమల్లుఁడు ఏమియు తోఁచక కొంతసేపు నిశ్చేష్టుఁడై పిదప "నీకూఁతు నిచ్చి పెండ్లిచేయుము. పిదప నేను నీశత్రువును తప్పక సంహరించెద" నని యనేకవిధములఁ బ్రార్థించెను; గాని రాయఁ డందుల కంగీకరింపలేదు. "ఏర్పాటు నేను చేసినది కాదు. కావున నేను ఆవిషయమున నేమియు చేయుటకు వీలులేదు." అని యాతఁడు సమాధానము చెప్పెను. తారను గూడ జయమల్లుఁడు ప్రార్థించెనుగాని విఫలమనోరథుఁ డయ్యెను. వెంటనే యాతనికి ఆశాభంగమువలన నసూయ గలిగెను. అక్కడ నాతఁడు రాయఁడు వినుచుండఁగా తారను జూచి "నీవు ఆదరిద్రుఁడగు తండ్రికి తగినకొమార్తెవు. కప్పకు పన్నీటి సువాసన యేమి తెలియును? నీకు నాయింట నౌకరీచేయువానికంటె గొప్ప మగఁడు లభింపఁడు" అని పలికెను. ఈమాటలు వినఁగనే రాయని హృదయము భగ్గున మండిపోయెను. తోడనే యాతఁడు చట్టున కత్తిదూసి విసరెను. తార చూడఁగా జయమల్లుని శిరస్సు భూమిపై దొరలుచుండెను.

ఈసంగతి జయమల్లుని తండ్రి యగు రాయమల్లునకు తెలిసెను. ఇది విని యాతఁడు "పాడుబోతు భూమిమీఁదలేక పోవుటయే మంచిది. సూరసాధానురాయఁడు నేఁడు రాజ్యము

లేకపోయినను దుష్టులను దండించుటవలన రాజే యనిపించు కొనిరియె" నని పలికెను. రాయమల్లునకు పృథివీరాజు అను మఱియొక కుమారుఁ డుండెను. అతఁ డిదియంతయు విని తారను పెండ్లియాడి తీరవలయు నని నిశ్చయించుకొనియెను. వెంటనే యాతఁ డెనిమిదివేల సైన్యమును వెంటఁబెట్టుకొని బయలుదేరెను. ఈవార్తవిని తార అత్యానందమునంది తండ్రి చెంత సెలవు గైకొని మహోత్సాహముతో పృథివీరాజు వెంట బయలుదేరెను.

ఈయిరువురును దిల్లాయున్నథోదానగరము సమీపించు నప్పటికి ఆనగరమునందలి తురుష్కవాండ్రందఱును మొహరము పండుగమహోత్సవముతో నిమగ్నులై యుండిరి. నాఁటిరాత్రి తురక లందఱును పీర్లను గుమ్మటములలో నుండి మహోత్సాహముతో నూరేగించుచు నానందనిమగ్నులై యుండిరి. అయ్యవసరమున పృథివీరాజును, తారయు నొక సేవకునిమాత్రము వెంట నిడుకొని తక్కుగలసైన్యము నంతను పురము బైట నుంచి నగరములో ప్రవేశించిరి.

ఆసమయమున ఉత్సవములోనికి వచ్చుటకై దిల్లా మేఁడ మీఁద వీథిదెస నిలిచి ప్రజల యుత్సాహమునకు ఆనందించుచు దుస్తు ధరించుకొనుచుండెను. అదిచూచి వెంటనే తారబాణము వదలెను. రివ్వుమను ధ్వనితక్క బాణ మెరికినిఁ గాన్పింపలేదు. బాణము వేసినవా రెవరో తెలిసికొనుటకుఁ గూడ అవ కాశము లేకపోయెను. ఆదెబ్బతో దిల్లా నేలఁ గూలి ప్రాణములు విడిచెను. మేడనిండ హాహాకారములు మిన్నుముట్టెను. క్షణములో నీసంగతి యంతయు నగరమునం దంతటను వ్యాపిం

చెను, ఎక్కడి యుత్సవ మక్కడనే నిలిచిపోయెను. పౌరుల యానందమంతయు మాయమైపోయెను. అంత అను నెత్తియు నోరును బాదుకొనుచు నవాబుమేడదరికి రాసాగిరి. ఇంతలో రాజపురుషులు పురద్వారముచెంత నొక మదపుటేనుఁగును కాపుపెట్టి హంతకుని వెదకసాగిరి. ఈసంగతి విని తారాపృథివీరాయలును, సేవకుఁడును తమ సైన్యములోఁ గలసికొనుటకు బయలుదేరిరి; గాని మదపుటేనుఁగు గీపెట్టుచు వారి నడ్డగించెను. తోడనే తార తన నిడుదకత్తి విసిరి దాని తొండమును తెగనఱికెను. వెంటనే యేనుఁగు పాఱిపోయెను. తారాపృథివీరాజులు తమ సైన్యములను గలిసికొని థోదానగరముపైఁబడి తుర్కవాండ్రను ముట్టుపెట్ట నాజ్ఞయిచ్చిరి. తోడనే సంహారము ప్రారంభమయ్యెను.

ఆకస్మికముగా నీయుద్ధము సంభవించుటవలన తుర్కవాండ్రకు చాల సంకటము తటస్థించెను. వాండ్రు కత్తి పట్టుటకుఁగూడ నవకాశము లేకపోయెను. ఇంతలో మూఁడువంతులు తుర్కవాండ్రు నాశన మైరి. హతశేషులు పాఱిపోయిరి. తారా పృథివీరాజులు పట్టణము స్వాధీనము చేసికొనిరి. వేననగరసంస్థాన మిట్లు వారికి స్వల్పప్రయత్నమువలననే స్వాధీనమయ్యెను. తారా యీవార్త తక్షణమే తండ్రికిఁ దెలియఁజేసెను. రాయఁడు తారను పృథివీరాజును మనసార దీవించి చాల మెచ్చుకొని వారిద్దఱకు నత్యానందముతో కల్యాణము చేసి రాజ్యము అల్లున కిచ్చివేసెను. తారాపృథివీరాజు లత్యనురాగముతో కాలము గడుపుచుండిరి.

పృథివీరాజున కొక చెల్లె లుండెను. ఆమెను ఆమెభర్త యగు ప్రభురాయఁ డనేకవిధముల బాధింపసాగెను. తన చెల్లెలి బాధలు సహింపలేక పృథివీరాయఁడు బావమఱఁది విష మెక్కువగుచుండునట్లు ప్రభురాయనికి పృథివీరాయఁడు హితోపదేశము చేసినకొలఁది దౌర్జన్య మెక్కుడు కాసాగెను. ఇది చూచి పృథివీరాజు ఆతనికి చాల కఠినముగా జాబు వ్రాసెను. ఆజాబువలన ప్రభురాయనికి కోపము పెఱిగిపోయెను. దానితో నాతనికి పృథివీరాజును గుఱించి దుశ్చింత కలిగెను; గాని శాంతమునే వెల్లడింపసాగెను.

ఒకనాఁడు ప్రభురాయఁడు పృథివీరాయని విందునకు పిలిచెను. బావగుణము చక్కఁబడెను కాఁబోలు నను ఆనందముతో పృథివీరాజు ఆవిందునకుఁ బోయెను. ప్రభురాయఁ డాతని కెంతో గౌరవము చేసి విషాన్నము పెట్టించెను. ఈసంగతి తెలియక పృథివీరాజు ఇఁక తనచెల్లెలికి సౌఖ్యము కలుగు నని నిశ్చయించుకొని బావతో చెప్పి యింటికి బయలుదేరెను; గాని విషము తల కెక్కుటవలన నాతఁడు మార్గమధ్యమున పడిపోయెను. ఇది విని తార అక్కడకు వచ్చెను. అనేక రాజవైద్యులువచ్చి చికిత్సలు చేసిరి; గాని ప్రయోజనము లేక పోయెను. తుదకు పృథివీరాజు కొంతసేపటికి ఈలోకము విడిచి పోయెను. ప్రజలెల్లరును నాతనికొఱకు చాల విచారించిరి. తార భర్తతో సహగమనము చేసి ఆనందనిలయమునకుఁ బోయెను.

# ప్రభావతీదేవి

---

పాటలీపుత్రపురాజు అగు చంద్రశేఖరునకు ప్రభావతి అను నొక కూఁతురు కలిగెను. ఆతఁడు ఆమె తక్క వేఱు సంతానము లేకపోవుటచే అల్లారుముద్దుగఁ బెంచుకొనుచు మంచిప్రాయము వచ్చునప్పటికి ఆమె సంపూర్ణయౌవనవతియై, సుందరీ శిరోమణియై, విద్యల ప్రోఢ యయ్యెను.

ప్రభావతి సౌందర్యమును, విద్వత్తును, సుగుణములను విని ఎందఱో రాజకుమారు లామెను పెండ్లియాడవలె నని ముచ్చటపడుచుండిరి. ఆమెతలిదండ్రులుగూడ నామె నొక చక్కనివరున కిచ్చి ముద్దుముచ్చటలు తీర్చికోవలయునని యువ్విళులూరుచుండిరి; గాని ప్రభావతి మాత్రము పెండ్లి యనినను, సంసారమనినను చాల కంటగించుకొనసాగెను. కావున నామె పెండ్లి యాడఁగూడ దని నిశ్చయించుకొనెను.

ఒకనాఁ డామె తలిదండ్రు లామెను చేరఁదీసి చెంతఁ గూర్చుండఁబెట్టుకొని బుజ్జగించి "అమ్మా! నీకు వివాహము చేయవలసిన కాలము వచ్చినది. మాకు ముద్దుముచ్చటలు తీర్చుకోవలయు నను అభిలాష త్వరపెట్టుచున్నది. కావున నీవు ఏరాజపుత్రుని వరించితివో చెప్పుము. వెంటనే యాతనిం దెచ్చి వివాహము గావింతు" మని చెప్పిరి. ఇది విని తొలుత ప్రభా

వతి కొంచెము సిగ్గుపడెను; గాని ఇట్టి సమయమున లజ్జించుట క్షేమకరము గాదని తలంచి "నాకు వివాహము వలదు" అని ఖండితముగా చెప్పెను. ఇది విని యామె తలిదండ్రులు తెల్ల వోయిరి. నిండు యౌవనమున నున్న కన్యలు వివాహము వల దని చెప్పుట యెందైనఁ గలదా?

తలిదండ్రు లనేకవిధముల బతిమాలిరి; గాని యామె పెండ్లి యాడుట కంగీకరింపలేదు. తుదకు చేయునది లేక వా రూరకుండిరి. ఇట్లుండఁగా నొకనాఁడు త్రిలోకసంచారి యగు నారద మహర్షి చంద్రశేఖరుని సభకు వచ్చెను. చంద్ర శేఖరుఁ డాతని నతిభక్తితో నర్ఘ్యపాద్యాదివిధులతోఁ బూజిం చెను. పిదప మహర్షి "నీకు నేమమా" యని యడుగఁగా రాజు "మీకు తెలియని దేమి యున్నది" యని చెప్పెను. ఇది విని ముని దివ్యదృష్టిచే జూచి సంగతి యంతయుఁ దెలిసికొని రాజుతో నీకు ఆవిషయమైన విచారము వలదు. నీ కుమారిక మనస్సు నేను చక్కజేసెద నని చెప్పెను. రాజు మహర్షిని తన కొమార్తె అంతఃపురమునకుఁ బంపి, మునీశ్వరులను జాగ్రత్తగా బూజింపు మని ఆమెకుఁ దెలియఁజేసెను.

ప్రభావతి నారదుని చాల భక్తిశ్రద్ధలతోఁ బూజ చేసెను. ఆపూజ లవలన సంప్రీతుఁడై యాతఁడు 'నీకేమికావలె' నని యడిగెను. ప్రభావతి "మోక్షమార్గ ముపదేశింపు" మని కోరెను. ఇదే సమయ మని తలంచి ముని యామెకు గృహ స్థాశ్రమమునందలి ఘనతను వివరించి చెప్పి పతిసేవయే స్త్రీలకు మోక్షసాధన మని చెప్పి వెడలిపోయెను. పిదప ప్రభావతికి పెండ్లి చేసికోవలయు నని బుద్ధి పుట్టెను. వెంటనే యామె కా

యభిలాష పెరిగి పోయెను. ఈసంగతి గ్రహించి చంద్రశేఖరుఁ డామెతో మరల వివాహ ప్రస్తావన చేసెను. "సకలవిద్యలు నేర్చిన రాజకుమారునిఁ బెండ్లియాడెద" నని ప్రభావతి చెప్పెను. చంద్రశేఖరుఁ డట్టివానిని వెదకింపసాగెను.

ఇట్లుండఁగా మాలవదేశపు రాజపుత్త్రుఁడైన చిత్రకరుఁడు దేశయాత్ర చేయుచు పాటలీపుత్రనగరమునకు వచ్చెను. ఆతఁడు ప్రభావతివలెనే సకలవిద్యాప్రవీణుఁడు. నిండుజవ్వనమున నున్న వీరాగ్రేసరుఁడు. మన్మథునింబోలు సుందరాకారుఁడు. అట్టి చిత్రకరుఁడు తన పట్టణమునకు వచ్చెనని విని చంద్రశేఖరుఁ డాతనిని గురించి ప్రభావతితో చెప్పెను. చిత్రకరునిఁ బెండ్లియాడుట కామె సమ్మతించెను, తోడనే చంద్రశేఖరుఁడు చిత్రకరునికి తన కొమార్తెశపథమును చెప్పి "నీవు పెండ్లియాడు" మని చెప్పెను. చిత్రకరుఁడు గూడ ప్రభావతిని పెండ్లిచేసికొనుట కంగీకరించెను. తోడనే చంద్రశేఖరుఁడు మహావైభవముతో ప్రభావతీచిత్రకరులకు కల్యాణ మహోత్సవము గావించెను.

చిత్రకరుఁడు కొన్ని దినములు అత్తవారియింట నుండి అత్తమామల యనుజ్ఞఁబడసి ప్రభావతినిఁ దీసికొని స్వదేశమునకు బయలుదేరెను. అనేకనదులను, అనేకజనపదనగరములను దాఁటి ప్రభావతీచిత్రకరు లొకనాఁడు ఒక మహారణ్యమున రాత్రి గడుపఁ దలఁచి విశాలమైన యొక మఱ్ఱిచెట్టు క్రింద విశ్రమించిరి. నాఁటి రాత్రి చిత్రకరునకు భార్య గుణము కనిపెట్టవలెనని తలంపు గలిగెను. అక్కతన నాతఁడు రెండుజాముల

రాత్రివేళ ప్రభావతి గాఢనిద్రలో నుండఁగా లేచి గుఱ్ఱ మెక్కి స్వదేశము దారిపట్టి వెళ్లిపోయెను.

తెల్లవాఱినపిదప లేచి భర్త కనఁబడకపోవుటచే ప్రభావతి తెల్లపోయెను. క్షణములో నామెకు భయమును విచారమును గలిగెను. పెక్కుసారులు ఆచుట్టు ప్రక్కలఁ దిరిగి ఆమె భర్తను పేరుపెట్టి పిలుచుచు వెదకెను; గాని కానుపింపఁడయ్యెను. ఏమైపోయెనో యను విచారముతో నామె ముందునకుఁ బోవుచుండఁగా కొందఱు దొంగలు వచ్చి యామె నడ్డగించి నగలన్నియు నిమ్మనియు లేకున్న చంపివేసెద మనియుఁ జెప్పిరి. తోడనే యామె చేయునది లేక మిగుల విచారించుచు మంగళసూత్రమును వారిపైఁ బడవేసెను. అది అగ్నిహోత్రమై వారినందఱను దహించివేసెను. ప్రభావతి మరల దానిని ధరించి ముందునకుఁ బోయి అక్కడ నొక మునినిఁ గాంచి యాతనికి మ్రొక్కి తన యవస్థ నంతను జెప్పెను. అంత నమ్ముని దివ్యదృష్టిని సంగతియంతయు గ్రహించి యామెకు అంతయుఁ జెప్పి, నాల్గుదినము లిచ్చట నుండు మని చెప్పెను. ప్రభావతి ముని సెలవు చొప్పున నాల్గుదినము లచ్చట నుండి "నాభర్తనుజూడకుండ నేను ఉండఁజాలను. నాకు సెలవీయవలసిన" దని మునిని ప్రార్థించెను. మునియు నామె దైన్యమును జూచి సెలవిచ్చెను. ప్రభావతి నెలదినములు కష్టపడి ప్రయాణముచేసి భర్తగ్రామము చేరెను. ఊరి బయట నిలిచి ఆమె సంగతి విచారణచేయఁగా పూర్వపురాజును ఒక క్రొత్తరాజు వచ్చి యుద్ధములో జయించి భార్యాపుత్రులతో కైదుచేసి రాజ్య మాక్రమించియున్నాఁడని తెలియవచ్చెను. వెంటనే యామె తన సంగతి వారికిఁ జెప్పఁగా

"అమ్మా ! ఈక్రొత్తరాజు మమ్ము చాల బాధించుచున్నాఁడు. మేమందఱము నీవుచెప్పినట్లుచేసెదము సెలవిమ్ము. యుద్ధము చేసి క్షణములో వాని నోడించివేసెద" మని ప్రార్థించిరి. ఇది విని బాగుగ నున్నదని చెప్పి వారి నందఱను సిద్ధముచేసి తానసేనాధిపత్యము వహించి శత్రురాజును తాఁకెను. యుద్ధము చాల తీవ్రముగ జరిగెను. నాఁటి సాయంకాలమునకే శత్రువు లోడిపోయిరి. శత్రురాజును కైదులోఁబెట్టి ప్రభావతి తన అత్తమామలను భర్తను చెఱ విడిపించెను. ప్రజలందఱును ప్రభావతి ప్రభావమును చాల మెచ్చుకొనిరి. అత్తమామ లామె ననేక విధముల కొనియాడి దీవించిరి. భర్త నాతప్పు సైరింపు మని ప్రార్థించెను. పిదప ప్రభావతి భర్తను సేవించుచు చాలకాలము అష్టైశ్వర్యము లనుభవించెను. ఇట్టి పతివ్రత లేదని ప్రజలందఱు నామెను మిగులఁ బూజించిరి.

---

# రామాబాయి

---

చిత్తూరుసంస్థానమును జగమల్లమహారాజు పరిపాలనము చేయుచుండెను. ఆతఁడు గొప్పవీరుఁ డనియు అనేకయుద్ధములు చేసి విజయలాభముఁబడసిన యోధుఁడనియు ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడు ప్రభువు అనియు విఖ్యాతివడసెను. ఆతనికి చంద్రావతి లీలావతి అను నిరువురు కొమార్తె లుండిరి. ఆతనికి పుత్రసంతానము గలుగలేదు.

ఇట్లుండఁగా డిల్లీని ఏలుచున్న అక్బరు హిందూదేశమంతకును దాను చక్రవర్తి కావలెనని యూహించి చిత్తూరు

మీాఁదికి దండెత్తివచ్చి "మీారు మాకు సామంతులుగా నుండవలెను. ఏటేటను కప్పము చెల్లింపవలెను. లేనియెడల నిప్పుడు యుద్ధముచేసి మిమ్ము స్వాధీనము చేసికొనెదను" అని కోటలోనికి సమాచారము పంపెను. అదివిని రాజపుత్రులు తోఁకత్రొక్కిన త్రాఁచులవలె మండిపడిరి. ఇంతవఱకును మనము వీరికిని సామంతులమై కప్ప మిచ్చియుండలేదు. ఈకీర్తిని నిలుపుకొనఁజాలమేని మనకు కులపాంసనులు అను అపకీర్తి వచ్చును" అని నిశ్చయించుకొని వారు అగ్బరుమీాఁద కత్తి దూసిరి.

ఘోరయుద్ధము ప్రారంభ మయ్యెను. ఇరుతెగలవారును చాల పట్టుదలతో పోరసాగిరి. అయినను రాజపుత్రులకంటె తుర్కవాండ్రు అధికసంఖ్యాకులై యుండుటవలన రాజపుత్రులకు చాల నిబ్బందిగా నుండెను. తురకలు లెక్కలేనంతమంది చనిపోవుచున్నను రాజపుత్రుల స్వల్పసైన్యము గూడ తఱిగిపోవుచుండెను. అక్కతన నొక్కనాఁడు జగమల్లుహా రాజా ధర్మపత్నియగు రామాబాయి భర్తచెంతకు వచ్చి యిట్లనియెను.

రాణి:—నేను మాఱు వేషము వేసికొని పోయి అగ్బరుని సంహరించి వచ్చెదను.

రాజా—నీయాలోచన మంచిదే. కాని యిది నెఱవేఱునా? స్త్రీవగు నీవు ఈపని చేయఁగలవా?

రాణి—ఆవిషయమై మీారు సందేహింపనక్కఱలేదు. ఆభారమంతయు నామీాఁదనే యుంపుఁడు. మీాయనుజ్ఞ యైనచో నాకీకార్యము విలాసమాత్ర మగును.

రాజా—నీకట్టి ధైర్యముండినచో నేను నిన్ను అభ్యంతర పెట్టను. కాని పోవునప్పుడు చాల జాగ్రత్తగా నుండవలెను.

మానభంగ మగు నని తోఁచినచో మనకులమునకు కళం
కము రాకుండ ఆత్మహత్య చేసికొనుము.

ఇది విని రాణి మిగుల నానందించి తురకఫకీరువేషమును దాల్చి యొక పిడేలు చేతఁ బుచ్చుకొని కోటవెడలి తురకశిబిరములదెసకు బయలుదేరెను. ఫకీరు అనిన తురకలు చాల గౌరవింతురు; గావున భటులెవ్వరు నామె నాటంకపెట్టరైరి. ఆమె తిన్నఁగ అక్బరు వసించియున్న డేరాకడకుఁ బోయి "నేను పాదుషాను దీవింపవచ్చితిని. ఆతనికి నారాక తెలుపుఁడు" అని భటులతోఁ జెప్పెను. అక్బరునకుఁ గూడ ఫకీరనిన నెంతో భక్తి; కావున నాతఁడు వెంటనే ఫకీరుని లోనికి గొనిరమ్మని భటునకు సెలవిచ్చెను. ఆభటునితోఁ గూడ ఫకీరు లోనికిఁ బోయి అక్బరు సలాము చేయఁగా దీవించి యాతఁడు చూపిన కుర్చీపైఁ గూరుచుండెను.

ఫకీరు—చిత్తూరురాజపుత్రులను కప్పముగోరి వారందుల కంగీకరింపకపోవుటచే వారి మద మణఁచుటకు నీవు యుద్ధము చేయుచున్నావని మాకు తెలియవచ్చినది.

అక్బరు—తమరు వినినదియథార్థము. ఈచిత్తూరురాజపుత్రులు ఒడలు తెలియక స్వపరతారతమ్యము లెఱుఁగక ప్రవర్తించుచున్నారు. మొదటినుండియు వీరు మాకు వ్యతిరేకముగనే యున్నారు. వీరిని వశపఱుచుకొనినఁ గాని నాఖడ్గము ఒఱలో విశ్రమింపదు.

ఫకీరు—నీపట్టుదలకు సంతోషము. ఇట్టి పట్టుదల యుండినఁ గాని ఏకార్యమును నెఱవేఱఁజాలదు.

అగ్బరు—ముఖ్యముగా మీవంటి మహాత్ముల యాశీర్వచనము గూడ నుండవలెను.

ఫకీరు—ఇస్లాముధర్మమునకు సర్వాధికార మొనగూర్చుట ప్రతిమహమ్మదీయునకును ముఖ్యవిధి. దానికై ప్రయత్నము చేయువారిని ఆశీర్వదించుటకు మేము సంతోషముతో దిరుగుచుందుము.

అగ్బరు:—కృతార్థుఁడను. ఈ సమయములో మీరు నావలన నేమి కోరివచ్చితిరి?

ఫకీరు:—ఎల్లకోరికలను వదలివైచిన మాకు ఏమికోరిక లుండును? బాల్యమునుండియు మాకు సంగీతమున చాల పరిశ్రమ కలదు. నీవు ఈ యుద్ధసమయమున చాల నలసియుందువు. శ్రమను పోగొట్టుటలో సంగీతమునకు మించినది లేదు; కావున కొంచెము నేను భగవత్కీర్తనలుపాడి నీమనస్సునకు విశ్రాంతి యొదవించి నిన్నానందపఱచుటకును, తత్కాలమున నావిధిని నెఱవేర్చుకొనుటకును వచ్చితిని.

అగ్బరు:—తమకు నాపైఁగల యనుగ్రహమునకు చాలకృతజ్ఞుఁడను. నా శ్రమకొఱకు మిమ్ములను శ్రమపెట్టుటకు నేను సంకోచించుచున్నాను.

ఫకీరు:—నీవు అందులకు సందేహింపవలదు. శ్రమపడకుండ నెవ్వరును కృతార్థులు కాఁజాలరు. గొప్పవైభవముం లను భవింపవలసిన నీవు యిపుడు చాల శ్రమపడుట లేదా?

అగ్బరు:—చిత్తము. వీరునకు ఇది శ్రమకాదు.

ఫకీరు:—అట్లే ఇతరుల కానందము గలిగించుట ఫకీరులకు శ్రమగాదు.

ఇంక నగ్బరు ఏమియు మాట్లాడఁజాలక పోయెను. పాడుఁడని ఆతఁడు కనుసన్నచే సూచించి యూరకుండెను. తోడనే ఫకీరు గంభీరమైన ఫిడేలుస్వరముతో కోమలమును మనోహరమును నైన తనకంఠస్వరము మేళవించి భక్తిరసబంధుర మగు నొక్కగీతమును పాడెను.

ఆ స్వరమాధుర్యమునకు ఆ భక్తిరసమాధుర్యమునకును అక్బరు సొక్కిపోయెను. అతనికిఁ జైతన్యము గలిగిన పిదప ఫకీరు మఱియొకకీర్తనపాడెను. అక్బరు ఆనందమును పట్టజాలక కన్నులు మూసికొని చేతులతో తాళమువేయసాగెను. మఱియొకకీర్తనపాడి అక్బరునకు మఱింత వివశత్వమును గలిగించి ఫకీరు తటాలున గుప్తమగు కటారితో నాతనిఁబొడువఁబోయెను. అదృష్టవశమున అక్బరు అనిగ్రహించి ఫకీరుచెయి పట్టుకొని కటారి యూడఁబెఱికికొని నీవెవ్వఁడవో చెప్పు మని గర్జించి పలికెను.

ఫకీరు అందుల కెంతమాత్రమును భయపడక మంద హాసము గావించుచు "నే నెవ్వఁడనైన నేమి? నీ ప్రాణములు తీయుటకు వచ్చితినిగాని తుదకు దైవము ప్రతికూలించుటవలన అభిలాషము నెఱవేర్చుకొనఁజాలకపోయితిని. ఇఁక మాఱు పల్కక నన్ను జంపివేయుము" అని చెప్పెను; గాని యాతఁ డట్లుచేయక "నీవెవ్వఁడవో తెలియకున్నంత కాలము నేనే మియు చేయ" నని చెప్పెను. వెంటనే రామాబాయి యథార్థమంతయుఁ జెప్పివేసెను. అదివిని అక్బరు తెల్లఁబోయి ఆమెను శిబికపల్లకిలోఁ గూర్చుండఁబెట్టి కోటలోవిడిచి రావలసిన దని భటుల కాజ్ఞాపించెను.

ఇట్లు విఫలమనోరథయై రామాబాయి కోటలోనికి వచ్చినపిదప భర్తతో 'ఏమైనను మనము యుద్ధమే చేయుదము. మనమో తురకలో నాశనము కావలెను' అని చెప్పెను. జగమల్లుఁడుగూడ నందులకు తగినట్లే చెప్పెను. పిదప నొకనాఁడు తురకలు నేఁడు తప్పక కోటకొట్టి తీరవలె నను దీక్షతో నిచ్చెనలు వేసికొని బురుజులపై కెక్కుటకు ప్రయత్నింపసాగిరి. అది తెలిసి జగమల్లుఁడును రామాబాయియు తనసైనికులను ప్రోత్సాహపఱచుచు మీఁది కెక్కి వచ్చుచున్న తుర్కీవాండ్రను బల్లెములతోడను ఈటెలతోడను పొడిపించి క్రిందికిఁ గూల ద్రోయించుచు ప్రాకారముమీఁద మెఱుపుమెఱసినట్లు సంచరింపసాగిరి. ఒక తురక సరదారుఁ డది చూచి రాజపుత్రుల విక్రమమునకు రాణియు రాజును ముఖ్యులని తలంచి చాటున నుండి రాజుపై నొకబాణము విడిచెను. ఆబాణము గుఱితప్పకుండ వచ్చి రాజు ప్రాణములను దీసెను. క్షణములో నీసంగతి యుద్ధరంగమునం దంతటను వెల్లడి యయ్యెను. రామాబాయికిఁ గూడఁ దెలిసెను.

తోడనే క్షత్రియుల పరాక్రమము మఱింత ప్రచండమయ్యెను. వారు దండతాడితభుజంగములరీతిని తుర్కీవాండ్రపై నిప్పులు కురియసాగిరి. రామాబాయికిఁగూడ జాలకోపము వచ్చెను. తన చేతికత్తితో అగ్బరుని సంహారించి తనభర్తను జంపిన పగదీర్చుకొనవలెనని యామెకు బుద్ధిపుట్టెను. వెంటనే యామె తురకసైన్యములో జొచ్చెను.

బడబాగ్నివలె ముందునకు త్రోసికొని ఉరకలు వేయుచు వచ్చుచున్న ఆమెను ఆపివేయవలయు నని కొందఱును

బంధింపవలె నని కొందఱును సంహరించివేయవలయు నని కొందఱును తురక లామెను చుట్టుకొనిరి; కాని యామె యొక్క అడుగు అయినను వెనుకకు వేయలేదు. ఒక్క త్రుటికాలమైన నిలువలేదు. ఆమె ముందునకు నడుచుచునేయుండెను. చేరవచ్చు తురకలశిరస్సులెల్ల భూమిపైఁ గూలుచునే యుండెను, అది చూచి తురకలు భీతిల్లలేదు. వారినిఁ జూచి రాణి యంతకంటె భీతిల్లలేదు. ఇరు తెగలవారు యిట్టి పట్టుదలతోడనే పోరుట వలన రామాబాయి పరాక్రమించి అక్బరున్న డేరా సమీపించు నప్పటికి వేల కొలఁది తురకల శిరస్సు లెగిరి పోయెను. రాణికి ఒక్క దెబ్బయైనను తగులలేదు.

ఇట్లు మహిషాసురమర్దనివలె విజృంభించుచు వచ్చుచున్న రామాబాయినిఁజూచి అక్బరు అంగరక్షకులు భయభ్రాంతులై గగ్గోలు పడసాగిరి. అది చూచి అక్బరు రామాబాయిని పట్టుఁడని ఒకరిద్దఱు సరదారుల నంపెను; గాని వారామె కత్తికి బలియైరి. వెంటనే పదిమంది సరదారు లొక్క మూఱుగ నామెను ముట్టడించిరి. వా రామెతో చాలతడవు పోరిరి. వారిలో కొందఱు కూలునప్పటికి రామాబాయికి చాల గాయములు తగిలెను. అక్కతన నామె మూర్ఛపడిపోయెను. వెంటనే అక్బరు కొందఱు పరిచారికలను రప్పించి యామెను ప్రత్యేక మొక డేరాలోనికిఁ దీసికొనిపోయి వైద్యోపచారములు చేయ నియమించెను.

వారము దినములలో నామెకు గాయములన్నియు మాని పోయెను. మరల యుద్ధముచేయుటకు బలము వచ్చెను. అప్పుడామె తనకు సేవ సేయుచున్న పరిచారికలను జూచి 'నన్ను

అగ్బరుచెంతకుఁ గొనిపొండు' అని చెప్పెను. అగ్బరు సెలవు పొంది వారట్లు చేసిరి. అగ్బరునిఁ జూడఁగనే రామాబాయి కన్నులనుండి అగ్నిహోత్రము కురియసాగెను. అధరము కంపింప సాగెను. తోడనే యామె 'అగ్బర్! ఒడలు తెలియకపడిపోయి నప్పుడు నాకు వైద్యోపచారములు చేయించిన నీకు నేను కృతజ్ఞురాలను. కత్తిపట్టుము నాకంఠములో ప్రాణము లున్నంతవఱకును నీకు శాంతి కలుగనీయను' అని చెప్పెను.

అదివిని అగ్బరు ఆమె పగను దలఁచికొని మనస్సులో చాల భీతిల్లి యిట్లనెను. 'నీవు రమణివి. అక్కటతవ ఆటలు సాగుచున్నవి. కాకున్న నీవింతవఱకే జగముల్లునిఁ గలిసికొని యుందువు నేను స్త్రీతో యుద్ధముచేయ నని నీతో వెనుకనే చెప్పియున్నాను. మరల నిప్పు డేల పిలిచెదవు? ఊరక వాగినంత మాత్రమున నేమి ప్రయోజనము?

రాణి—వెనుకటివలె నిన్ను నే నిప్పుడు నాశనము చేయఁదలఁచి కొన లేదు. నీకాబేదారులు నాభర్తను చంపివేసిరి. నాకు ఆయన పాదపద్మములచెంతకుఁ బోవలయు నని తలంపు గలిగినది. రమ్ము నిన్ను చంపి నేను చచ్చిపోయెదను.

అగ్బ—నీవు నీభర్తచెంతకుఁ బోవుటకు నే నేమియు అడ్డు చెప్పుటలేదు. కాని నీవు నన్ను చంపఁజాలవు. నిన్ను నేను చంపను.

రాణి—నిన్ను చంపఁజాల ననకుము. నీవు నిజముగ నీపరాక్రమమునం దంత నమ్మకము కలవాఁడవేని కత్తి దూయుము. లేకున్న నోడితి నని తొలంగిపొమ్ము.

అక్బ—అట్టిమాట యీతురకవీరుఁ డెప్పుడు ననియెఱుఁగఁడు. ఇఁక ననఁడు.

రాణి—నీవు వీరుఁడవు గావు. భీరుఁడవు.

అక్బ—స్త్రీలయెదుట నట్లే.

రాణి—నిన్ను జయింపఁగల స్త్రీలయెదుట.

అక్బ—నన్ను జయింపగలవా రింతవఱకును పుట్టి యుండలేదు. ఇఁక ముందునట్లే.

రాణి—ఛీ! వీరుఁడ ననియెదవు. పోరుటకు పిలిచిన రావు ఇప్పు డేమిచేయుదును.

అక్బ—వెడలిపొమ్ము.

రాణి—వెడలిపోనా? నీవు వీరుఁడవే; కాని నాతో యుద్ధము చేయఁజాలవు. శూరుఁడవే; కాని మానాభిమానములు లేవు. మగవాఁడవే; కాని మగటిమి లేదు. నీవు తురుష్కుఁడవే; కాని నీకాభిజాత్యమును లేదా? ఛీ! నీచుఁడా! నీ మొగము చూడరాదు.

అని రాణి వెనుకకు మరలి కోటలోనికిఁ బోయెను. కోటలోఁ జేరినతోడనే ఆమె రాజపుత్రుల నందఱను బిలిపించి పెద్ద సభచేసి "చిత్తూరు సంస్థానమును రక్షించుటకై మీలో ననేకులు తమ రక్తమును ధారవోసినారు. అనేకులు ధార వోయుచున్నారు. కాని యింతవఱకు నేమియు ప్రయోజనము గలుగలేదు. తురకలకు సైన్యనష్టము చాల గలిగినను చెక్కు చెదరక అట్లే యున్నారు. మనలో మహారాజు గతించెను. అక్బరు చూడఁగా చాల మొండితనము వహించి యున్నాఁడు. ఇప్పు డేమిచేయఁదలఁచి యున్నారో మీరు చెప్పుఁడని యడి

గెను. తోడనే యందొకఁడు లేచి తటాలున "తల్లీ! మనమిట్లు పట్టుపట్టి యుద్ధము చేయుటకన్న అగ్బరుతో సంధిచేసికొనుట మంచి దని తోఁచుచున్న" దని చెప్పెను. ఈమాట విని రాణి చాల కోపపడి "మాయజమానుని చంపిన తుర్కవానితో సంధిచేసి కొనుట మేలని చెప్పుటకు నీకు నోరెట్లాడినది? నీకు మానములేదా" యని యడిగెను. దానితో నాతఁడు సిగ్గుపడి తొలఁగిపోయెను. రాణి తక్కిన సైనికులను సేనాధిపతులను జూచి "మీరు శూరులు. మనకిఁక విజయమునెడల నాశ లేదు; కావున పురుషు లందఱును బోయి శత్రువులను జంపుచు వీరస్వర్గమునకు పొందుఁడు. స్త్రీలము అగ్నిలో దూకి మీ చెంతకు వచ్చెదము" అని చెప్పెను. అందులకు వారందఱు నంగీకరించిరి. రామాబాయి స్త్రీల నందఱిని నొకచోఁ జేర్చి, 'మన పురుషులందఱును వీరస్వర్గమునకు బోవుటయు యుద్ధరంగమున కుఱుకుచున్నారు. మనము గూడ వారి పదసన్నిధికిఁ బోవుటకు అగ్నిలో నుఱుకుదము" అని చెప్పెను. స్త్రీలందఱు నందుల కంగీకరించిరి.

కాని రాణి కొమార్తె లగు చంద్రావతియు నీలావతియు యుద్ధము చేయుటకు తమకు సెలవీయవలసిన దని తల్లి ననేక విధములఁ బ్రార్థించిరి. ఎంత చెప్పినను వారు యుద్ధరంగమునకు బోవుటకు రామాబాయి సమ్మతింప దయ్యెను. ఇఁక చేయునది లేక వారుగూడ అగ్నిలో దుముకుట కంగీకరించిరి

పురుషులందఱును యుద్ధరంగమునకుఁ బోయిరి. స్త్రీలు చితులు పేర్పించుకొని సిద్ధముగా నుండిరి. రాజపుత్రు లందఱును చనిపోయిరి. ఈ వార్త విని స్త్రీలు చితుల కగ్నిముట్టిం

చుకొని వానిలో దూకి ప్రాణములు విడిచిరి. అగ్బరు అగ్నిహోత్రముతో నిండియున్న కోట స్వాధీనపఱుచుకొనెను.

# సుముఖీదేవి

సింహాపురి అను నగరమున పశ్చిమమున నున్న కుమ్మరపేటలో శుద్ధసాధుఁ డను నొక కుమ్మరి వసించి యుండెను. వానికి లేకలేక యొక్కతెయే కూఁతురు కలిగెను. ఆ బిడ్డను వాఁడు అల్లారుముద్దుగాఁ బెంచుకొనుచు చక్కని ముఖము కలది యగుటచే నామెకు సుముఖి యని పేరు పెట్టెను. సుముఖియు తల్లిదండ్రులు తనయెడలఁ జూపుచున్న ప్రేమను గుర్తెఱిఁగి వారికి ఎప్పుడు నెదురాడక అన్నిపనులయందును తల్లికి చేదోడు వాదోడుగా నుండెను ; గాని యాటపాటలకు తోడి బాలికలతో నెప్పుడును మాట్లాడియు కాలముఁ బుచ్చియు నెఱుఁగదు.

అగుటచే నామెను జూచి యూరివారంతయును ఆమె మూగది యనియు, మందమతి యనియుఁ దలఁపసాగిరి. ఈసంగతి శుద్ధసాధునకుఁ దెలియవచ్చెను. అప్పుడు వాఁడు "అయ్యో! నాకూఁతునకు మూగది మందమతి అను పేర్లు వచ్చినవి. ఇది నిజముగ నట్లే యున్నది. ఎట్లో తొందరపడి నే నీమెకు పెండ్లి చేయకున్నచో నేను చనిపోయినతరువాత నీమె నెవ్వఁడును పెండ్లియాడఁ"డని నిశ్చయించుకొని యెట్లో కష్టపడి మందప్రజ్ఞుఁడు అనుపిల్లవానిని దీసికొనివచ్చి సుముఖ నిచ్చి పెండ్లిచేసి

అల్లు నింటనే యుంచుకొనియెను. సుముఖియు మంద ప్రజ్ఞుఁడు నేకష్టములు నెఱుఁగక సుఖముగా నుండిరి.

ఇట్లుండఁగా శుద్ధసాధుఁడు చనిపోయెను. కొలఁదిదిన ముల కాతని భార్యయు గూడఁ జనిపోయెను. సుముఖియు మంద ప్రజ్ఞుఁడునే యింటికిఁ బెద్దలైరి. అంతకు మున్ను నిశ్చింతగాఁ గూర్చుండిరి; గాన కష్టపడి యెఱుఁగరు. ఇప్పుడు సంసారభార మంతయు వారిపై నొక్కుమ్మాఱు పడెను. అది చూచి మంద ప్రజ్ఞుఁడు 'ఈసంసారసాగరము నెట్లీదగలను దైవమా' యని చాలతడవు యోచించికొని తుదకు భార్యనుజూచి "ఇంతవఱ కును మనమిరువురమును గూడ రాణివలెను రాజువలెను గూర్చుంటిమి ఇఁక నట్లున్న సాగదు. ఇఁక నీవు ఇరుగుపొరుగు స్త్రీలతోఁ గూడ పోయి ఏటియావల నున్న బంకమట్టి తెచ్చు చుండుము. నేను కుండలు చేసి కాల్చి యిచ్చెదను. నీవు పట్ట ణములోనికిఁ గొనిపోయి అమ్ముచుండుము. ఈతీరుగా మనము సంసారము గడుపుకొందము" అని చెప్పెను. సుముఖి అట్లే అని సమ్మతించి దినదినము అట్లే చేయుచుండెను.

ఒకనాఁడు ఆమె బంకమట్టి తీసికొనివచ్చుచు కొంత దూరము వచ్చి "ఇఁక మోయలేను దేవుఁడా" యని గంప నక్కడ పాఱవైచి విచారించుచుఁ గూర్చుండెను. అప్పుడే యామార్గమున గౌతమమహర్షి పోవుట తటస్థించెను. పోవుచు నాతఁడు సుముఖినిఁజూచి "నీవేల విచారించెద" వని యడిగెను. సుముఖి సంగతియంతయుఁ జెప్పఁగా విని యాతఁడు "సుముఖీ! నీవు, పూర్వజన్మమున నొక మహర్షికి పరిచర్య చేయుచుండెది వ్యానవు; గాని యప్పుడు నీవు జ్ఞానమును సంపాదింపలేదు.

కావుననే నీకిట్టి కష్టజన్మము తటస్థించినది. ఇప్పుడైనను మించి పోలేదు. నీవు నిర్దోషురాలవు. పతికి ఎప్పుడు నెదురాడి యెఱుఁగనిసాధ్విని; కాని యాతనియందు నీకు దేవుఁడు అను నమ్మకము లేదు. ఇఁక నీవు భర్తను దేవుఁడని తలఁచి పూజించుచుండుము” అని చెప్పి పూర్వదోషము లన్నియు నశించిపోవునట్లు ఆమెకు పంచాక్షరీమంత్ర ముపదేశించెను. ఆమంత్రప్రభావమువలన నామె మట్టిగంపను శిరముపై నిడుకొనఁగా నది నెత్తికి తాకక అంతరిక్షమున నిలిచి సుముఖపోయినట్లు రాసాగెను. ఇది చూచి సుముఖ మునికి నమస్కరించి ఆనందముతో నింటికిఁ బోయి మట్టిగంప దింపి అది చక్కగా శుద్ధించి కుండలుచేయుటకు భర్తకు ఇచ్చెను.

ఇట్లు కాలము గడచి పోవుచుండెను. ఒకనాఁడు ఊరివారందఱతోడను గలిసి సుముఖ మట్టికి బయలుదేరెను; గాని త్రోవలో పెన్న పొంగి పొరలి ప్రవహించుచుండుటచే అవ్వలి తీరమునకు పోవుటకు వారికి వీలు లేదయ్యెను. “అయ్యో! నేఁడు కుండల చేయుటకు మట్టి ఎట్లు తెచ్చెద” మని విచారించుచు వారందఱును వెనుకకు మఱలిరి. అప్పుడు సుముఖ వారి నందఱను జూచి “అక్కలారా! ఏల పోయెదరు? రండు. ఏరు దిగి పోద” మని చెప్పి తాను ముందు దిగెను. తోడనే యేరు ఆమెకు మార్గ మిచ్చెను. అందులకు ఆశ్చర్యపడుచు తక్కిన కుమ్మరిస్త్రీ లెల్లరు నామెవెంటఁబోయి మట్టి తెచ్చుకొని యీవింత నూరెల్ల వెల్లడిచేసిరి. అది విని ఊరివారందఱును ‘అద్దిరా! మాగది. కుంభమతి యని పేరుపడిన సుముఖ యెంతపనిచేసె” నని యాశ్చర్యపడసాగిరి.

ఈసంగతిని కుమ్మరకులముసామికి తెలియవచ్చెను. అంత నాతఁడామె గుణము పరీక్షింపఁదలఁచి కొందఱు స్త్రీలను బిలిచి "మీరందఱును పోయి సుముఖిని దేవుని యుత్సవమగుచున్నది రమ్మని పిలువుఁడు" అని పంపెను. వారు పోయి అట్లే పిలిచిరి. అప్పుడు సుముఖి భర్త పరుండియుండ పాదము లొత్తుచుండెను. అక్కడ తన నామె తన్ను పిలువవచ్చినవారిని జూచి "అక్కలారా! వచ్చుటకు నాకు తీరిక లేదు. అదియుఁగాక నా దేవుఁడు నావద్దనే యున్నాఁడు" అని చెప్పెను. అంత నాస్త్రీలందఱును పోయి పెద్దకుమ్మరితో సంగతి యంతయుఁ జెప్పఁగా నాతఁడామె పతిభక్తి కెంతో యానందించెను.

ఒకప్పుడు సుముఖీదేవి ప్రభావమును పరీక్షింపవలెనని ఆపట్టణము ప్రభువునకుఁ దలంపు గలిగెను వెంటనే యాతఁడు నాఁటిరాత్రి రెండుజాముల రాత్రివేళ సుముఖీదేవియు భర్తయు గాఢనిద్రలో నుండగా తన భటుల నంపి వారియింటికి నిప్పు పెట్టించెను. క్షణములో నగ్ని యిల్లంతయు వ్యాపించెను. చిటపటధ్వనులు బయలుదేరెను. ఆ ధ్వనివలన మేల్కాంచి మందప్రజ్ఞుఁడు భయాతిరేకముచే నెగిరి గంతులు వేయుచు పెడబొబ్బలతో భార్యను లేపెను. సుముఖి నిద్రమేల్కాంచి కన్నులు తెఱచిచూచిన వెంటనే కడవలతోఁ బోసినటు వర్షము కురిసి అగ్ని ఆఱిపోయెను.

మఱునాఁడు సుముఖి కుండలగంప శిరముపై నిడుకొని అమ్ముకొనుటకు నగరములోనికి బయలుదేరెను. కుండలగంప ఆమెశిరమున కానక ఆమె పోయినట్లెల్లఁ బోవుచుండెను. అది మంత్రిచూచి ఆశ్చర్యపడి రాజుతోఁ జెప్పెను. రాజుగూడ ఆశ్చర్యపడి వంటవానికి 'అకుండ లన్నియు నీవే వుచ్చుకొని మూఁడు జాముల ప్రొద్దెక్కువరకు ఆమెకు వెలయియ్యక కాలము గడుపు' మని చెప్పెను. ఎట్టి యవాంతరములు వచ్చినను సుముఖీదేవి రెండుజాములకు భర్తకు అన్నము పెట్టితీరును. ఆవ్రతము చెఱిచి ఆమె ప్రభావము పరీక్షింపవలె నని బుద్ధి పుట్టుటచే నాతఁ డట్లు చేయించెను. జామున్నర ప్రొద్దు ఎక్కువంతదనుక ఎన్నివిధముల నడిగినను ఆమాటయు నీమాటయుఁ జెప్పుచు 'వంటవాఁడు వెలయియ్యనందున ఇక నేను సెలవిచ్చు నంతదనుక సూర్యుఁ డక్కడనుండి కదలకుండ నుండుగాక' అని సుముఖి పలికెను. గడియారములో నాల్గుగంటలైనను సూర్యుఁ డక్కడనేయుండెను. అది చూచి రాజు వచ్చి ఆమెపాదములమీఁద వ్రాలి నమస్కరించి మహోత్సవముతో ఆభార్యాభర్తల నూరేగించి గొప్పబహుమానములు చేసెను. సుముఖిదేవి చిన్నతనము నాటి స్థితిని ఇప్పటి స్థితినిఁ బోల్చి చూచుచు ప్రజ లందఱును ఆశ్చర్యపడసాగిరి. సుముఖి చిరకాలము బ్రతికి భర్తతోఁగూడ కైలాసమునకుఁ బోయెను.

# సురభి దేవి.



కనకపురి అను పట్టణమున నొక బ్రాహ్మణునకు చాల కాలమునకు సురభిదేవి అను నొక కూఁతురు పుట్టెను. ఆమెను తలిదండ్రులు మిక్కుట మగు ప్రేమతోఁ బెంచుకొనుచుండిరి. సురభిదేవియు తలిదండ్రులను మిక్కిలి భక్తితోఁ బూజించుచుండెను. ఆమె తండ్రి సకలవిద్యలు నేర్చిన విద్వాంసుఁడు గావున ఏడవయేఁట అక్షరాభ్యాసము గావించి కూఁతునకు సకలవిద్యలును చెప్పసాగెను. సురభి ఒకమాఱు చెప్పినంతనే ఎంతకఠినపాఠమునైన నతిసులభముగా గ్రహించుచు తండ్రికి ఆశ్చర్యము గలిగించుచుండెను.

పదునాఱు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి ఆమె స్త్రీలకు వలయు విద్యలయం దన్నిటను చక్కని పాండిత్యము సంపాదించెను. అప్పటికి నిండుజవ్వనము ప్రాపించుటవలన చిన్నతనమున పరమసుందరి యగు నని తలంపఁబడిన యామె అట్లే అప్సరసలను గూడ తలదన్నఁ గలయంతటి సొగసుకత్తె యయ్యెను. ఇవి యన్నియుఁ జూచి ఆమెతండ్రి యామెకు తగిన వరుఁడెప్పుట దొరకునా యని యాలోచన చేయసాగెను. ఆమె తల్లియు "నాబిడ్డకు ఎట్టి భర్త లభించునో నాబిడ్డకు సుఖము కలుగునో కలుగదో" యని యాందోళన మందసాగెను.

ఇట్లుండఁగా నొకనాఁడు వారి యింటికి అగ్నిదత్తుఁడను ఒక బ్రాహ్మణవటువు మార్గవశమున అతిథిగా వచ్చెను.

అతని కాబ్రాహ్మణదంపతులు చాల మర్యాదచేసి మృష్టాన్న మిడి రొంతో ఆనందింపఁజేసిరి. భోజనమైన తరువాత ఆయింటి బ్రాహ్మణుఁడు బ్రహ్మచారితో చాలతడవు మాట్లాడి యేవో కొన్ని సంగతులు గ్రహించుకొని భార్యచెంతకుఁ బోయి "మన యింటికి వచ్చిన బ్రహ్మచారిని నీవు చూచితివిగదా. అతఁడు వయస్సు, శీలము, సౌందర్యము, విద్య, వంశము, గుణము మున్నగు సమస్తవిషయములయందును మన బిడ్డకు తగినవాఁడని తోఁచుచున్నది. నీయభిప్రాయ మేమి?" అని యడిగెను. అది విని ఆమె "నాకు ఎట్టి అభ్యంతరమును లేదు మన మంగీకరింతుమేని సురభికూడ వెంటనే అంగీకరించును. ఏమన:—నావలన నన్నిసంగతులును విని సురభి ఒకటిరెండు సారులు రహస్యముగా నాతని దెస గంభీరముగాఁ జూచి మందహాసము గావించుచు వెడలిపోయెను. అది నేను చూచు టవలన మీతో చెప్పవలయు ననుకొనుచున్నాను" అని చెప్పెను.

తోడనే ఆబ్రాహ్మణుఁడు అగ్నిదత్తుని చెంతకుఁ బోయి "నాకుమార్తెను నీకిచ్చెదను పెండ్లియాడెదవా"? యని యడి గెను. "ఆమెను మూఁడు ప్రశ్నలడిగెదను. అందులకు ఆమె నాకు ఆనందము గొలుపు సమాధానములు చెప్పినచో పెండ్లి యాడుటకు అభ్యంతరము లేదు" అని అతఁడు పలికెను. వెం టనే ఆబ్రాహ్మణుఁడు సురభిదేవిని రప్పించి యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొనెను. అప్పుడు అగ్నిదత్తుఁడు "స్త్రీలకు నీచ మేది? శ్రేష్ఠ మేది? భూషణ మేది" అని యడిగెను. అందులకు సుర భిదేవి వెంటనే "ఐహికసుఖాపేక్ష నీచము. జ్ఞానమువలనఁ

గలుగు ఆనందము శ్రేష్ఠము. పాతివ్రత్యము భూషణము" అని చెప్పెను. అది విని బ్రహ్మచారి సంతోషముతో నామెను పెండ్లి యాడుటకు సమ్మతించెను. ఒక సుముహూర్తమున ఆబ్రాహ్మణుడు తన కుమారికను అగ్నిదత్తునకు కన్యాదానము చేసి తరించెను.

వివాహమైన కొన్నిదినములు అచ్చటనే యుండి పిదప అగ్నిదత్తుడు అత్తమామల సెలవు గైకొని సురభిదేవిని వెంట నిడుకొని స్వగ్రామమునకు బయలుదేరెను. ఆదంపతులు మార్గమధ్యమున నొక పట్టణము చేరునప్పటికి చంద్రగ్రహణ పుణ్యకాలము వచ్చెను. ఆదినము పట్టణవాసు లెల్లరును సముద్రస్నానము చేయఁ బోవుచుండుటచే అగ్నిదత్తుఁడు గూడ భార్యను వెంటనిడుకొని బయలుదేరిపోయెను. వారి రువురును కొంగు ముళ్లతో స్నానము చేయుచుండఁగా కొన్ని చేపలును, మొసళ్లును వచ్చి ఆముడిని జాగ్రత్తగావిప్పి అగ్నిదత్తుని తీసికొని లోనికిఁ బోయెను. సురభిదేవి స్నానము చేసి చూడఁగా భర్త కానిపింపఁ డయ్యెను. అంత నామె "నాభర్త నేవో మొసళ్లువచ్చి మ్రింగివేసె" నని గోలుగోలున నేడ్చుచు తీరమునకు వచ్చెను. అది విని అనేకులామెచెంతకు వచ్చి అనేక విధముల ఓదార్చి "ఇఁక నీభర్త యెట్లును రాఁడు. నిన్ను నీతండ్రిగారి యింటికి పంపివేసెదము రమ్ము" అని పిలిచిరి; గాని "నాభర్తవచ్చినఁగాని నేను ఇక్కడనుండి కదల" నని ఆమె చెప్పెను. ఇది విని ఎల్లరును ఇదేమివింత యని యచ్చెరువందుచు ఎవరి యిండ్లకు వారు వెడలిపోయిరి.

సముద్రునకు సరస అను ఒక కూఁతురు కలదు. ఆమెయుం జాల సౌందర్యవతి, విద్యావతి, సుగుణవతి. ఆమె తన సేవకు లగు మొసళ్లో, మత్స్యములు మున్నగువానినిఁ జూచి "మీరు తఱుచు అన్ని రేవులకును బోవుచుందురు గదా! విద్వాంసుఁడు, అందగాఁడు, తరుణుఁడు, సుగుణవంతుఁడు అగు బ్రాహ్మణుఁడు కాన్పించెనేని వెంటనే తీసికొనిరండు" అని చెప్పెను. ఆమెచే అట్లు ఆజ్ఞాపింపఁబడిన మొసళ్లును చేపలును నాఁడట్లు అగ్నిదత్తుని కొనిపోయెను. సరస యింటికిఁబోయి అగ్నిదత్తుఁడు ఆమె సౌందర్యమునకును, సుగుణములకును మెచ్చుకొని ఆమెచేఁ బ్రార్థింపఁబడి ఆమెను గాంధర్వవిధిని పెండ్లియాడి అచ్చటనే యుండి పోయెను.

పౌరులవలన సురభిదేవి తపస్సు ప్రారంభించుట విని ఆ పట్టణమును ఏలు రాజు ఆశ్చర్యపడి సముద్రపు టొడ్డునకు వచ్చి పలుకరించెను; గాని ఆమె పలుక దయ్యెను. అది చూచి రాజు ఆమె తీవ్రసమాధినిష్ఠలో నున్నదని గ్రహించి ఎండ తగులకుండ ఆమె కూర్చున్నచోట పందిరి వేయుఁడని సేవకుల కాజ్ఞాపించి, ఆమెను కనిపెట్టి చూచుచుండుఁ డని పరిచారిక లను కొందఱను నియమించి వెడలిపోయెను.

కొన్ని దినము లగునప్పటికి సురభిదేవియొక్క తపస్సు వలన సముద్రునకు సహింపరాని బాధ కలిగెను. అప్పు డాతఁడు సురభిదేవియొక్క తపస్సునకుఁ గారణము తెలిసికొని కూతురు దగ్గఱకుఁబోయి "అగ్నిదత్తుని సురభిదేవికి అప్పగింప కున్న మనము నాశనమై పోయెద" మని చెప్పెను; గాని సరస తాను అగ్నిదత్తుని విడిచియుండఁ జాల నని చెప్పెను. తోడనే

సముద్రుఁడు కుమారికను అల్లుని వెంటఁబెట్టుకొని వచ్చి సురభి దేవిని అనేకవిధముల ప్రార్థించి అగ్నిదత్తుని ఇచ్చివేసి తన కూతురు వృత్తాంత మంతయుఁ జెప్పి సరస నామెకు అప్పగించెను. సురభిదేవి సరసను చెల్లెలివలెఁ గాపాడెద నని చెప్పెను. సముద్రుఁడు అది విని ఆమె చెంత సెలవు గైకొనిపోయెను.

ఇది యంతయు పరిచారికల వలన నెఱింగి రాజు రాణిని వెంటఁబెట్టుకొని వచ్చి ఆసురభిదేవిని, సరసను, అగ్నిదత్తుని అనేక విధముల కొనియాడి పూజించి భద్రగజముపై నెక్కించి రాణియుఁ దాను వింజామరలు వీచుచు పట్టణమంతయు నూరేగించి అనేకవిధముల బతిమాలి వారిని ఆనగరమునందే యుంచుకొనిరెను.

ఆదంపతులు ఒకరి నొకరు చాల ప్రేమించుకొనుచు రాజు పూజ లందుచు నక్కడనేయుండిపోయిరి. సురభిదేవి సరసను మిగులఁ బ్రేమించుచు, భర్తను చాల పూజించుచు చాల కాలము జీవించి సమస్తానందముల ననుభవించి తుదకు భర్తతోఁ గూడ కైలాసమునకు పోయెను.

---

# అసామాన్య

---

బంగాళా దేశమునందలి ముర్షిదాబాదు అను పట్టణమున సురాజుద్దౌలా యను తురక రాజ్యము చేయుచుండెను. ఈ తఁడు చిన్నతనమున మిక్కిలి గారాబముతో పెంపఁబడుటవలన మంకుతనము గలవాఁడును దుష్టులగు మనుష్యులతో స్నేహము చేయుటవలన దుర్మార్గుఁడును అయ్యెను. ఈతఁడు సింహాసన మెక్కినపిదప ప్రజలు తమ్ము అనేకవిధముల బాధించు నని తలంచిరి. అట్లె యాతఁడు చేసెను. ఇది యది యననేల? ప్రపంచములో నెన్ని దుష్కృత్యము లున్నవో అన్నిటి నాతఁడు చేయసాగెను. అందును విశేషించి యాతఁడు పరస్త్రీలపాలిటి రాక్షసుఁ డని మిక్కిలి పేరుగాంచెను.

ముర్షిదాబాదునందు మతుబుచందు అను నొక గొప్ప వర్తకుఁ డుండెను. అంతటి వర్తకుఁడు సామాన్యముగ నెందును ఉండఁడు అని అతఁడు పేరు పొందెను. అతనికి సురాజుద్దౌలా తన కొలువులో ఎంతో గౌరవము చేయుచుండెను. ఏమనః- నవాబునకుఁ గావలసిన అప్పు అంతయు ఆ వర్తకుఁడే యిచ్చుచుండెను. జూదము, త్రాగుబోతుతనము, వ్యభిచారము మున్నగువానికొఱకు అసంఖ్యధనము వెచ్చపడి పోవుచుండుటచే నవాబునకు సంస్థానముమీఁద వచ్చుఆదాయము చాలక తఱుచుగా అప్పు చేయవలసి వచ్చుచుండెడిది. నవాబు మతు

బుచందును అంతగా గౌరవించుచుండుటవలన నవాబు ఉద్యోగులుగూడ ఆతఁ డనిన భయపడుచుండిరి; గాని ఆతఁ డెరికిని అపకారముచేసి యెఱుఁగఁడు.

ఆమతుబుచందునకు ఒకకూఁతురు కలిగెను. ఆమె సౌందర్యమున అసామాన్యురా లగుటచే నాతఁ డామెకు అసామాన్య అని పేరుపెట్టి చాల ప్రేమతోఁ బెంచెను. ఆమె పెద్దదియైన తరువాత యోగ్యుఁ డగు ఒక వరునిఁ దీసికొనివచ్చి వివాహము చేసి తన సంపత్తంతయు కూఁతునకును అల్లునకును ఇచ్చి అల్లుని ఇంటియందే యుంచుకొనెను. అసామాన్య సౌందర్యమునకు తోడు విద్య, సౌజన్యము, పతిభక్తి గలిగి భర్త నెంతో ప్రేమించుచు నెంతో సంతోషపెట్టుచుండెను.

ఈదంపతులు ఇట్లు సుఖపడుచుండఁగా మతుబుచందు పుత్రిక త్రిలోకసుందరి అను మాట నవాబుచెవులఁ బడియెను. తోడనే వానికి కామము కలిగెను. మతుబుచందువలని భయముచే వాఁడు ఆకామమును అడఁచివేయుటకు కొంచెము ప్రయత్నించెను; గాని సాధ్యము కాదయ్యెను. తుద కాతఁడు ఆకామమును పట్టఁజాలక ఒక స్త్రీవేషమును ధరించి మతుబుచందు ఇంటికి వచ్చి యెట్లో అసామాన్య అంతఃపురము చేరికొనియెను.

తరువాత వాఁడు అసామాన్య సౌందర్యమును జూచి కొంతతడవు దిగ్భ్రాంతుఁడై ఆమె యొంటరిగా నుండుట చూచి తటాలున నామెను కట్టుకోఁబోయెను. అప్పుడామె స్త్రీవేషధారియగు నవాబును గుర్తుపట్టి అఱచెను. తోడనే ఆమె

భర్త వచ్చి సంగతి యంతయు విని చాలకోపపడి నవాబును చెప్పుదెబ్బలంకొట్టి పంపివేసెను

ఈపరాభవముతో నవాబు ఇలు చేరికొని అసామాన్య భర్తపై చాల పగఁబూని యొకనాఁడు అతఁడు కోటముందు నుండి యెటకో పోవుచుండఁగా శిరము గొట్టించి యొకపళ్లెములో దానిని ఉంచి అసామాన్యకు పంపించెను. భర్త శిరస్సును చూడఁగానే అసామాన్యకు దుఃఖాతిరేకముచే మతిభ్రమ గలిగెను.

పిదప మకుబుచందు అనేకవైద్యులచే చికిత్స చేయించెను; గాని అసామాన్య ఉన్మాదము కుదురదయ్యెను. రెండు సంవత్సరములవఱకు నామెకొఱకు తలిదండ్రులును బంధువులును అనేకవిధములఁ బ్రయత్నించుచుండఁగా నొకవైద్యుఁడు ఆమెసంగతి యంతయు విని వచ్చి మకుబుచందుతో "ఈవైద్యములవలన ప్రయోజనము లేదు. ఆమెభర్త నెవఁడు చంపెనో వాని శిరస్సు ఖండించి యామెకు చూపినచో యీ ఉన్మాదము కుదురు" నని చెప్పెను. ఇది చేయుట యెట్లు?

ఇట్లుండఁగా కొలఁదిదినములలో సురాజుద్దౌలాపాపము పూర్తిగా పండెను. ప్రజలందఱును ఆతనిపాలనమును నిందింపసాగిరి. శత్రువు లధికమైరి. ఇదిచూచి వాఁడు ఇఁక కోటలో నుండిన లాభములేదని గ్రహించి 'బ్రతికియుండిన బలుసు ఆకు తిని జీవింపవచ్చు'నని తలంచి యేరి కెఱుకపడకుండ నొకనాఁటి రాత్రి బయలుదేరి యెచటికో పాఱిపోయెను. అప్పుడు అంతవఱకు వానిని కనిపెట్టుకొనియుండి ప్రాణస్నేహితులమని చెప్పుచుండువారిలో నొక్కఁడును సాయపడఁడయ్యెను; గాని నిందు

చూలాలు అగు వానిభార్య మాత్రము వెంటఁబడెను. ఆదుర్మార్గుఁడు ఆమె నెప్పుడును ప్రేమతోఁ జూచి మాట్లాడి యెఱుఁగఁడు. అయినను ఆమె పతిభక్తికలది యగుటచే వెంట బయలు దేఱెను. అట్లాదంపతు లిద్దఱును పోయి బాగోపంగాలా యను గ్రామమున నొక గుడిసెలో పేదవారివలె రహస్యముగా వసించిరి.

కొలఁదిదినములలో బేగము కొమార్తెను గనెను. రాజ్యము పోయి అజ్ఞాతవాసము చేయవలసివచ్చినను రత్నము వంటికుమారిక కలుగుటచే వారెంతో సంతోషపడిరి. ఈసంతోషములోనుండఁగా నెవఁడో వాని పూర్వశత్రువు ఒకఁడు వాని తల నఱికివైచి దానిని ఒక బల్లెమునకు గ్రుచ్చి ముర్షిదాబాదునకుఁ దెచ్చెను. దానిని జూచి ఆపురమున నున్నవా రెల్లరును పట్టణమున నలువీథులయందును త్రిప్పిరి. ఈసంగతివిని మతుబుచందు ఆశిరస్సును అసామాన్యను ఒక మేడమీఁదికి దీసికొని పోయి ఆమెకు చూపెను. దానిని జూచి ఆమె జాలిపడి 'ఆదుర దృష్టవంతుఁ డెవఁ' డని అడిగెను. అందులకు పరిచారికలు 'తమ భర్తగారి శిరము నఱికించినవాఁడే' యని చెప్పిరి. అదివిని ఆమె కొంచెము విచారించి క్రిందికి దిగిపోయెను. తోడనే ఆమె ఉన్మాదము చేతితో తీసి వేసినట్లు మాయమైపోయెను.

పిదప నామెకు దురదృష్టవంతు రాలగు నవాబు పెండ్లాము సంరక్షింపవలె నని తోఁచెనుగాని అప్పుడు మీర్జాఫరు అనుతురుష్కుఁ డేలిక యగుటవలన నాతఁడు సురాజుదౌలా సంబంధమైనవారితో సంబంధము గలిగించుకొని వారిని శిక్షించుచుండెను. మతుబుచందుగూడ నట్లేచేయుచుండెను. అగుటచే

నసామాన్య వరికిని తెలియకుండ బేగమును రక్షించుటకుబయలు దేరెను. అదివిని బేగము భయపడి బిడ్డనెత్తుకొని పాఱిపోయెను. అసామాన్య వెంటబయలుదేరెను. ఇట్లు ఒకరి కొకరు అంద కుండ వారు ఒక సంవత్సరము తిరిగిరి. ఇట్లుండగా నొకనాఁడు అసామాన్య బేగమును సమీపించెను. వెంటనే బేగము పరు వెత్తెను. అసామాన్యగూడ పరువెత్తెను.

మార్గములో బేగమునకు పొంగిపొంగి ప్రవహించు ఒకయేరు అడ్డము వచ్చెను. దానిని దాఁటింపవలసినదని బేగము నావికులను బతిమాలెను; గాని యిప్పుడు నావనడుపలేనుని వారు చెప్పిరి. అప్పుడు ఆమె తన చేతనున్న రత్నపుటుంగరమును వారి కాళ్లపెట్టెను. అందులకు ఆశపడి వారు ఆమెను పడవ యెక్కించి బయలుదేరిరి. అప్పటికి అసామాన్య తీరమునకువచ్చి, అపాయము రాగలదు. వెనుకకురండని కేకవేసెను; గాని వారు వినలేదు. కొంతదూరము పోయి ప్రవాహవేగమున పడవ మునిఁగిపోయెను. తోడనే అసామాన్య ఏటిలో నుఱికి ఈదు కొనుచుఁ బోయి బేగమును బిడ్డను తీరముఁజేర్చి సకలోప చారములను జేసెను గాని బేగము చచ్చిపోయెను. బిడ్డ మాత్రము బ్రతికెను. అసామాన్య బేగమునకు అచ్చటనే దహ నము చేయించి బిడ్డ నెత్తుకొని యింటికి వచ్చి పెంచెను. తనకు అపకారము చేసినవారియెడలఁ గూడ ఇంత దయ కలది అగు టచే అచ్చటిజనులు అసామాన్య అనిన ఇప్పటికిని చేయెత్తి మొ్రొక్కెదరు.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1949.

శ్రీరస్తు

# భారతరమణీమణులు

## రెండవభాగము

బ్రహ్మశ్రీ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రికృతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

బ్రకటితము.

1940

# విషయసూచిక.







శ్రీ ర స్తు.

# భారతరమణీమణులు

## రు ద్ర మ దే వి.

---

సార్వభౌములలో నుత్తమోత్తముఁ డగు కాకతి గణపతిదేవుఁడు చిరకాలము భూమి నేలెను. ఆతనికి రుద్రమదేవి యను కొమార్తెమాత్రము ఉండెను. వేఱుగ పురుష సంతానము లేకపోయెను. అగుటచే నాతఁడు రుద్రమకే రాజ్యవ్యవహారములను నిర్వహించుపద్ధతు లన్నియుఁ నేర్పి మృతిఁజెందెను.

తండ్రిమరణానంతరము శివదేవయ్య యను మంత్రి సాహాయ్యమున రుద్రమదేవి సింహాసన మెక్కెను; గాని సామంతరాజులలోఁ గొందఱకు ఇది కంటకముగా నుండెను. "ఒక యాఁడుదానికి అంకితులమై యుండుటకంటె చచ్చుట మేలు" అని వారు భావించిరి. వారిలో హరిహరదేవుఁడు మురారిరావు అనువారు ముఖ్యులు.

ఇక్కడ ఓరుగంటిలో రుద్రమదేవి సింహాసన మెక్కిన కాలమునందే అక్కడ దేవగిరిలో మహాదేవరాజు గద్దె యెక్కెను. ఈతఁడు స్త్రీలజోలికిఁ బోవువాఁడు కాఁడు. అగు

టచే నాతని యాస్థానకవులు "మహాదేవరాజు పరాక్రమము నకు జంకి ఆంధ్రులు ఆఁడుదాని మఱుఁగు జొచ్చిరి" అని వర్ణింపసాగిరి. అది విని రాజు పొంగిపోసాగెను. ఈసమయము నందే హరిహరుఁడును మురారియు దేవగిరికిఁ బోయి మహా దేవరాజుతో మంతనము ప్రారంభించెను.

వారిలో వారికి మాటలు కలిసెను. ఇట్లుండఁగా రుద్రమదేవి కొమార్తె యగు ఉమ్మక్కకు పుత్రసంతానము కలుగ వలయు నని కోరి ఆమెను వెంటనిడుకొని బుద్ధగణపతినిఁ బూజించుటకు వడ్డపల్లెకును, ఏకవీరాదేవిని అర్చించుటకు మొగలిచెర్లకునుఁ బోయి అయిదుదినము లచ్చట నుండెను. ఓరుగల్లుసామ్రాజ్యమును ఎప్పుడు కూలఁద్రోయుదమా యని చూచుచున్న హరిహరుఁడును, మురారియు "ఇదే సమయము; మహాదేవరాజు సాయ మక్కఱలేకయే మనము సఫలమనో రథులము కావచ్చును" అని తలఁచి పోయి ఆమెను ముట్టడించిరి.

కాని వారు అనుకొనినట్లు జరుగలేదు. నిప్పులు గ్రక్కుచు వారు ముందునకు నడచిరి; గాని రుద్రమ వారికిఁ జిక్క లేదు. ఆమె యుక్తిచేసి వారిని ఏమరించి హుటాహుటిప్రయాణముతో ఓరుగంటికి వచ్చి చేరుకొనియెను. "తప్పిపోయెరా" యని శత్రువులు తహతహపడుచుండఁగా ఆంధ్రవీరులు వారినిఁ దాఁకిరి. పోరు ప్రారంభ మయ్యెను; గాని తెలుఁగువారి కత్తు

లకుఁ దృష్టి కలుగకపూర్వమే మహారాష్ట్రులు ఓడిపోయిరి. మురారియు, హరిహరుఁడును ఇహలోకమును విడిచిపోయిరి. రుద్రమదేవి వారి యైశ్వర్య మంతయుఁ గొల్లకొట్టించి ఆయ సంతధనముతో పద్మాక్షీదేవికి మహోత్సవములు చేయించెను.

ఇదంతయు నైనతరువాత మహాదేవరాజు మూఁడు లక్షల సైన్యముతో ఓరుగంటిమీఁదికి సావకాశముగా దండెత్తివచ్చెను. ఇది యిట్లు జరుగు నని యెఱింగి యంతకు పూర్వమే రుద్రమదేవి ఓరుగంటిదుర్గము ననేకవిధముల బాగు చేయించి సైన్యమును వృద్ధిచేసి కనిపెట్టుకొనియుండెను.

యుక్తసమయమున ఇరుతెగలవారును దలపడిరి. పదు నైదుదినములు రక్తనదులు ప్రవహించెను. తుదకు దేవగిరి యాదవులు పలాయనము చిత్తగించిరి. రుద్రమదేవి సేన కంత కును నాయకురాలై వారిని తఱిమితఱిమి కొట్టించెను. ఆంధ్ర వీరులు తన రాజధాని యగు దేవగిరిని సమీపించుట గని మహాదేవరాజు భీతుఁడై చేయునదిలేక చేతులు జోడించుకొని రుద్రమదేవిని శరణువేఁడి ఆమె పాదములకడ అపరాధము క్రింద కోటిసువర్ణములు సమర్పించెను. అంతట రుద్రమదేవి ఆతనిని కరుణించి విడిచి ఓరుగంటిసామ్రాజ్యమునకును దేవ గిరిరాజ్యమునకును సరిహద్దున జయస్తంభములు నాటించి శాసనములు వ్రాయించి ఏఁబదిలక్షల హొన్నులను తనసైని కులకు బహుమానముగా నిచ్చెను.

రుద్రమదేవి యింక ననేకశత్రువులను తలయెత్తకుండఁ జేసి తన సామ్రాజ్యమున నేమియు కల్లోలములు పుట్ట కుండ నతిజాగ్రత్తతోఁ బరిపాలించి ప్రజలను కన్నతల్లివలె రక్షించెను. కొంతకాలము జరిగిన తరువాత ఉమ్మక్క గర్భ వతియై తొమ్మిదినెలలు మోసి యొక కుమారునిఁ గనియెను. మహాదేవయ్య సూచన ననుసరించి రుద్రమదేవి యాబాలు నకు ప్రతాపరుద్రదేవుఁడు అని నామకరణము చేసి ఓరుగంటి సామ్రాజ్యమునకుఁ బట్టభద్రునిఁ గావించెను. పిదప కొన్ని దినములకు ఉమ్మక్క మఱియొకకుమారునిఁ గనియెను. ఆతనికి అన్నమదేవుఁడు అని పేరు పెట్టఁబడియెను. రుద్రమదేవియు, మహాదేవయ్యయు బాలకులకు సకలవిద్యలును నేర్పి ప్రజ్ఞా వంతులను గావించిరి. మనుమని పరిపాలనమును గొన్నిదిన ములు చిత్తగించి రుద్రమదేవి శివసాయుజ్య మందెను.

మూఁడు లక్షల శత్రుసైన్యముతో స్వయముగ ఘోర యుద్ధము గావించి విజయమును బడసి పాదాక్రాంతుఁడైన వైరివలన కోటి సువర్ణము లపరాధముగఁ గైకొనిన స్త్రీని ప్రపంచమున కంతకు నొక్క యాంధ్రదేశము మాత్రమే చేయెత్తి చూపినది. తొల్లిటి యాంధ్రదేశము ఇట్టి అనేక స్త్రీరత్నములచే నలంకరింపఁబడి భారతదేశమున కంతకును నాయకమణియై విరాజిల్లినది.



# పద్మావతి.

మహాక్షేత్ర మగు జగన్నాథపట్టణమున అగ్నిహోత్రుఁడను నొక బ్రాహ్మణుఁడు నివసించియుండెను. ఆతఁడు వేదవేదాంగముల నామూలాగ్రముగఁ జదివిన విద్వాంసుఁడు. యాగము లనేకములు గావించిన యాహితాగ్ని. దయాసత్య శౌచములకుఁ దావలము. నిజముగ నాతఁడు "బ్రాహ్మణజాతి కలంకార" మని చెప్పుటకుఁ దగియుండెను. ఆతనికి లేక లేక ఒక్క కొమార్తె గలిగెను. అగ్నిహోత్రుఁడు నాతనిభార్యయు, నాబిడ్డ నతిప్రేమతోఁ బెంచుచు నత్యానందము ననుభవించు చుండిరి. బిడ్డకు పద్మావతి యని ముద్దుపేరు పెట్టిరి.

పద్మావతి అంత చిన్నతనమునఁగూడ తోడి బాలికల వలె కేవలము నాటపాటలతో దిన మెల్లఁ గడుపక తలిదండ్రులు చనవు చూపిన కొలఁదియు, వారు చెప్పిన చొప్పున నడుచుకొనుచు, వారు ఆనందించిన కొలఁదియు సంతోషమును గూర్చుచు నుండెను.

ఆమె యౌవనము ప్రాపించునప్పటికి విద్యావతి గూడ నయ్యెను. బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లు ప్రకాశించు

చున్న కొమార్తెకు తగిన వరునిఁ దెచ్చుటకుఁ దండ్రి ప్రయత్నములు ప్రారంభించెను.

జగన్నాథమున నిట్లుండఁగా, బిల్వా యను గ్రామమున అగ్నిహోత్రునితో సమానుఁడైన నారాయణభట్టు అను విద్వాంసునకు జయదేవుఁ డను కుమారుఁడు పుట్టి పెరుగుచుండెను. ఆతఁడు కారణజన్ముఁడో యనునట్లు బాల్యమునుండియు అద్భుతప్రతిభను ప్రకటించుచు గురువును తలిదండ్రులను, చూచినవారి నందఱను ఆశ్చర్యనిమగ్నులను గావించుచుండెను. పూర్తిగ యౌవనము వచ్చునప్పటికి ఆతఁడు సంగీతసాహిత్యములయందును, కవిత్వమునందును అసమానుఁ డయ్యెను.

అగ్నిహోత్రుఁడు వరాన్వేషణము ప్రారంభించెను; గాని పద్మావతికి తగిన భర్త యాతనికిఁ గాన్పింపలేదు. ఒకమాసము గడచినను సంకల్పము నెఱవేరక యాతఁడు తహతహపడుచుండఁగా దేశసంచారము చేయుబ్రాహ్మణులు "నీకొమార్తెకు జయదేవునికంటె మంచివరుఁడు ఇఁక దొరకఁడు" అని చెప్పిరి. "ఆస్తివిషయమున మేము చెప్పఁజాలము. నీస్థితికి నాతని స్థితికిని చూచి భేదమున్నది. ఆతఁడు వైభవములవిషయమున నీతో తూఁగఁజాలఁడు" అనికూడ వారు చెప్పిరి. అయినను ఆతఁడు బిల్వగ్రామమునకుఁ బోయి చూచి సకలమునకు సంతుష్టుఁడై "ఆస్తి సంగతి యోచింపఁదగినదిగాదు. నేఁడు లక్షాధికారియైయున్నవాఁడు రేపు భిక్షాధికారి కావచ్చును. అట్లే నేఁడు

భిక్షాధికారియై యున్నవాఁడు రేపు లక్షాధికారి కావచ్చును. ఇది యొకఁడు నిర్ణయింపఁజాలని విషయము. ఇంతకును జయదేవుఁడు ఇంత చిఱుతప్రాయమునందే గొప్పయశస్సు నార్జించెను. ఇఁక నాతనికిఁ గావలసిన దేమున్నది?" అని తన మనస్సునకు సమాధానము చెప్పుకొని యీసంగతి భార్యకును కొమార్తెకును జెప్పెను. వారిరువురును గూడ తండ్రినిశ్చయము నంగీకరించిరి. జయదేవుని యశోగానమును పద్మావతిగూడ వినియున్నది; గావున నామె జయదేవుని తనకు భర్తను గావింపుఁ డని దేవతలను ప్రార్థింపఁజొచ్చెను.

యుక్తసమయమున అగ్నిహోత్రుఁడు మఱల బిల్వగ్రామమునకుఁ బోయి తన యభిప్రాయము నెఱింగింపఁగా నారాయణభట్టును ఆతని భార్యయుఁగూడ వెంటనే యంగీకరించిరి. అంతట అగ్నిహోత్రుఁడు ఇంటికి వచ్చి సకలమును సిద్ధపఱిచి యొక శుభముహూర్తమున ఉభయుల ఖర్చులను తానే భరించి వైభవముతో వివాహమును గావించి కూఁతు నత్తవారింటికిఁ బంపెను.

యథార్థమున పద్మావతికి తండ్రియింటఁ జరిగినట్లు అత్తవారియింట జరుగదు. అక్కడ అన్నియు అసంపూర్ణముగనే యుండెను. అయినను ఆమె యేమియు వగవలేదు. జయదేవుఁడు తనభర్త యైనందులకు ఆమె చాల నానందింపసాగెను. అంతటి విద్వాంసుని చెట్టపట్టుట కెంత తపము చేయవలెను!

విద్యావతి యగుటవలన పద్మావతి యీరహస్యమును తెలిసి కొనఁగలిగెను.

జయదేవునకు పురాకృతపుణ్యలేశమున అపారమైన శ్రీకృష్ణభక్తి యలవడెను. అగుట నాతఁ డెప్పుడును శ్రీకృష్ణుని శ్రవణ మనన ధ్యానాదులచేఁ బూజించుచు నానందించు చుండెను. ఆతఁడు గీతగోవింద మను నొక గొప్ప గ్రంథమును సంస్కృతమున రచించెను. సంస్కృతమున ప్రవేశముగలవా రెల్లరు నాతని ప్రతిభను గ్రహించియే యుందురు.

జగద్వ్యాప్తమైన యాతని యశస్సుచే నాకర్షింపఁబడి సమీపగ్రామమున నివసించుచున్న ధనికుఁ డగు వర్తకుఁ డొక్కఁ డొకనాఁడువచ్చి జయదేవుని పాదములమీఁద వ్రాలి "మాగ్రామమునకు దయచేసి మమ్ము ఉద్ధరింపవలసిన" దని ప్రార్థించెను. అమాయిక మగు ఆవర్తకుని ప్రార్థన నాలకించి జయదేవుఁడు భార్యాసహితముగ ఆగ్రామమున కరిగి కొన్ని దినము లచ్చట నివసించి ఆవర్తకునకు ఆతని కుటుంబములోని వారికి ఇంకను గ్రామమునందలి మఱికొందఱకును జ్ఞానోపదేశము గావించి మఱల తన గ్రామమునకుఁ బ్రయాణ మయ్యెను. అప్పుడావర్తకుఁడు విలువగల అనేకవస్తువుల నీయఁ బోయెను; గాని యెంత ప్రార్థించినను జయదేవుఁడు అంగీకరింపలేదు. "నీవు నాకు ఒక్క దమ్మిడి యైన నీయనక్కఱలేదు. దీనులను పోషింపుము. అది భగవంతునకు ప్రీతికర" మని జయ

దేవుఁడు చెప్పెను. ఇక నేమి చేసినను ప్రయోజనము లేదని తెలిసికొని ఆవర్తకుఁడు జయదేవుఁ డెక్కిపోవుటకు నియమించిన బండి కడుగుభాగమున వరాల సంచులను గట్టించి "బిల్వగ్రామము చేరినతరువాత గురువు లెఱుంగకుండ ఈధనమును పద్మావతీదేవిగారికి సమర్పింపుము" అని బండివానికి చెప్పి పంపెను.

అందఱను ఆశీర్వదించి జయదేవుఁడును పద్మావతియు బండియెక్కిరి. గ్రామవాసులు ఊరు దాఁటునంతవఱకు సాగనంపిరి. శిష్యులును మఱి కొంతదూరమువఱకు వచ్చిరి. తుదకందఱును వెనుకకుఁ బోయిన రెండుగడియలకు బండి అరణ్యము ప్రవేశించెను. అందుఁగూడ కొంతదూరము పోయిన తరువాత దొంగలగుంపు ఒకటి వచ్చి బండి నాక్రమించెను. జయదేవుఁడు వారిని జూచి సంగతి యంతయు గ్రహించి "మీకేమియు నభ్యంతరము లేదు. మీసంకల్ప మెట్లో అట్లు చేసికొనవచ్చును" అని చెప్పి భార్యతోఁ గూడ బండిదిగెను. దొంగలనాయకుఁడు ముందునకు వచ్చి "మీవద్ద నున్న దంతయు నిచ్చివేయుఁడు" అని చెప్పెను. జయదేవుఁడు అట్లే చేసెను. పద్మావతి తన యొడలిమీఁది వస్తువు లన్నియు నిచ్చివేసెను. ఇది యిట్లు జరుగుచుండఁగా తక్కిన దొంగలు బండి యంతయు వెదకి బండి యడుగున కట్టఁబడియున్న వరాల మూటలుగూడ విప్పుకొనిరి అంతయు నైన తరువాత దొంగల నాయకుఁడు ముందునకు వచ్చి "ఈతని ధోరణి సందేహ

స్పదముగా నున్నది. ఇప్పు డిట్లు నిర్లిప్తతతోఁ బ్రవర్తించుట చాల అనుమానమునకు తావలముగా నున్నది. ఈతఁ డిప్పుడు మనల నేమియు చేయలేఁడుగదా; మన మీతని నిట్లె వదలి పెట్టితి మేని గ్రామమునకుఁ బోయి మన సంగతి అందఱకును దెలిపి మన నెత్తిమీఁదికిఁ దెచ్చును; గావున ఈతనిని కాలు చేతులు కట్టి పాడునూతిలోఁ బడవేసిరండు" అని చెప్పెను. దొంగలు అట్లే చేసిరి. తమ నాయకుని యాజ్ఞవలన వారు పద్మావతిని బండివానిని యథేచ్ఛగ విడిచి వెడలి పోయిరి.

బండివాఁడు ఎట్లో బ్రతికి స్వస్థలము చేరుకొని సంగతి యంతయు యజమానునకుఁ జెప్పెను. జరిగినదానికి వర్తకుఁ డెంతయు వగచి జయదేవకవిని వెదకి తెచ్చుటకు పదుగురు సేవకులను నియమించెను.

పద్మావతియు జారచోరులను, క్రూరమృగములను ఎట్లో తప్పించుకొని స్వగ్రామము చేరి సంగతి యంతయు బంధువుల కెఱింగించి భర్తనిమిత్తము విచారించుచు పానాహారములను విడిచియుండెను. బంధువులును జరిగినదానికి ఎంతయు వగచి జయదేవునినిమిత్తము కొందఱు బయలుదేఱిరి.

ఇది యిట్లుండఁగా క్రౌంచదేశపురాజు ఆపాడు నూయి యున్న అరణ్యమునకు వేఁటకు వచ్చి మృగములను చెండాడుచు నూతిచెంతకు రాఁగా అందునుండి అద్భుతగానము విన

వచ్చెను. అందుల కాశ్చర్యపడి రాజు దానిని సమీపించి చూడఁగా జయదేవుఁడు గాయములనుండి రక్తము కారు చున్నను లెక్కసేయక భక్త్యావేశమున తాను రచియించిన గీతగోవిందమునందలి కీర్తనలను పాడుచుండెను. రాజు ఇంగి తము నెఱింగి సేవకులు జయదేవుని బైటికిఁ దీసి కట్లు విప్పిరి. రాజు సంగతి యంతయు విని ఆతఁడు జయదేవుఁ డగుట యెఱింగి "మహాత్మా! మీకుఁ దెలియనిది లేదు. గతించిన దానికి వగచుటకంటె ముందుచేయవలసిన పని ప్రారంభించుట మంచిది. అరిషడ్వర్గములను జయించిన తమకు దేహము ఇట్టి స్థితిలో నున్నందులకు వగపు లేకపోవచ్చును; గాని ప్రాణము నిలుచుటకు ఈపాంచభౌతిక దేహము ఆవశ్యకము; గావున దీనిని రక్షించుకొనవలసియున్నది. నాతోఁగూడ నాపురము నకు దయచేయవలయు నని ప్రార్థించుచున్నాను. అక్కడ సంస్థానవైద్యులు తమకు ఉచితచికిత్సలు చేయఁగలరు" అని ప్రార్థించెను. అందులకు కవి "రాజా! నీయాహ్వానమును తిర స్కరించుటకుఁ దగిన కారణము లేమియు లేవు. అయినను నీతో నొకటి చెప్పవలసియున్నది. మదైకజీవిత యగు నాపత్ని యెట్టిస్థితిలో నున్నదో తెలియదు. ఆమె బ్రతికియున్నచో వెదకి తెప్పింపఁగలవా? బ్రతికియున్నదో లేదో గూడ విచా రణ చేయవలసియున్నది. ఇందులకు నీవు పూనుకొందువా? నాకు నాశరీరమునకు చికిత్స చేయించుటకంటె నాభార్యను వెదకుట ముఖ్యకార్యము. అట్లు చేసెదవేని నేను నీపురము

నకు వచ్చెదను. లేకున్న ఈకుంభీపాకనరకమునుండి నన్నుద్ధరించితివి; గావున నాయాశీర్వచనములను బడసి నాదారిని నన్ను బోనిమ్ము. నీమేలు నెప్పటికిని మఱువను. నాభార్య కనఁబడినచో తరువాత నేను తప్పక నీపురమునకు వచ్చి నీదర్శనము చేసెదను" అని బదులు చెప్పెను. దానిమీఁద రాజు తమ సెలవు ప్రకారము చేసెద నని మాట యీయఁగా కవి రాజుతోఁ గూడ క్రౌంచనగరమునకుఁ బోయెను.

రాజాజ్ఞవలన ఆస్థానవైద్యులు కవికి రాజోచితచికిత్సలు ప్రారంభించిరి. ఆచూకీ తీయుటలో నిపుణులైన యుద్యోగులు పద్మావతిని వెదకుటకు బయలుదేఱిరి.

అట వైద్యులు కవికి ఆరోగ్యస్నానము చేయించునప్పటికి ఇట రాజోద్యోగులు జగన్నాథమున పద్మావతినిఁ జూచిరి. వారు ఆమెకు సంగతి యంతయు నెఱిఁగించి పాలకి నెక్కించి పద్మావతిని క్రౌంచనగరమునకుఁ గొనిపోయిరి.

పద్మావతియు జయదేవుఁడును ఒకరి నొకరు చూచుకొనిన వెంటనే కౌఁగిలించుకొని జరిగిపోయిన దంతయుఁ దలఁచికొని కొంతసేపు వగచి పిదప నిట్లు శుభసమావేశము కలిగినందులకు ఆనందించి సర్వేశ్వరునకు నమస్కారము లర్పించి రాజును వినుతించిరి.

రాజును, రాణియుఁగూడ జయదేవుని పద్మావతిని చాల నాదరముతోఁ జూచుచుండిరి. ఒకనాఁడు పద్మావతి రాణికి ధర్మో

పదేశము గావించుచుండఁగా నొక దాసి వచ్చి రాజబంధువు లలో నొక యువకుఁడు చనిపోయె ననియు, పతివ్రతయైన యాతని భార్య సహగమనము చేయనున్న దనియుఁ జెప్పెను. అది విని యచట నున్నవా రందఱును ఆయువతి పాతివ్రత్య మును మిగులఁ గొనియాడిరి; గాని పద్మావతి యామాటలను, ఆపొగడ్తలను వినియు విననట్లు ఊరకుండెను. అందులకు ఆశ్చ ర్యచకితయై "పతివ్రతయైన యాయువతిని గుఱించి మేమంద ఱము నిట్లు అనేకవిధముల వినుతించుచుండఁగా మీరేమియు మాట్లాడుట లేదేమి? ఈవార్తనే వినినట్లు లేదేమి?" యని ప్రశ్నించెను. అందులకు పద్మావతి మందహాసము గావించెను. అది చూచి రాణి అసంతృప్త యగుచుండఁగా పద్మావతి బొమలు ముడిచి "చెప్పుట కేమున్నది? లోకములో ననేక విధము లయిన వ్యక్తు లున్నవి. ఒక వ్యక్తి సంతోషించిన ఒక వ్యక్తి విచారించును. మఱియొక వ్యక్తి తటస్థముగ నుండును. ఇందులకు కారణ మేమని యెవరికిని అడుగవలసిన పని లేదు. ఇంతకును సహగమనము చేయఁబోవుచున్న ఆయువతి సుశీల యని మీరు చెప్పినచో నాకేమియు నభ్యంతరము లేదు. మఱియెందులకు పొగడలే దందువా? ఆమె పతివ్రతల కెల్ల నాయకమణియే యగునేని పతిమరణవార్త వినినంతనే భూ పతితయై ప్రాణములు విడిచియుండును. ఇట్లు పతి చితిచెంతకు స్వయముగ నడచిపోఁగలుగుచున్న ఆమెను గుఱించి వినుతులు చేయవలసినంత కారణము నాకు ఏమియుఁ గనపడలేదు" అని

పలికెను. ఇది విని కొందఱు బాగుగ నున్న దనుకొనిరి. కొందఱు "ఈమె యెంత గర్విష్ఠురాలు" అనుకొనిరి. రాణిగారి యాంతరంగికల మని ఒడలు విఱుచుకొని తిరుగు కొందఱు సన్నిహితలు "రాణిప్రశ్నకుఁ దగిన జవాబు గాదు. ఆమాటలలో చాల గర్వమున్నది" అని పలికిరి; గాని రాణియు పద్మావతియుఁగూడ నేమియు మాట్లాడలేదు. ఇరువురు నొకరొకరిముఖము నొకరు చూచుకొని ఇతరవిషయములను గుఱించి ప్రస్తావము ప్రారంభించిరి.

అయితే పద్మావతియెడల రాణికి భక్తి పోయిన దని స్పష్టముగాఁ జెప్పుటకు వీలు లేదు; గాని ఆమెను పరీక్షింపవలయునని సంకల్పము మాత్రము గలిగెను. ఆసంకల్పము నెఱవేర్చుకొనుట కామె సమయము నిరీక్షింపసాగెను.

కొన్నిదినములు గడచిపోయిన తరువాత రాజు మఱల వేటకు బయలుదేఱెను. జయదేవుఁడు గూడ వేఁటకు వెడలెను. ఇదియే సమయ మని రాణి దాసీలతో మంతనమాడి యథాపూర్వముగ వచ్చి పద్మావతితో మాటలాడుచుండెను.

అప్పుడొకదాసి వగచుచు వచ్చి "అమ్మా, ఏమి చెప్పుదును. రాజుగారితోఁగూడ వేటనిమిత్త మరణ్యమునకుఁ బోయిన కవిగారు పెద్దపులి వాతఁబడి పరలోకమునకుఁ బోయిరట" అని చెప్పెను. ఇది వినినతోడనే పద్మావతి "హా, నాథా," యని భూమిమీఁదఁ బడిపోయెను.

ముందు దాసీలు పరీక్షించిరి. పిదప రాణిగూడ పరీక్షించెను. ఎంతసేపు చూచినను పద్మావతి మఱల లేచు సూచనలు కాన్పింపలేదు. సంస్థానవైద్యులు వచ్చి "ఆశ లేదు" అని చెప్పిరి.

రాణికడుపులో రాయి పడెను. ఎంత యాపత్తు! "ఒకటి తలపఁగా నొకటి యైనది. ఇంతటి పతివ్రతాశిరోమణి గనుక నే నాఁడట్లు సంకోచము లేక పలికినది. కట్టా! నేనెంత దుర్మార్గురాలను. నేను చేసిన మోసము బయల్పడకమానదు. లోకములో నేనిఁక నెట్లు బ్రతుకుదును" అని రాణి యనేకవిధముల వగవఁజొచ్చెను. దాసీసుందరులుగూడ నోట మాటలేక బొమ్మలవలె నిలిచిపోయిరి.

ఇంతలో రాజు వచ్చెను. పద్మావతి మరణవార్తను విని జయదేవుఁడు ఖిన్నుఁడై వచ్చి యామెచెంతఁ గూర్చుండి వగవసాగెను. రాజు అనేకవిధముల నూరడించెను; గాని ప్రయోజనము కలుగలేదు. కవి యిట్లు కొంతతడవు వగచి "రాజా, నాచైతన్యము పోయినది. నేనిఁక చేయవలసిన దేమున్నది? నా ప్రియురాలికి నేను రచించిన గీతగోవింద మనిన చాల ప్రీతి. ఈమె బ్రతికి మఱల నేను పాడుచుండఁగా దానిని వినుట యెట్లును లేదు. ఈమె స్వయముగఁ బాడుటఁ గూడ నిఁక నసంభవమే. అయినను ఈమెకళేబరమువద్ద నైన నొకమాఱు పాడి నేను మనస్సునకు సమాధానము చెప్పు

కొనెదను. నావీణియను ఒక మాఱు తెప్పింపుము" అని చెప్పెను.

చూచుచుండఁగనే రాజభటులు పోయి వీణెను దెచ్చి యిచ్చిరి. జయదేవుఁడు దానిని అందుకొని సవరించి గొంతెత్తి పాడఁ దొడఁగెను. ఇరువదియైదవ యష్టపది ముగియునప్పటికి పద్మావతిముఖమున జీవకళ యంకురించెను. కొంతసేపటి కామె కదలెను. మఱి పదినిముసము లగునప్పటికి ఆమె కన్నులు దెఱచి చూచి లేచి పతిపాదములమీఁద వ్రాలి బాష్పధారలతో పాదములు కడిగెను. జయదేవుఁ డామె నాదరముతో లేవనెత్తి ఈశ్వరుని వినుతించెను. ఉన్నవా రందఱును ఆశ్చర్యచకితులై యుండఁగా రాణి ఆదంపతుల పాదములమీఁద వ్రాలి జరిగిన దంతయు నెఱింగించి రక్షింపఁ బ్రార్థించెను. రాజు మిగుల సిగ్గు పడుచుండఁగా ఆదంపతులు రాణికి ధైర్యము గొల్పి రాజు నూరడించిరి.

పిదపఁ గొన్నిదినము లక్కడనుండి ఆదంపతులు కాశికిఁ బోయిరి. అక్కడ ననేకులు స్త్రీలును పురుషులును గూడ వారి నాశ్రయించి ధర్మసూక్ష్మములను దెలిసికొని తర ణోపాయమును గాంచిరి.

కొన్ని మాసములు కాశిలోఁ గడపి జయదేవుఁడును పద్మావతియు స్వస్థలము చేరికొని అనేకులను సన్మార్గమునకుఁ ద్రిప్పి బ్రతికి యున్నంతకాలము శ్రీకృష్ణునిఁ బూజించి పిదప సాయుజ్యముక్తినిఁ బడసిరి.

# లక్ష్మమ్మాణి.

మైసూరు రాజగు ఇమాది కృష్ణరాజవొాడయరున కీమె మూఁడవ రాణి. ఈమె కట్టిగోపాలరాజు ఉర్సుకొమార్తె. ఆతఁడు మైసూరుమహారాజువద్ద నొకసేనానాయకుఁడై యుండెను.

ఇమాదికృష్ణరాజవొాడయరునిఁ బెంచుకొనిన నందరాజు వద్ద హైదరు అను నొక తురుష్కుఁడు ముఖ్యాంతరంగికుఁడై యుండెను. హైదరు రాజున కిష్టముగా మసలుకొనుచునే యారాజ్యము నెట్లయిన హరింపవలయునని నిశ్చయించుకొని ఉపాయములను వెదకుచుండెను.

నందరాజు చనిపోవునపుడు "హైదరు నెట్టి యధికార మునందును నిలుపవల దని చెప్పిపోయెను. రాణి యగుజమ్మాన్ని గూడ అట్లే తలంచుచుండెను; గాని ప్రయోజనము గలుగ లేదు. హైదరు ఒకదినముకంటె నొకదినము తన బుద్ధిచాతు ర్యమువలన భృత్యవర్గమును వశపఱచుకొనుచుండెను. భర్త యనంతరము జమ్మాన్ని ఇమాదికృష్ణరాజవొాడయరునిఁ బెంచు కొని యాతనిపేర తాను రాజ్యము చేయుటకుఁ బ్రయ త్నించెను. ఈయత్నములో నామె హైదరున కాంతరంగికుఁ

డగు ఖండేరావు అను మహారాష్ట్రసరదారుని లోపుచేసికొని యాలోచనలు ప్రారంభించెను; గాని ఈసంగతి యెట్లో తెలిసి కొని హైదరు ఖండేరావును నిజగృహమున బంధించివేసెను. ఇమాదికృష్ణరాజు పేరునకు మాత్రము మైసూరుమహా రాజుగా నుండెను; గాని యధికారమంతయు హైదరుచేతిలో నుండెను.

కొన్ని దినములు గడచినతరువాత కృష్ణరాజు ఆకస్మిక ముగా మృతి చెందెను. ఆతనికి నందరాజు చామరాజు నని యిరువురు పుత్రు లుండిరి. తండ్రి మరణానంతరము యథార్థ మున మైసూరు ప్రభు వగు నందరాజు తన రాజ్యమును యథే చ్ఛగఁ బాలించుకొను నధికారము నిమిత్తము మరాటా సర దారుఁ డగు త్ర్యంబకరావుతో సకలసన్నాహములును గావింప సాగెను; గాని యచిరకాలమునందే యీసంగతి యెట్లో గ్రహించి హైదరు నందరాజును శూలముపయి నెక్కించి చంపించెను. చామరాజుగూడ పిదప కొన్ని దినములకు హైదరు భృత్యులవలననే చంపఁబడియెను ఇట్లు మైసూరు సింహాసన మధిష్ఠించుట కధికారు లగువారు తనచాతుర్యమున మృత్యువుపాలగుటవలన అడ్డులేక హైదరు 'ఇఁక సింహాసన మధిష్ఠించుట కెంతో వ్యవధి లేదు' అని యానందించు చుండెను.

పతిమృతివలనను, పుత్రుల మరణమువలనను క్రుంగి పోయియున్న లక్ష్మాణ్ణి కొన్ని మాసము లట్లే యుండి

పోయెను. ఇట్లుండఁగా నొకనాఁ డామె హృదయమున నవీనతేజ మంకురించెను. "ప్రాచీన మగు నీహిందూరాజ్యము ఒక యవనునిపాలఁ బడవలసినదేనా?" యని యామెకు ప్రశ్న కలిగెను. ఇది కలుగుటయే తడవుగ నామె శరీరము కంపించిపోయెను. "ఇట్టిది సంభవించినచో నిఁక నేను బ్రతికియుండు టెందులకు?" అని యామె నిశ్చయించుకొనియెను.

ఎట్లును హైదరుతో విరోధపడకతప్పదు. అయిన నింతవఱకును రాజకార్యప్రస్తావము నెఱుఁగని రాణి విరోధము నడుపువిధానము నెఱుఁగదు. ఎప్పు డెట్లు ప్రవర్తింపవలయునో వ్యవహారమునఁ బ్రవేశించి నేర్చుకొనవలసినదే.

తొలుత నామె దత్తపుత్రుని స్వీకరించి యాతని పేర తాను రాజ్యము చేయఁదలఁచెను. అందులకు ఆమె తన సోదరీపుత్త్రుఁ డగు మాడూరు నరసరాజుగాని మనుమఁ డగు సిద్ధరాజుగాని యర్హు లని నిశ్చయించుకొని యీసంగతి హైదరునకుఁ దెలిపెను. ఇంతవఱకు నంతఃపురమును విడిచి బైటకు రాని దైనను రాణి మిగుల తేజస్వంతురా లని హైదరు విని యుండుటచే ఆమెకు ప్రత్యక్షముగా నిప్పుడే విరోధపడుట తన యభ్యుదయమునకు మంచిది గాదని గ్రహించి "దత్తుని నిర్ణయించుటలో మీరే ప్రయాసపడ నేల?" అని చెప్పి కొందఱు బాలకులను రావించి యొకచో పూవులు, పుస్తకములు, ఖడ్గములు నుంచి "మీయిష్టమువచ్చినవి తీసికొనుఁడు" అని

చెప్పెను. అందఱు బాలకులలో ఆర్కోటరాధిపుఁడగు దేవ రాజుకుమారుఁడు చామరాజుమాత్రము ఒక కత్తిని, ఒక అద్దమును దీసికొనియెను. తక్కినబాలకులు, పుస్తకములు, పూవులు, మిఠాయి మున్నగునవి తీసికొనిరి. అంతట హైదరు "ఇతఁడే తగినవాఁడు" అని చెప్పి చామరాజును రాణికి దత్తునిగా నేర్పఱిచి పేరునకుమాత్ర మాకుఱ్ఱవానిని సింహాసన మెక్కించి తక్కిన వ్యవహారమంతయు దానే నిరంకుశముగ నడుపఁజొచ్చెను.

"కోటను బొక్కసమును స్వాధీనమున నుంచుకొని యున్న హైదరును ఓడించుట సామాన్యమైనది గాదు. ఇది నాయొక్కతవలనఁ గాదు" అని యోచించి రాణి ఇతరరాజులతో రాయబారములు నడుపసాగెను. అప్పుడు చెన్నపట్టణమున ఇంగ్లీషువారు ప్రబలులై యుండిరి. వారికి లార్డుపింగాటు అనునతఁడు గవర్నరుగా నుండెను. రాణి ఆతనివద్దకు తిరుమలరావు అను నొక వకీలును రాయబారిగాఁ బంపెను. రాణి యప్పుడు రెండుత్తరములు వ్రాసెను ఒకటి ఇంగ్లీషుగవర్నరునకు. అందు ఆమె తిరుమలరావు తనకు ముఖ్యుఁడనియు అతఁడేమి చేసినను దాని కామె కంగీకారమే యనియు వ్రాసెను. రెండవది తిరుమలరావునకు. అందు ఆమె "నీవు మాతరఫున సర్వము క్యారు పని పింగాటుదొరకు వ్రాసినాము. వారితో మాట్లాడి నీవు వ్యవహారము నెట్లో చక్కబెట్టవలెను. ఈసాహాయ్యము చేసినచో ఇంగ్లీషువారికి మేము సైన్యపు ఖర్చునిమిత్తము

కోటిరూపాయలును, దర్బారు వ్యయముల నిమిత్తము మూఁడు లక్షలును, ఇచ్చుటకు సిద్ధముగా నున్నాము. ఈకార్యమును చక్కబెట్టినచో నీకు మారాజ్యాదాయములో నూటికి పది రూపాయలవంతున బహుమతి చేసి నీవు బ్రతికియున్నంతకాల మును గొప్పగా సన్మానించెదము. వంశపారంపర్యముగ దివాౝ గిరీ నీకు ఇచ్చెదము" అని వ్రాసెను.

తిరుమలరావు చెన్నపట్టణమునకు వెళ్లి వ్యవహారము మాట్లాడఁజొచ్చెను; గాని యింతలో కంపెనీవారికి పింగాటు మీఁద కోపమువచ్చెను. పింగాటు అప్పు డేమిచేయుటకును గాకుండెను. ఈసందర్భమున మ్యాకర్టౝ అను నతఁడు గవర్న రయ్యెను. తిరుమలరావు మ్యాకర్టౝతో మఱల రాయబారము ప్రారంభించెను.

రాణికంటె ముందుగనే మ్యాకర్టౝ హైదరును నాశ నము చేయుచుండెను. అయినను అంతబలవంతునితో ప్రత్యే కముగ పోరాడి గెలుచుట దుర్ఘట మని యాతఁడు సందే హించుచుండెను. ఈస్థితిలో రాణి రాయబార మంపెను. రాణి చాల సమర్థురాలు అని యాతఁ డదివఱకే వినియుండెను. "ఈమె తోడ్పాటు ఉండిన హైదరు కూలుట నిముసము" అని యాతఁడు తలఁచి ఈవ్యవహారము పరిష్కారము చేయవలసిన దని తంజావూరుసంస్థానమునకు రెసిడెంటుగా నున్న సలివౝ అను ఉద్యోగిని నియమించెను.

సలివను వారయు, తిరుమలరావును సకలమును చాల సమర్థతతోఁ జర్చించి వ్యవహారమును గుదిర్చిరి. సంవత్సరమునకు ౭౫ లక్షల రూపాయలు కప్పమును, సాహాయ్యమైన వెంటనే ౧౫ లక్షల యాదాయము గల దేశమును ఇచ్చుటకు రాణి యంగీకరించెను. అప్పుడు మ్యాకర్ట్నీ దొరయు, రాణియు అంగీకరించి ఈధృవపత్రమును స్థిరపఱచిరి.

ఇంగ్లీషువారి సైన్యము హైదరుమీఁద దండెత్తిన వెంటనే రాణిపక్షమువారందఱును వానిమీఁద తిరుగఁబడవలయు ననియు, గ్రామములోని పోలీసువారు ఈరాణిపక్షము వారికి అవలంబముగ నుండవలయు ననియు ఏర్పాటు అయ్యెను. "శామయ్య అను శూరుఁడగు సరదారు మనపక్షమున నున్నాఁడు గావున ఇంగ్లీషువారి సైన్యములను గజలహట్టీ కావేరీపురములమీఁదుగాఁ బంపవలసిన దని రాణి తిరుమలరావునకు వ్రాసెను.

ఇట్లు సకలప్రయత్నములును చాల చురుకుగా జరిగి పోవుచుండఁగా రాజద్రోహి యగు నొక సేవకుఁడు ఈసంగతి యంతయు హైదరునకుఁ దెలిపెను. అంత నాతఁడు తోఁక త్రొక్కిన త్రాఁచువలె మండిపడి రాణిపక్షమువారిలో దొరకినంతమందిని కైదుచేసెను. వారిలో కొందఱను చంపించెను. రాణికిఁ గూడ చెప్పరాని కష్టములు కలిగించెను. ఆసంగతులను రాణి తిరుమలరావునకు వ్రాసిన జాబువలన తెలియఁగలవు.

*"మేము మాదీనావస్థను గుఱించి పలుమారు మీా కిది వఱకే తెలిపియున్నాము. మీారు మైసూరువిడిచి యిప్పటి కిరువది రెండు సంవత్సరములు కావచ్చినది. మేము ప్రతిదినమును ఈ యవనరాక్షసుఁడు (హైదరు కుమారుఁడైన టిప్పు) పెట్టెడి యనేకవిధములయిన బాధల ననుభవించుచునే యున్నాము వాఁడు మమ్ము నంతకంత కధికదుఃఖమున ముంపుచున్నాఁడు. వాఁడు స్ఫోటకపురుషు చెప్పి చామరాజు వొడయరును గుప్తముగాఁ జంపెను. మాకు శరీరమును కప్పుకొనుట కొకవస్త్రమయిన లేకుండ బాధపెట్టుచున్నాఁడు. మమ్ము రాజమందిరమందుండనీయక యచటనుండి వెడలఁగొట్టెను. మే మచటనుండి వచ్చునపుడు అచటనుండు కావలివారు మమ్ము పరీక్షించి చూచి యవమానించిరి. వారు మా దేహములయం దుండిన నగల నన్నిటిని దీసికొని మాకు కట్టుకొనుటకు ముతకవస్త్రము లిచ్చిరి. మాకు కాంతిరావుగారి ప్రాతగృహమున నొక వైపున నుండ స్థల మిచ్చిరి. మాచుట్టును ఘారా యుంచినారు. మాదాసీజను లందఱిలో మాకుఁ బండ్రెండుగుర నిచ్చి తక్కినవారిలోఁ గొందఱిని మహమ్మదీయమతస్థులుగాఁ జేసి వారి కతినికృష్టములయినపనులను చెప్పిరి. మఱికొందఱిని అతిదూష్యమగు వేశ్యావృత్తి నవలంబింపఁజేసిరి. మిగిలినవారిచే శౌచకూపములను గడిగించుచున్నారు. నిత్యమును మాకు బిచ్చగాండ్ర కిచ్చుబత్యె మీాయఁబడును. మేము కుండలలో వండుకొని పర్ణపుటముల(విస్తరా

---

*అబలాసచ్చరిత్రరత్నమాలనుండి.

కుల్ములో భోజనము చేయుచుందుము. టిప్పు త్వరలోనే మమ్ము జంపుటకయి ప్రతిజ్ఞ చేసెనఁట. వాఁడెప్పుడు మాప్రాణములు గొనునో తెలియదు. మాకు మేలు సేయఁగోరి మీరు అనేక విధము లయిన సంకటముల ననుభవించితిరి. మాకొఱకు మీ రింగ్లీషువారితో స్నేహము చేయనెంచి జాఁసలివర్ గారి తోడను, ఇతరయింగ్లీషు పరదార్లతోడను ప్రసంగించి వారు మాకు సహాయు లగునటులు చేసితిరి. ఇదియుఁగాక, మా కొఱకు మీమిత్రులను మీబంధువులను ఈమానవరాక్షసున కర్పింపవలసినవారయితిరి. ఇట్లు మీ కనేకనష్టములు కలుగుట తలఁచికొనిన నాగుండె యదరిపోవుచున్నది. ఇంత నష్టమై నను మన ప్రయత్నము కొనసాగి మారాజ్యమునకు స్వాతంత్ర్యము కలుగనందున నధికసంతాపముగా నున్నది. ఇక త్వర లోనే మానాశ మగుననుటకు సందియము లేదు. టిప్పు వద్దకు ఇప్పు డొక ఫ్రెంచివకీలు, వచ్చియున్నాఁడు. మమ్ము చంప కుండిన త్వరలోనే టిప్పునకు నాశము కలుగునని వాఁడు బోధించెనఁట. అందుపై నన్ను శీఘ్రముగాఁ జంప యత్నించిరఁట. టిప్పునకు ఫ్రెంచివారికి జరిగిన సంధినక లిందుతో పంపినాను. మీరది యింగ్లీషుగవర్నరుజనరలుగారికిఁ జూపవలెను. ఫ్రెంచివారిందు ప్రవేశించుటకుఁ బూర్వమే యింగ్లీషువారు తమసైన్యము నిందుఁ బంపి యీాయవనరాక్షసు నడఁచనియెడల కంపెనీ వారి రాజ్యమునకే మిగుల ముప్పు కలుగఁగలదు. అప్పు డందఱ ప్రాణములకును మోసము రాఁగలదు. ఇదివఱకు

రెండుమూఁడుసారులు జరిగినటుల మరల ఇంగ్లీషువారు విలం బము చేసినయెడల ఫ్రెంచివారు టిప్పుతోఁ గలిసి భయంకర మైన యగ్నియు ప్రచండమారుతమును గూడినటు లయి సకల దేశములను బాడుచేసి ప్రజాసంహార మొనరింతురు. ఇంగ్లీషు గవర్నరునకు మావిజ్ఞాపనమును గూర్చియుఁ మాప్రాణరక్షణ మును గూర్చియు చింత లేకుండిన కంపెనీవారి రాజ్యమును రక్షించుకొనుట కయినను సైన్యము నతిత్వరితముగా నిందుఁ బంపవలయు నని నీవు అతనితోఁ జెప్పుము. అంతవఱ కెట్లయి నను మేము మాప్రాణములను రక్షించుకొనెదము."

"రాజ్యము మాకు లభించినపక్షమున హూణులకు ఒక కోటిరూపాయ లీయఁగలము. వారు సలివర్ దొరగారితో నైన కరారునామా చెల్లింపవలయును. సలివర్ మొదలగు సర దార్ల కందఱకు నగ్రహారము లిచ్చెదము. ఈయవనరాక్షసుఁ డతిక్రూరుఁడయినందున ప్రజల కధికబాధ గలుగుచున్నది అందువలన సేనలోని సైనికు లందఱును వానికి విరుద్ధముగా నున్నారు. ఇట్టి సమయమున నింగ్లీషుసైన్యమునకు నిచ్చటి సైనికు లధికసాహాయ్యము చేయఁగలరు. ఇచట నున్నవా రందఱును వాని నాశమునే కోరుచున్నారు. ఇంగ్లీషుసైన్య మేవంక వచ్చినను వారి భోజనాదులకు కావలసినంత సామగ్రి యేమియు నాటంకము లేక దొరకును. కాన మీసామర్థ్యము నంతను వ్యయపఱచి యుద్ధప్రయత్నములను జేసినయెడల శ్రీరంగనాథుఁడు తప్పక మీకు సహాయుఁ డౌనని నమ్మెదను."

పిదప అచిరకాలమునందే ఆంగ్లేయులు పూనా పేష్వాలను హైదరాబాదు నైజామును గూర్చుకొని వచ్చి టిప్పును ముట్టడించిరి. ఆయుద్ధముయొక్క వివరము లన్నియు నిచ్చటఁ జూపుటకు స్థలము చాలదు. ఆ యుద్ధమున టిప్పు మరణించెను. ఆతనిపక్ష మంతయు చెల్లాచెదరై పోయెను.

ఈతీరున మహారాణి లక్ష్మమ్మాణ్ణి మైసూరురాజ్యమునకు విజయమును చేకూర్చెను. ఆమె యింగ్లీషువారికి చేసినవాగ్దానముల నన్నిటినిఁ జెల్లించివేసెను. ఈయుద్ధమున అనంతసాహాయ్యము చేసినందులకు ఇంగ్లీషువారు రాణియెడల చాల వినయవిధేయతలను జూపుచు ఆమెసామర్థ్యమును గొనియాడఁగడఁగిరి. రాణికి పూర్ణయ్య యను మంత్రి సకలవిధములను చేదోడువాదోడుగ నుండి ఈకార్యమంతయు గట్టెక్కించెను. ఆమె కృష్ణరాజువొడయ రను బాలకుని రాజ్యాధిపతిగా నియమించెను.

లక్ష్మమ్మాణ్ణి తిరుమలరావునకు చేసిన వాగ్దానము లన్నియు అన్నదానికంటె నధికముగాఁ జెల్లించెను; గాని దివాన్ గిరీమాత్ర మాతని కిచ్చుటకు వీలుపడినది గాదు. అందులకు వగచి యామె యాతనిని మఱియొకవిధమున సంతోషపెట్టెను.

లక్ష్మమ్మాణ్ణి యెనుబదిసంవత్సరములు జీవించెను. ఈమె జీవితమధ్యమునఁ బడిన కష్టములు వర్ణింప శక్యము కానివైనను తుదకు సంభవించిన విజయమువలన అవి యన్నియు విస్మృ

తము లయ్యెను. ఈమె వివేకమును, సామర్థ్యమును అనేకచరిత్ర కారులు అభివర్ణించియున్నారు. రూపుమాసి పోనున్న యొక్క హిందూరాజ్యము నొకస్త్రీ నిలువఁబెట్టినది. తలఁచుకొనినచో ఇఁక పురుషులు ఎంత చేయలేరు?

మైసూరురాజ్యమున ఈమెను ఇప్పటికిని ప్రజలు "మాతుశ్రీలక్ష్మమ్మాణ్ణి" అని స్మరించెదరు.

---

# ఖ నా.

ఖనాతలిదండ్రు లెవరో తెలియదు. ఆమె ననార్యులు పెంచిరి. వారే యామెకు జ్యోతిశ్శాస్త్రమున నఖండజ్ఞానము గలిగించిరి. ఆగ్రామమునందే మిహిరుఁడు అను బ్రాహ్మణబాలుఁ డొకఁడు మఱియొక అనార్యకుటుంబమునఁ బెరుగుచుండెను. అతఁడు ఈపెంపుడుతండ్రివలన జ్యోతిశ్శాస్త్రమున అపార పాండిత్యమును సంపాదించెను.

కొంతకాల మైన తరువాత—ఈయిరువురును యుక్త వయస్కులైన పిదప పాలకులు ఖనాను మిహిరునకు యిచ్చి వివాహము గావించిరి. ఉభయులు నేకవిద్యయం దపారపాండితి గలవా రగుటచే చిత్తవృత్తుల కైక్యము సంఘటిల్లి, చాల నను రాగముతోఁ బ్రవర్తించుచుండిరి.

మిహిరుని గుఱించి యొక చిన్న కథ యున్నది. విక్ర మాదిత్యుని సభలోని నవరత్నములలో వరాహమిహిరుఁ డొకఁడు గదా! ఆతనికి ఒకకుమారుఁడు పుట్టెను. ఆకుమారుఁడే మిహిరుఁడు. వరాహమిహిరుఁడు మిహిరుని జాతకము వ్రాసెను. ఆవ్రాయుటలో నేదో పొరబాటు వచ్చుటచే ౧౦౦ సంవ త్సరములకు బదులు ౧౦ సంవత్సరములే యాయుర్దాయము

వచ్చెను. "ఆయుర్హీనుఁడగు వీనిని పెంపఁ బోడఁగినచో ఆనంద సమయమున చనిపోవును; గాన ఇప్పుడే వీని నెందయిన విడిచి నచో ఒకటే దుఃఖ మగును; అని భావించి వరాహమిహిరుఁడు ఒక చిన్న దోనెలో బాలుని ఉంచి నదిలో విడిచెను. ఆ బాలుఁడు మిహిరుఁడు ఒక అనార్యునకు దొరకి వానివలనఁ బెంపఁ బడెను. ఈ కథ యథార్థ మని మేము చెప్పఁజాలము.

ఇట్లు కొంత కాలము గడచిన పిదప ఖనాకును, మిహిరునకును గూడ ఆర్యులలోనికి వెళ్లవలయునని బుద్ధి పుట్టెను. తుదకు ఉభయులునుగూడ తమ్ము పెంచినవారిని అడిగి వారి సెలవుబడసి బయలుదేఱిరి. అపుడు వారిని పెంచిన అనార్యులిర్వురును వారివెంట నొక పనికత్తె నంపి దానిచేతికి కొన్ని జ్యోతిషగ్రంథముల నిచ్చి "మార్గమధ్యమున వారి జ్యోతిశ్శాస్త్రపాండిత్యమును పరీక్షింపుము. వారు ఆశాస్త్రమున గొప్ప పండితులేని ఈగ్రంథములను వెనుకకుఁ గొనిరమ్ము. లేకున్న వారి కిచ్చి రమ్ము" అని చెప్పిరి.

ఆదాసి తమప్రభువులు చెప్పినట్లే చేసెను. వారు కొంత దూరము వచ్చునప్పటికి చేనిలో నొక యావు ఈనుటకు సిద్ధముగా నుండెను. "ఈయావునకుఁ బుట్టు దూడ ఎఱ్ఱగా నుండునా? తెల్లగా నుండునా?" యని దాసి యడుగగా మిహిరుఁడు లెక్కవేసి చూచి తెల్లగా నుండు నని చెప్పెను. ఈవిషయమును దెల్సుకొనుటకు కొంతతడవు వారక్కడ నిలిచిపోయిరి; గాని

యావు తెల్లనిదూడనుకనుటకు మాఱుగా నెఱ్ఱని దూడ నీనెను. వెంటనే దాసి యాగ్రంథముల నన్నిటిని వారి కిచ్చివేసి తన మార్గమునఁ బోయెను. చాలకాలము కష్టపడి చదువుకొని స్వాధీనము చేసికొనిన శాస్త్రము నేఁ డిట్లు తేలిపోవుట చూచి "అసంస్కృతహృదయుఁడ నగు నాకు ఈగ్రంథములవలన మాత్ర మేమి ప్రయోజనము?" అని తలఁచి మిహిరుఁ డాగ్రంథములను ఏటిలోఁ బడవేసెను. "అయ్యో" అని ఖనా వెంటనే నదిలో నుఱికెను; గానియామెకు రెండుగ్రంథములు మాత్రమే దొరకెను. తక్కిన వన్నియుఁ బ్రవాహవేగమునఁ గొట్టుకొనిపోయెను.

పిదప వారు మఱల బయలుదేఱిరి. కొంతదూరము పోవునప్పటికి ఒకయూరు కాన్పించెను. అందు వేఁటకు వచ్చిన విక్రమార్కుఁడు విడిసియుండెను. మిహిరుఁ డాసంగతి విని దర్శనము చేసి తనప్రజ్ఞను జూపఁగా రాజు ఆతనిని దన యాస్థాన పండితునిగాఁ జేర్చుకొని వెంటఁగొనిపోయి "వీరిని జాగ్రత్తగాఁ జూడు" మని వరాహమిహిరున కప్పగించెను.

తాను నేర్చిన విద్యయందే వారు పండితు లగుటవలన వరాహమిహిరుఁడు మాటిమాటికిని బరీక్షించి వారి శక్తినిఁ దెలిసికొనియెను. "చిన్నలము; గాన సందేహములనుఁ దీర్ప వలయు" నని చెప్పుచు కఠినప్రశ్నలను వేసి ఆదంపతులు వరాహమిహిరుని పాండిత్యమునుఁ దెలిసికొనిరి. ఒకరి శక్తి యొక

రికిఁ దెలియవచ్చెను. ఈసంభాషణమున వరాహుఁడు మిహి రుఁడు తన కుమారుఁడే యని తెలిసికొని ఆసంగతి యంతయు నాతనికిఁ జెప్పి, ఇఁక కాన్పింపఁ డనుకొనిన కుమారుఁడు ఇంత శక్తిని సంపాదించి తనయంతవాఁడై మఱల తన యింటికి వచ్చినందులకు చాల నానందించెను. మిహిరుఁడు తండ్రిని, ఖనా మామగారిని చాల భక్తితోఁ బూజింపఁజొచ్చిరి.

ఈసంగతి రాజునకుఁ గూడఁ దెలియవచ్చెను. ఆతఁడు "పులికడుపున సింగము పుట్టిన" దని మిగుల నానందించి యొకనాఁడు "ఆకాశమునఁగల నక్షత్రము లెన్ని?" అని యడి గెను. అందులకు ప్రత్యుత్తరము చెప్పుటకు వ్యవధినిఁ గోరి తండ్రియుఁ గుమారుఁడును ఇంటికి వచ్చి లెక్క వేసిరి. గాని యెన్నివిధములఁ జూచినను తేలలేదు. తండ్రికంటె కుమారుఁ డును, కుమారునికంటె తండ్రియు విచారింపఁగడఁగిరి. సభ కంతకును తా మిరువురే జ్యోతిశ్శాస్త్రవిద్వాంసులు అథవా ఆవిద్యగూడ తెలిసినవారు నవరత్నములలోఁ గొంద రున్నను వీరి కెవ్వరును సాటిరారు. సాటిలేని అట్టి వీరే యీప్రశ్నకు సమాధానముఁ జెప్పలేకపోవుట లజ్జాస్పదము కాదా!

అయిన నేమి చేయవచ్చును. "పొరబడుచున్నా మేమో" యని వా రనేకపర్యాయములు లెక్కలుచేసిరి. "ఈదారితప్పెమో" యని వారు అనేకమార్గములు త్రొక్కిరి. గాని యెన్ని విధముల అవస్థలుపడినను లెక్క తేలలేదు. ఈవిచారమువలన

వారు దీనాననులై యుండుటఁ జూచి ఖనా సంగతి గ్రుచ్చి గ్రుచ్చి యడిగితెలిసికొని అతిసులభముగా తాను లెక్కచేసి నక్షత్రముల సంఖ్యను దేల్చి భర్తకును మామగారికినిఁ దెలిపెను. అంతట పురుషు లిరువురును ఆమె ప్రజ్ఞకుఁ జాల నానందించి రాజసభకుఁబోయి చెప్పిరి. "ఇది మా ప్రజ్ఞవలనఁ దేల లేదు. నాకోడలు లెక్కచేసి మాకుఁ జెప్పఁగా మేము మీ యెదుటఁ జెప్పితిమి" అని వరాహుఁడు చెప్పెను.

ఈమాటలు విని సభలోనివా రందఱును మిగుల నాశ్చర్యచకితులును, ఆనందభరితులు నై అనేకవిధములఁ గొనియాడిరి. రాజు "ఇంతవఱకును నాసభలో తొమ్మిది రత్నములు మాత్రమే యున్నవి. ఖనా దశమరత్నమై ప్రకాశింపవలసిన" దని చెప్పి సభకు వచ్చినతరువాత యామె ననేకవిధముల సత్కరించెను.

ఖనా కొంతకాలము భర్తతోడను, మామగారితోడను రాజసభకుఁ బోయి అనంతసమ్మానమును బడసి దిగంతము లన్నియు తనకీర్తితో నింపి స్వర్గమునకుఁ బోయెను.



# సుశీల.

శ్రీపురమున కౌశికుఁడు అను నొక బ్రాహ్మణుఁడు ఉండెను. వయసున నాతఁడు యువకుఁడు. ఆశ్రమమున బ్రహ్మచారి. ఆతఁడు తోడిబాలురవలె సంసారసాగరమునఁ గూలఁబడక పురముబైట నదీతీరమున చిన్ని కుటీరమును నిర్మించుకొని యందు వసించి జపతపములం జేసికొనుచు మాధుకరాన్నముతో జీవములను నిలిపికొనుచుండెను.

ఒకనాఁ డాతఁడు నదీతీరమున నున్న యొక చెట్టుక్రిందఁ గూర్చుండి జపము చేసికొనుచుండఁగా కొమ్మలమీఁదఁ గూర్చుండిన కొంగ యొకటి యాతనిమీఁద రెట్టవైచెను. అందుల కాతఁ డాగ్రహమహోగ్రుఁడై మీఁదికిఁ జూడఁగా వెంటనే యాపక్షి విలవిల దన్నుకొనుచు క్రిందఁబడి భస్మమై పోయెను.

ఆహా! ఎంత యద్భుతము కౌశికుఁ డెంత అమానుష శక్తిమంతుఁడు; అయిన నాతఁడు ఇంతవఱకును తన కింత శక్తి యున్నదని కలనైన నెఱుంగఁడు. కన్ను లెఱ్ఱజేసి చూచిన జగములు మండిపోవుటకంటె శక్తియేమి ఉన్నది?

ఈయెఱుకవలన అతనికి గర్వము ప్రబలెను. అహమిక వలన తామసము పెరిగెను. తన శక్తియొక్క పరిమితిని, దాని

యుపయోగమును జింతించుకొనుటలో నాతఁడు జపతపముల యెడల కొంచె మశ్రద్ధ చూపసాగెను.

ఆపురమున సోమశర్మ యను నొక బ్రాహ్మణుఁ డుండెను. ఆతఁడు సకలవిద్యలును నేర్చిన పండితుఁడే; గాని యెల్లప్పుడును ఆధ్యాత్మికచింతనమునందే ప్రవృత్తుఁడై వానప్రస్థుని వలె సంసారమును నిర్వహించుచుండెను.

ఆతని భార్యయే సుశీల. సుశీల యనిన పురమునందలి యెల్లరకును అధిక ప్రీతి.నిజముగ నాపురమున ఆమెకు సాటి స్త్రీ లేదు. సుశీలకు భర్తయే దైవము. ఆమె కితరచింతనము లేమియు లేవు. భర్త సుఖము భర్త యానందమే యామెకు సాధ్యము. ఏవిచారమును లేక యామె సదా భర్త చిత్తవృత్తి ననుసరించి ప్రవర్తించుచు ఆనందపరవశయై యుండును.

సోమశర్మకు సుశీల యెట్లు తగిన పత్నియో, సుశీలకు సోమశర్మ యట్లు తగిన భర్త. తనయెడల నామె యెంత భక్తిని జూపుచున్నదో యామె యెడల నాతఁ డంతటి ప్రేమ చూపుచుండెను. సుశీల సోమశర్మకు చీపురుముల్లయిన దగుల నీయదు. సోమశర్మ సుశీలకు మనస్సు నొవ్వనీయఁడు. భార్యాభర్తల యనురాగమునకు వా రుదాహరణముగ నుండిరి.

సుశీల సౌశీల్య మనంత మగుట యెఱింగి విజ్ఞానిశేఖరుఁడగు సోమశర్మ యామెకు తత్త్వోపదేశము గావించెను.

అంతట నామె సకలము నెఱింగి భర్తను పూర్వాధికముగఁ బూజింపసాగెను.

ఒకనాఁడు కౌశికుఁడు మాధుకరము నిమిత్తము పురమున సంచరించుచు సోమశర్మ యింటికి వచ్చి వాకిట నిలిచి "భవతి భిక్షాం దేహి" యని పలికెను; గాని దైవవశమున నప్పుడు సుశీల నిద్రాముద్రితుఁ డగుచున్న భర్తకు పాదసేవ చేయుచుండెను. వాకిట బ్రహ్మచారి భిక్షార్థియై నిలిచియుండుట. కదలిన నిద్రించుచున్న భర్తకు నిద్రాభంగ మగుట. ఏమి సేయవచ్చును? జ్ఞానవతి యగు సుశీల యొక్క-క్షణ మాలోచించి భర్తృపదసేవయే ప్రధాన మని నిశ్చయించుకొనియెను.

కొంతసేపటికి సోమశర్మ గాఢనిద్రం దవిలెను. అప్పుడు సుశీల మెల్లగ లేచి వచ్చి అన్నము గైకొని వాకిటికి వచ్చి నిలువఁగా కౌశికుఁడు భిక్షముఁ గైకొనక "బ్రాహ్మణుని, బ్రహ్మచారిని, తపోధనుని ఇంతసేపు నిలుపుటా." యని గద్దించి పలికెను. అందులకు సుశీల "తపోధనులైన మీకుఁ దెలియనిది లేదు. మీరు వచ్చునప్పటికి భర్తపాదములను విడుచుటకు వీలులేని స్థితిలో నుంటిని. క్షమింపవలెను" అని వినయముతో బతిమాలుకొనియెను; గాని అమానుషశక్తిసంపన్నుఁడ నని గర్వించియున్న బ్రాహ్మణునకు శాంత మెక్కడ?"పతిపాదములు విడువలేవా ? వాకిట బ్రాహ్మణుఁడు పడిగాపులు పడియుండవలసిన

దేనా? చూడు నిన్నేమి చేసెదనో" యని కన్ను లెఱ్ఱజేసి గర్జించుచుఁ బలికెను. అందులకును సుశీల కోపపడక "అయ్యా, ఆగ్రహపడిన ప్రయోజనము లేదు. భర్తృశుశ్రూష వలద నిన అది శిష్టసమ్మత మయిన మాట గాదు. ఇంతకును నీ యెఱ్ఱని కండ్లకు నేలకూలుటకు నేను కొంగను గాను" అని పలికెను.

ఈమాట వినుటతోడనే కౌశికునకు ప్రాణము లెగిరించి పోయెను. "ఆసంగతి యీామె కెట్లు తెలిసినది." అని యాశ్చర్య చకితుఁడై సుశీలను మహాపతివ్రతనుగా భావించి యాతఁ డామె పాదములమీాఁద వ్రాలి "తల్లీ! క్షమించి నన్ను రక్షింపుము" అని ప్రార్థించెను.

అప్పుడు సుశీల "నీకు జ్ఞానోపదేశము చేయుటకు నేను తగను. మిథిలాపురమున ధర్మవ్యాధుఁ డను బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు కలఁడు. ఆతనివద్దకుఁ బొమ్ము" అని చెప్పెను. కౌశికుఁడు మఱియొకమాఱు సుశీలకు మ్రొక్కి ధర్మవ్యాధుని వద్దకుఁ బోయి జ్ఞానోపదేశముఁ బడసెను.

సుశీల పూర్వాధికభక్తిశ్రద్ధలతో భర్తను సేవించి బ్రతికియున్నంతకాలము ఆనంద మనుభవించి అంతమున పతివ్రతలు పొందు లోకమును పొందెను.

---

# సంయుక్త.

డిల్లీచక్రవర్తి యగు అనంగపాలునకు ఇరువురు కొమార్తెలు ఉండిరి. వేఱుగ పుత్రసంతానము లేకపోయెను. ఆ యిరువురు కొమార్తెల నాతఁ డిరువురు రాజుల కిచ్చి పెండ్లి చేసెను. ఇరువుర కిరువురు బిడ్డలు పుట్టిరి. ఒక యామె కొడుకు పృథివీరాజు. ఇంకొక యామె కుమారుఁడు జయచంద్రుఁడు. అనంగపాలుఁడు తన రాజ్యమును పృథివీరాజున కిచ్చెను. పైతృక రాజ్యముతోఁబాటు మాతామహరాజ్యము గూడ సంక్రమించుటవలన పృథివీరాజు జయచంద్రునికంటె అంగ బలమునందును, అర్థబలమునందు నధికుఁ డయ్యెను.

డిల్లీరాజ్యమును పృథివీరాజున కొక్కనికే యిచ్చుట వలన తాతమీఁదను, తానొక్కఁడే పుచ్చుకొనుటవలన పృథివీ రాజుమీఁదను జయచంద్రుఁడు చాల పగఁబూనెను. ఇరువురును గూడ ఈ ద్వేషమును పురస్కరించుకొని అనేకపర్యాయములు యుద్ధములు చేసిరి.

పృథివీరాజునకు రెండు రాజ్యముల యాధిపత్య మున్న నేమి? తానే చక్రవర్తి నని జయచంద్రుఁడు రాజసూయ యాగము గావింపఁదలఁచెను. ఆయాగమునందే తనకొమా

ర్తియు, నవలావణ్యవతియు నగు సంయుక్తకు స్వయంవరము గూడ చేయుటకు నిశ్చయించెను.

సకలసన్నాహములును పూర్తియైన పిదప యుక్తసమయమున జయచంద్రుఁడు బ్రాహ్మణుల వేదఘోషములు మిన్ను ముట్టుచుండ యజ్ఞశాలలోఁ బ్రవేశింపఁగా పృథ్వీరాజు అతని దాయాదిని జంపి ఆవార్త నాయజ్ఞశాలవద్ద ప్రకటన చేయించెను. ఆకస్మికముగా నిట్లు ఆశౌచము వచ్చుటవలన జయచంద్రుని రాజసూయము నిలిచిపోయెను. పృథ్వీరాజు ఇట్టి నీచపుఁబని చేసినందులకు జయచంద్రుఁడు చాల నాగ్రహ పడియెను.

రాజసూయము నిలిచిపోయినను జయచంద్రుఁడు సంయుక్త స్వయంవరమును మానఁదలఁచుకోలేదు. ఆతఁడు తన్నిమిత్తము దేశదేశములయందున్న రాజపుత్రుల నందఱ నాహ్వానించెను. వారందఱును తమతమ వైభవములకుఁ దగునట్లు కనోజపట్టణమునకు వచ్చిరి. జయచంద్రుఁడు వారికిఁ దగిన విడుదుల నేర్పఱిచెను.

ముహూర్తము సమీపించెను సభాభవనము చాల రమ్యముగా నలంకరింపఁబడియెను. ప్రజలనేకులు వచ్చి నిర్దిష్ట స్థలములయందు నిండిపోయిరి. పిదపఁ గొంతసేపటికి ఒక్కొక్క-రాజ పుత్రుఁడే వచ్చి నిర్దిష్టస్థలముల నాసీనులైరి. వారందఱును గంధర్వయువకులవలె చాల సుందరముగా నుండిరి.

ప్రజ లందఱును "ఇందఱు రాజపుత్రులలో వివాహకళ యెవ్వ నికి వచ్చినదా" యని విమర్శింపఁజొచ్చిరి. రాజపురుషు లంద ఱును చాల మెలఁకువతో సంచరించుచుండిరి.

జయచంద్రుఁడు వచ్చి యంతటను ఒకమాఱు కలయఁ జూచి యేర్పాటు లన్నియు చాల జాగ్రత్తగా నుండుట కానందించి యొక యున్నతాసనముపఁ గూర్చుండెను. అప్పుడు కొందఱు సేవకులు అచ్చముగా పృథివీరాజువలె నున్న యొక విగ్రహమును ఆసభలో నుండియే కొనిపోయి ద్వార మున నుంచిరి ఆవిగ్రహము చేత నొక రజతదండ ముండెను. జయచంద్రుఁడు "పృథివీరాజు నానౌకరు" అను భావముతో నావిగ్రహము నక్కడ నుంపించెను ఈవిషయము నందఱును గ్రహించి చాల వింతపడిరి అందఱు నన్నివిధముల యోజింపఁ జొచ్చిరి; గాని యొక్కరును మాటలాడలేదు. అప్పుడు అక్కడ చీమ చిటుకు మనినను విన్పించునంత నిశ్శబ్దముగా నుండెను.

కొంతసేపటికి ఇరువురుచెలికత్తెలు వెంటరాఁగా పూల దండ చేఁబూని సంయుక్త వచ్చెను. సభలో నున్నవారందఱు నొక్కమాఱామెపై తమదృష్టులు బఱపిరి. అప్పు డామె గం ధర్వరమణివలె నపూర్వశోభతోఁ బ్రకాశించుచుండెను. చెలి కత్తె లామెను తండ్రి చెంతకుఁ దీసికొనివచ్చి నిలిపిరి. జయ చంద్రుఁడు ఆమెకు "తల్లీ, అనేకరాజపుత్రులు వచ్చియున్నారు.

ఇందు నీచిత్తమున కెక్కిన రాజపుత్రుని వరింపు" మని చెప్పి వెంట నుండి సంగతులు చెప్పుట కొక చెలికత్తెను నియమించెను.

తోడనే సంయుక్త తండ్రికిని రాజపుత్రు లున్న స్థలమునకును మధ్య వచ్చి నిలిచెను. ఆమె సిగ్గుపడుచున్న దని చెలికత్తె నింపాదిగా నడిపించుటకు చేయి పట్టుకొనియెను; గాని సంయుక్త చేయి విడిపించుకొని ఒక్కక్షణకాలము ఆకసమువంకఁ జూచి రాజపుత్రుల నెవ్వరినిఁ జూడక గజగమనయై తిన్నగ ద్వారమునకుఁ బోయి యక్కడ నున్న పృథివీరాజు బొమ్మకంఠమున పూలదండ గిలించెను.

అంతట సభయం దంతట నొక్కటే కోలాహలమయ్యెను. రాజపుత్రు లందఱును లజ్జితులైరి. ప్రజ లందఱును ఆశ్చర్యచకితులైరి. ఏమగునో యని యాత్రముతోఁ జూచుచున్న శుద్ధాంతజన మంతయు తెల్లవోయెను దాసీలిరువురును, స్తంభితలైపోయిరి. రాజపురుషు లందఱును కళవళపడసాగిరి. జయచంద్రుఁడు మహోగ్రుఁడై "ఈతుచ్ఛురాలిని కైదులో వేయుఁడు" అని మేఘగంభీరభాషణములతోఁ బలికెను.

చూచుచుండఁగా సంయుక్త యంతఃపురమునకుఁ బోయెను. రాజపుత్రు లందఱును వచ్చునప్పుడు మానులై వచ్చినవారు ఇప్పుడు ఒకరితో నొకరు ఏమేమో మాట్లాడు

కొనుచు వెడలిపోయిరి. రాజపురుషులు వచ్చి ప్రజలను ఎక్కడివా రక్కడకుఁ బోవలయునని త్వరత్వరగాఁ బంపివేసిరి. క్షణములో ఆప్రదేశ మంతయు నిర్జన మయ్యెను.

సంయుక్త పోయి తన భవనమునఁ గూర్చుండెను ఆమె యప్పుడు ఏకాంతముగ నుండఁదలఁచెను; గాని యది కొనసాగలేదు. క్షణములో రాజబంధుపురాంద్రగుస్త్రీ లందఱును వచ్చి యామెను ముట్టడించిరి "చెల్లీ, ఇట్టి పని చేసితివేమే" యని మొదట కొందఱు సన్న సన్నముగ నడిగిరి. "ఇంత జేల వైతి వేలనే" యని కొంద ఱడిగిరి. "మన్మథరూపు లుండఁగా ద్వారపాలకుని వరించుట యెంత సిగ్గులచేటమ్మా" యని కొందఱు మెల్ల మెల్లగాఁ దెల్పిరి "పాలవంటి కులమున కెంత యపకీర్తి తెచ్చితివే" యని కొంచెము దగ్గఱిబంధుపురాంద్రు రుసరుసలాడిరి. "తల్లిదండ్రులపాలిటి కార్చిచ్చు వైతివి గదే" యని యంతకంటె దగ్గఱివారు రుంజుకొనిరి. "ఇట్టి దుర్బుద్ధి యున్న దానవు సభలోని కేమని పోయితివే" యని ఒక ముదుసలియామె వచ్చి బుగ్గలు పొడిచెను. ఇంతలో మహిషాసుర మర్దనివలె తల్లి వచ్చెను. ఆమెను జూచి అందఱును ఓసరిల్లి ఆమెకు అనుగ్రహము గలుగవలె నని యందఱును సంయుక్త ననేకవిధముల నిందింపసాగిరి.

తల్లివచ్చి "ఛీ, నాకడుపునఁ బుట్టక దొమ్మరిదానికి పుట్టలేకపోయితివా?" యని బుగ్గలుపొడిచి యిఁక మాట్లాడఁజాలక

పోయెను. ఇంతలో "ఏదీ? ఆపాతకి యెక్కడ నున్న" దని గద్దించుచు జయచంద్రుఁడు వచ్చెను. మఱల స్త్రీ లందఱును ఓసరిల్లి సంయుక్తను నిందింపఁజొచ్చిరి. తండ్రి వచ్చి "నిన్నేమి చేసినను పాపము లేదు. ఆఁడుపుట్టుక పుట్టితివి; గాని లేకున్న నిన్నింత ముక్కలుగా ఖండించియుందును. అందఱు రాజపుత్రులు మదనమోహనులు దేవేంద్రవిభవు లుండఁగా సిగ్గులేని ఆదుర్మార్గుఁడు నానౌకరునకు సమానుఁడైనవాఁడు కావలసివచ్చెనా?" యని మండిపడి పండ్లు పిండిచేసికొని "ఈయభాగ్యురాలిని కైదులోఁ బెట్టుఁడు" అని యఱచెను. స్త్రీ లందఱును మఱల నిందలు ప్రారంభించిరి. ఎవ్వ రేమనినను, ఎవ్వ రేమి చేసినను సంయుక్త యేమియుఁ బలుకలేదు. మోమెత్తి చూడ లేదు. అప్పు డామె నిర్లక్ష్యత నుపలక్షించి జయచంద్రుఁడు మఱల క్రోధోద్రిక్తుఁడై "చూడవలదు. ఈతుచ్ఛురాలిని కైదులో బంధింపుఁడు" అని యఱచెను.

ఆమాటయే రెట్టించి రెట్టించి పలుకుటవలన నిజమేయనుకొని దాసీసుందరు లామెను దీసికొని బయలుదేఱిరి. ఈవార్త ముందుగనే విని కారాగృహాధికారి యెదురువచ్చెను సంయుక్త వెంటవచ్చుచున్న జయచంద్రుఁడు "నరహంతకులకు నిర్దిష్టమైన స్థలమున దీనిని బంధింపుము" అని యాజ్ఞాపించెను. కారాగారాధిపతి చిత్త మని యట్లే చేసెను. కొమార్తెను కైదులోఁ బెట్టించి జయచంద్రుఁడు చేయవలసిన వన్నియు కైదుఉద్యోగికి తెలిపి దాసీలను పొమ్మని ఇవ్వాలకు వచ్చెను. అప్పుడుగూడ

సంయుక్త యేమియు మాట్లాడలేదు. ఆమె శాశ్వతమౌనవ్రతము నవలంబించినట్లు ఉండెను.

ఈసంగతి యంతయు ఢిల్లీలోఁ దెలిసెను. పృథివీరాజు నకు విచారమును, ఆనందమునుగూడ నొక్కమాఱే గలిగెను. ఆవిచారానందములలో రోషముగూడ మిళితమయ్యె యుండెను. ఈవృత్తాంతమును చారుఁడు చెప్పునపుడు ప్రథమమున జయచంద్రుఁడు చేసిన పనికి మండిపడెను. పిదప సంయుక్త చేసిన కృత్యమునకు పొంగిపోయెను. ఆటుపిమ్మట సంయుక్త యెడల జయచంద్రుఁడు అవలంబించిన విధానమునకు విచారము పొంది ఆగ్రహమహోగ్రుఁడయ్యెను. "సంయుక్త మంచి పని చేసినది" గాని యీనీచున "కాశిక్ష చాలదు" అని పృథివీ రాజు తలఁచెను.

పిదప చారుఁడు సంయుక్త అంతఃపురము ప్రవేశించిన తరువాతను, కారాగృహము చొచ్చిన పిమ్మటను జరిగిన వృత్తాంతములను జెప్పెను. ఇవి విని పృథివీరాజు తొలుతఁ గటకటంబడి "జయచంద్రునికంటె నధముఁ డీలోకమున లేఁడు. వాఁడు ఆముద్దులగుమ్మ నెన్నివిధములనైన పీడించును. నాపరోక్షమున నావిరోధికి స్వబుద్ధితో తీరని పరాభవము చేసి నాయెడల అంత యనురాగమును జూపిన యావగలాడిని, నాప్రాణాధికప్రియను ఉద్ధరింపకున్న నాకు లోకములు లేకుండఁ బోవును" అని నిశ్చయించెను.

పృథివీరాజు సేనాధిపతుల కాజ్ఞ లిచ్చుటయు, కన్యాకుబ్జమువిూఁదికి దండయాత్ర బయలుదేరుటకు ఒక్కనిముసములో నయ్యెను. ఆసైన్య మంతయు నంచెలమీఁద అనుకొనినంతకంటె ముందుగనే వచ్చి కనోజుపట్టణమునకు కొంచెము దూరమున విడిసెను.

ఇట జయచంద్రుఁడు ఆవార్త నాలకించి యుద్ధమునకు సకలసన్నాహములును ప్రారంభించెను. విశేషించి పృథివీరాజు వచ్చినది మొదలు సంయుక్తను చాల బాధలు పెట్టసాగెను. సంయుక్త యున్న గదిబైట ఆమె చెలికత్తెలే విచ్చుకత్తులు బూని కావలియుండిరి. జయచంద్రునియెదుట వారు సంయుక్తను, మర్మస్పృక్కు లగు వాగ్వజ్రములతో వేధింపసాగిరి. "పృథివీరాజు దండెత్తి వచ్చెనని నీవు మురియనక్కఱలేదు. నిన్ను ఆతఁడు ఉద్ధరించునని కూడ నీవు ఆశపడనక్కఱలేదు. ఆయాశాపాతకుఁడు ఇక్కడనుండి ప్రాణములతోఁ బోయి నప్పుడు చూతములే" యని మాటిమాటికి నామెను వేధింపసాగిరి గాని యేమాటలకును సంయుక్త జవాబు చెప్పుట మానివైచెను.

జయచంద్రుని సేనాసన్నాహ మంతయుఁ బూర్తి యయ్యెను. ఒకనాఁటి రాత్రి సేనాధిపతి యగు ఆతతాయి అంధకారమున పృథివీరాజుమీఁదఁబడి ఆతని సైన్యమును చెదరఁగొట్టి యుద్ధసామగ్రి నంతను కొల్లగొట్టి ఆతనిని కైదులోఁ బెట్ట విశ్వప్రయత్నములు గావించుచుండెను. శత్రువులకు

ప్రయత్నములు తెలియఁగూడ దని కోట బైట నున్న సైన్యమున నెచ్చటను దీపములు లేకుండఁజేయఁబడెను. ఆతతాయి క్రిందియుద్యోగు లందఱును చాల యడావుడిగా నటునిటు సంచరించుచుండిరి.

ఈసమయమున అయిదాఱుగురు అశ్వికులు సేనాపరీక్ష సేయునట్లు నటించుచు నచ్చట రవంతసేపు సంచరించి "భద్రముగ నుండుఁడు. శత్రువుల ప్రయత్నములను కనిపెట్టి వచ్చెదము" అని పృథివీరాజు గుడారము లున్న దిక్కునకు ఉడాయించిరి. కొంతసేపయిన తరువాత అక్కడ నున్న సైనికాధికారులకు వారినిగుఱించి సందియములు తోఁచెను. తోడనే వారు పరిశీలనము ప్రారంభించిరి. దుర్గముబైటను, దుర్గము లోపలనుగూడ ఎక్కడివా రక్కడనే పరిశీలనము ప్రారంభింపఁగా కైదులో సంయుక్తయు, అచ్చటఁ గాపున్న చెలికత్తెలును గూడ లేరని తెలియవచ్చెను. అందఱును కంగారుపడఁజొచ్చిరి. "సంయుక్త పురుషవేషము ధరించి చెలికత్తెలతోఁగూడ డిల్లీ సేనానివేశమునకుఁ బోయె నని కోటయందంతటను పెద్దకోలాహలము ప్రారంభ మయ్యెను.

ఇక్కడ నిది యిట్లు జరుగుచుండఁగనే అక్కడ సంయుక్త పృథివీరాజు శిబిరము జేరి చెలికత్తెలు పురుషవేషము తీసివేయఁగా రాజునెదుటకుఁ బోయి నిలిచి గాంధర్వవిధి నాతనిం బెండ్లియాడెను. ఈసంగతి అచ్చటఁగూడ సంయుక్తచెలికత్తెలకు మఱియేరికినిఁ దెలియదు.

ఈసంగతియొక్క వాస్తవస్థితి యంతయు నెప్పుడు స్పష్టముగఁ దెలిసెనో యావెంటనే యాతతాయి డిల్లీ శిబిరముల దెసకు సైన్యప్రవాహమును మఱలించెను. అంతకు మున్నే ఆయంధకారమున నక్కడక్కడ నిలిచియున్న వేఁగుల వాండ్రు పరాకులు చెప్పఁగా డిల్లీసైన్యసాగరము ముందునకు కదలెను. ఉభయప్రవాహములును మధ్యభాగమున సమరము ప్రారంభించెను. వీరి యుత్సాహము వేరు. వారి సంతోషము వేరు. ఉభయులునుగూడ ఒడల్లు మఱచి పోరఁదొడఁగిరి. "దేవీ, ఇది గాదు వినోదములకు సమయ" మని సంయుక్తవద్ద సెలవుగొని పృథివీరాజుగూడ యుద్ధరంగమున నవతరించెను.

సంకులసమరము ప్రారంభ మైనది మొదలు ఆతతాయి పృథివీరాజునిమిత్తము వెదకసాగెను. కొంతసేపటికి ఆతఁడు కాన్పింపఁగా "నిలుము. మగవాఁడవేని ఇటు రమ్ము" అని సింహాగర్జనము చేసెను. అప్పుడు రాజును ఆతతాయియు ద్వంద్వయుద్ధము ప్రారంభించిరి.

ఉభయులునుగూడ తమ చాతుర్య మంతయుఁ జూపి పరస్పరాఘాతములను తప్పించుకొనుచు అంతకంతకు జటిలము లగు పద్ధతు లవలంబించి యుద్ధము సేయఁదొడఁగిరి. కొంతసేపటికి ఆతతాయికి ఒక మంచి యవకాశము దొరకెను. ఆసందర్భమును బోనీయక యాతఁడు రాజును సంహరించుటకు తటాలున కత్తియెత్తెను. ఆతఁ డాకత్తిని విసరఁబూను

నంతలో వెనుకనుండి యొక వీరుఁడు వచ్చి ఆచేతిని ఖండించి క్రిందఁబడఁగొట్టెను. "ఛీ, ఎవఁడురా?" యని యాతతాయి వెనుదిరిగి చూచి పడిపోయెను; ఎదుట నున్న వీరునిఁ జూచి రాజు ఆశ్చర్యచకితుఁ డగుచుండఁగా ఆవీరుఁడు "రాజా, ఆశ్చర్యమున కిది యదను గాదు. కత్తి విసరుము" అని ప్రోత్సహించెను. రాజు అట్లే చేయుటకుఁ బ్రారంభింపఁగా క్రొత్తవీరుఁడు గూడ కనోజుసైనికులను మట్టుపెట్టసాగెను.

ఒక క్షణములో ఆతతాయి పడిన వార్త తెలియఁగా కనోజుసైన్య మంతయుఁ జెల్లాచెదరు కాఁజొచ్చెను; గాని ఢిల్లీ వీరులు వారిని విడువక కసిమసంగఁజొచ్చిరి. రాజు ఒడలు తెలియక పీనుఁగుగుట్టలను వేష్పసాగెను. కొంతసేపయిన తరువాత క్రొత్తవీరుఁడు "రాజా, నిలువుము. ఇఁక పౌరుషము చాలింపుము. వారు పాఱుబోతులు. స్త్రీలకంటె నధములు" అని వారించెను. రాజు శాంతించినతోడనే ఢిల్లీ ఫౌఁజు అంతయు శాంతించెను. చూడఁగా నక్కడ మందున కైన నొక్క కనోజుసైనికుఁడు కాన్పింపఁ డయ్యెను. రాజు సైనికుల నంద ఱను పొగడి గాయపడినవారికి చికిత్సలు చేయ నియమించి క్రొత్తవీరుని వెంటనిడుకొని తన శిబిరమునకుఁ బోయెను.

"శిబిరము చేరిన పిదపఁగూడ పృథివీరాజు క్రొత్తవీరుని గుఱుతింపలేకపోయెను. ముఖమునఁ బొంగిపొరలిపోవుచున్న లావణ్యమును, విశాలనయనములయం దుచ్చలితం బగుచున్న

తారళ్యమును, కలికిపలుకులయం దుత్తరంగిత మగుచున్న మాధుర్యమును జూచి యరసొక్కి పృథివీరాజు మున్నెన్నఁడో యొకప్పు డాతనితోఁ జాలతడవు మాట్లాడియున్న ట్లనుమానించుచు నడుగుట గౌరవము కాదనియు, కొంతతడ వేదో ముచ్చటించుచుఁ గూర్చుండిన తెలియకపోదనియుఁ దలంచి యాతని నెదుటఁ గూర్చుండఁబెట్టుకొని యాతఁడు తనకుఁ గావించిన మహోపకారమునకు కృతజ్ఞత చూపఁదొడఁగెను. క్రొత్త వీరుఁడును ఇంకను రాజు తన్ను గుఱుతింపనందులకు ముసిముసినగవులు నగుచు నల్లనల్లనఁ దగునట్లు ప్రత్యుత్తరమిచ్చుచుండెను. ఎంతకును రాజు కృతార్థుఁడు కాలేక "నాజ్ఞాపకశక్తి యిట్లు మందమైపోయిన దేల?" యని చాల దొట్రుపడసాగెను. ఇఁకఁ దన్ను గుర్తించుట రాజువలనఁ గాదని తలఁచి వీరుఁ డాపటకుటీర మంతయు మెరసిపోవునట్లు విద్యుత్కటాక్షముల నంతట నొక్కమాఱు నెఱపి మోము వంచి యూరకుండెను. అంత దరహాసితవదనలై సంయుక్త చెలికత్తె లిరువురును మదనుని పూవుటమ్ములవలె క్షణములో వచ్చి వీరుని భుజములపైఁ జేతుల నానుకొని యిరుదెసల నిలుచుండిరి అప్పుడు రాజు హృదయ మొక్కమాఱు కలఁగిపోయెను. వెంటనే యాతఁడు వీరుని చేయి పట్టుకొని ముఖముదెస గంభీరముగఁ జూచి "సంయుక్తా!" యని పిలిచెను.

"ఇఁక వీరుఁ డటఁ గూరుచుండఁజాలక తటాలునరాజు చేయివిడిపించుకొని యడుగులు తడఁబడ శరవేగమున మఱి

యొక పటకుటీరమునకుఁ బోయెను. చెలికత్తె లంత సిగ్గెందులకే యని రాజు దెసకుఁజూచిరి. వెంటనే రాజు సంయుక్తా యని పిలుచుచు నామె యున్న పటకుటీరమునకుఁ బోయి యెంత వెనుకకుఁ బోఁ బోవుచున్నను వదలక యామె చేయి పట్టుకొని తీసికొనివచ్చి యంకతలమునఁ గూర్చుండఁ బెట్టుకొని ప్రియమారఁ గౌఁగిలించుకొని మోము ముద్దాడి "దేవీ, నాఁడు మానము నిలిపితివి. నేఁడు ప్రాణము నిలిపితివి" అని యనేకవిధములఁ గొనియాడఁదొడఁగెను. వీరుఁడు సంయుక్త యని పాఠకుల కిఁక తెలుపనక్కఱ లేదు. రా జట్లు చేయుటవలన సంయుక్త కెక్కడ లేని సిగ్గును వచ్చెను. పాప మాముద్దరాలి నాలజ్జ యుక్కిరిబిక్కిరి గావించి వైచెను. అక్కతన నామె యేమియు మాట్లాడఁజాలక మోము వంచికొని రాజు దృఢాలింగనమున గరఁగిపోవుచుఁ గూర్చుండి యుండెను.

ఇట్లు సంపూర్ణవిజయము గలుగుటవలన పృథివీరాజు దుర్గమును ముట్టడించుట మాని సంయుక్తను దీసికొని ఢిల్లీకి వెడలిపోయెను.

దీనితో జయచంద్రుని క్రోధాగ్ని యెంతవఱకును బెరుగ వలెనో యంతవఱకును బెరిగిపోయెను. "ఇఁక వీనిని బ్రతుక నీయఁగూడదు" అని తలఁచి యాతఁడు గజ్నీపట్టణమును పరి పాలనముచేయుచున్న శహాబుద్దీనుగోరీ అను తురుష్కునివద్దకు రాయబార మంపెను.

పృథివీరాజు ఢిల్లీచేరికొనిన తరువాత భోగపరాయణుఁడై పోయెను. ఆతఁడు రాజ్యతంత్రమును మఱచిపోయెను. రాజకార్యములను నిర్లక్ష్యము చేయఁజొచ్చెను. కొందఱు ఉద్యోగులను కారణాభాసములను జూపి శిక్షింపఁబూనెను. ఈశిక్షలకు అలిగి యాస్థితిగతు లన్నియుఁ జూచి కొందఱు ఉద్యోగులు గజ్నీపట్టణమునకుఁ బోయి యచ్చటి పాలకుని రాజుమీఁదికి దండెత్తివచ్చునట్లు ప్రోత్సాహపఱిచిరి.

ఇంతటితో హిందూదేశముయొక్క దౌర్భాగ్యదశ పూర్తియయ్యెను శహాబుద్దీనుగోరీ వెంటనే బ్రహ్మాండమైన సైన్యముతో దండెత్తివచ్చెను. జయచంద్రుఁడును; పృథివీరాజు ఉద్యోగులును ఆతనితోఁ గలిసిరి. స్థానేశ్వరక్షేత్రమున యుద్ధము జరిగెను. చాల దినములు గడచిన తరువాత రాజు ఓడిపోయెను. ఈవార్త విని సంయుక్త మున్నగు స్త్రీలు ఢిల్లీలో అగ్నిగుండములయం దుఱికి ప్రాణములను విడిచి వీరస్వర్గమునకుఁ బోయిరి. చితులతో నిండియున్న ఢిల్లీని స్వాధీనము చేసికొని గోరీ హిందూదేశమున మహమ్మదీయపరిపాలనమునకు పునాదులు వేసెను

---

# అహల్యాబాయి.

బొంబాయిపరగణాయందలి అహమ్మదునగరుతాలూకాలో పాథరడే యను నొక పల్లెయందు ఆనందరావుసిందే యను నొక మహారాష్ట్ర గృహస్థుఁడు నివసించియుండెను. ఆతఁడు ధనవంతుఁడు గాఁడు. వ్యవసాయ మాతని ముఖ్య వృత్తి. స్వభావమున నాతఁడు చాల సాత్వికుఁడు. ఆతని భార్య భర్తకుఁ దగిన రమణి. అనురూపదంపతు లగుటవలన వారి కేమిటను తక్కువ గాన్పింపకుండెను.

కాని సంసారులకు ఎన్ని యున్నను సంతానము లేకున్న అంతయుఁ గొదువయే. క్రొత్తవారితో సమావేశ మయినపుడు "మీ కెంత ధన మున్నది? మీ వైభవ మెంత?" అని యిట్టి ప్రశ్నల నెవరు నడుగరు. "మీ కెందఱు బిడ్డ లమ్మా?" లేకున్న "మీకు సంతాన మెంతయ్యా" అని యడిగెదరు. ఈ ప్రశ్నలు సంసారికి సంతానముకంటె ప్రధాన మైనది లేదని చెప్పుచున్నవి.

ఆనందరావున కిప్పుడు ఆసంతానమే లేకయుండెను. ఆతఁడును ఆతని భార్యయుఁగూడ నందులకు చాల విషాదము పొందుచుండిరి. అయితే ఈశ్వరానుగ్రహము కలుగనపుడు మానవుల విచారమును, మానవుల కోర్కెలు నేమగును?

ఒకనాఁ డొక బైరాగి భిక్షార్థము వారి యింటికి వచ్చి దంపతు లిరువురునుగూడ దీనాననులై యుండుటఁ జూచి వారికి సంతానము లేకపోవుట గ్రహించి "విచారము వలదు. మీరు కోల్హాపురమునకు వెళ్లి అచ్చటి జగదంబికను గొలిచెదరేని సంతానము గలుగు" నని చెప్పి వెడలిపోయెను. అందులకు వారు ఆశ్చర్యచకితులై "అయాచితముగ నీతఁడు ఈవిషయమును జెప్పిపోయెను. కారణము భగవంతున కెఱుక. మన మీఁద జగదంబికకు అనుగ్రహము కలిగిన ట్లున్నది." అని కూడఁబలికికొని యుక్తసమయమున కోల్హాపురము వెళ్లి ఒక సంవత్సరకాల మామెను గొలిచిరి. ఒకనాఁటిరాత్రి జగదంబిక ఆదంపతుల కిరువురకునుగూడ స్వప్నమున సాక్షాత్కరించి "మీసేవకు మెచ్చితిని. మీకోరిక నెఱవేఱును. ఇఁక మీస్వస్థలమునకు వెడలిపొండు" అని చెప్పెను. వెంటనే వారు మేల్కాంచి స్వప్నవృత్తాంత మొకరి కొకరు తెల్పుకొని మఱునాఁడు జగదంబికను గొలిచి సెలవుగోరి స్వస్థలమునకు వెడలిపోయిరి.

పిదప అచిరకాలమునందే ఆనందరావుభార్య గర్భవతియై నవమాసములు మోసి యొక మంచిలగ్నమున కొమార్తెను గనియెను. బాలికకు అహల్య యని నామకరణము చేసి లేకలేక కలిగిన దగుటచే ఆదంపతులు చాల ప్రేమతోఁ బెంచుకొనుచుండిరి.

యుక్తసమయమున ఆనందరావు అహల్యను విద్యా

భ్యాసము నిమిత్తము బడికి పంపఁదొడగెను. బడిపంతులు చాల మంచివాఁడు. పయిఁగ నాతనికి సంతానము లేదు. బడికి వచ్చు పిల్ల లందఱియందును అహల్య యొక్కతెయే చాల సత్ప్రవర్తనముతో నుండెను. అన్ని కారణములవలనను పంతులు ఆమెను కొమార్తను వోలె ప్రేమించుచు చాల శ్రద్ధతో చదువు చెప్పుచుండెను. అహల్యయు పంతులు చనువుచూపిన కొలఁది నెత్తెక్కి త్రొక్కక చాల భయభక్తులతో మెలఁగు చుండెను.

అహల్యకు తొమ్మిది సంవత్సరములు నిండెను. ఆనంద రావునకు కొమార్తకు పెండ్లిచేయవలసిన సమయము వచ్చె నని తోఁచెను. అతఁడు అనేకయువకులనుగూర్చి ప్రయత్నించెను; గాని యొక్కఁడు నాతనికి నచ్చలేదు. శుద్ధసాత్వికురాలగు అహల్యకు ఎవనినో యొకనిని సాహసించి నిశ్చయించుట యాతని కిష్టము లేకుండెను.

ఇట్లుండఁగా పూనాలో పేష్వాగా నున్న బాలాజీబాజీ రావు తమ్ముఁ డగు రఘునాథరావు మల్హారరావుహొళకరును, ఆతని కుమారుఁ డగు ఖండేరావును వెంట నిడుకొని ఉత్తర దేశములకు యుద్ధమునకు వెడలి అక్కడ శత్రువులను జయించి విజయానందముతో వెనుకకు మఱలెను. ఆతనికి మార్గవశమున పాథరవటీగ్రామము తగిలెను. పేష్వా లందఱును ఆమార్గమున పూనానుండి మఱియొకచోటుకుఁ గాని

మఱియొకచోటనుండి పూనాకుఁగాని పోవలసివచ్చినపుడు ఈ గ్రామమునీఁదనుండియే పోవుచుండిరి. పాథరవటీగ్రామమున ఆనందరావు ఇంటి కెదుట నొక పెద్ద హానుమదాలయము గలదు. పేష్వాల కదియే బస. రఘునాథరావుగూడ నక్కడనే బసచేసెను.

నాఁడు పంతులు పిల్లలకు ఆటవిడు పిచ్చి హానుమదాలయమునకుఁ బోయి రఘునాథరావుతో మాట్లాడుచుండెను. అది విని యెప్పుడు నాతని విడిచియుండని అహల్య అక్కడకుఁ బోయి ఆతని యొడిలోఁ గూర్చుండెను. పంతులు ప్రేమతో రా తల్లీ యని యామెను బుజ్జగించెను.

అహల్య చూచుటకు గంధర్వాంగనలవంటి సుందరి గాదు; గాని సంసారిణులకుఁ దీసిపోవు సుందరిమాత్రముగాదు. ఆమెముఖమున నేదో యొక యపూర్వప్రభ గూడ ప్రకాశించుచుండెను. అది చూచి రఘునాథరావు పంతులు నడిగి సంగతు లన్నియు దెలిసికొని "మల్హారిరావూ, నీకుమారునకు కన్యను వెదకుచుంటివి. ఇంతవఱకును తగిన కన్య నీకుఁ గాన్పింపలేదు. ఈ యహల్య మన ఖండేరావునకు తగిన కన్య యని తోఁచుచున్నది. ఆమె సౌభాగ్యరేఖలతోడనే గాని ఆమె తండ్రి బీదతనముతో మన కేమియు సంబంధము లేదు. ఈపిల్లను విడుచుటకు నామన మంగీకరించుట లేదు. నీవు ఏమనియెదవు?" అని యడిగెను. అందులకు మల్హారిరావు "మీ

చిత్తము. నాకేమియు నభ్యంతరము లేదు" అని చెప్పఁగా రఘునాథరావు పంతులు నడిగెను. ఆతఁడుగూడ నట్లే చెప్పఁగా నాతఁడు ఆనందరావునకు వర్తమానము చేసి తన యభిప్రాయము నెఱింగించెను. "మల్హారిరావుగారెక్కడ? నేనెక్కడ? వారికిని నాకును హస్తిమశకాంతరము గలదు. నన్నిట్లు అడుగుటలో నాకేమియు బోధపడుట లేదు" అని ఆనందరావు చెప్పెను. పంతులు సంగతి యంతయుఁ జెప్పెను. "రఘునాథరావుగారు మిమ్ము మేలమాడుట లేదు. నాకుఁగూడ నట్టి సంకల్పమే గలిగినది. మీరు బీదలైనను సంపన్నులైనను మాకు బాధ లేదు. ఈబాలికను జూచిన ఎట్లయిన నాకుమారునకుఁ జేసికొనవలయు నని ఉబలాటము పెరిగిపోవుచున్నది మీరు మఱియొకరీతిని భావింపవలదు" అని మల్హారిరావు చెప్పెను. "ఇప్పు డేమనియెదవు?" అని రఘునాథరావు మఱల నడుగఁగా "ఇది యేమో చాల వింతగా నున్నది. మల్హారిరావుగారి మాటలు నాసందేహమును గొట్టినవి; గాని ఆశ్చర్యము మాత్రము గలుగుచున్నది. దేవరవారు ఎట్లు చేసినను నాకు సమ్మతమే. అయినను నామనసును నేను నమ్మలేకుండనున్నాను" అని ఆనందరావు మఱల జవాబు చెప్పెను. "అట్లయిన అంతయు చూచుచుండుము" అని చెప్పి రఘునాథరావు సిద్ధాంతులను రప్పించి ముహూర్తము స్థిరపఱిపించి ఉభయపక్షములవారి బంధువులను రప్పించి మహావైభవముతో అహల్యాఖండేరావులకు వివాహము చేయించెను.

పెండ్లియైన తరువాత అహల్య తఱుచు అత్తవారియింటి యందే యుండవలసివచ్చెను. మల్హారిరావు ఒక్క క్షణమైన నామెను విడిచియుండఁజాలక పోవుచుండెను.

ఆతఁడు ఏకార్యమునకు వెళ్లవలసివచ్చినను, ఏయుద్ధమునకుఁ బోవలసివచ్చినను, "తల్లీ, పోయివత్తునా?" అని యహల్య నడిగి యామెచేత చిత్త మనిపించుకొని మఱి పోయెడివాఁడు. ఆమె చిత్త మనిన కార్యమునఁగాని యుద్ధమునఁగాని తప్పక జయము గలుగవలసినదియే. ఇందుచే నాతఁడు 'అహల్య జయలక్ష్మియొక్క అవతారము' అని చెప్పుచుండెను. అహల్య వయసునఁ జాలఁ జిన్నదే; గాని అసమానబుద్ధిమతి గావున మామగారు తనయెడల ప్రేమ చూపినకొలఁదియు నాతనిని గౌరవింపసాగెను. కొన్నిదినములు గడచునప్పటికి అహల్య మామగారి స్వభావమును చక్కఁగ గుఱుతించి తానే యాతనికి చేయవలసిన సేవ లన్నియుఁ జేయుచు మఱింత యానంద పెట్టసాగెను.

అహల్య అత్తగారి పేరు గౌతమాబాయి. నిజమునకు ఆమె గృహకృత్యములయందు చాల సమర్థురాలే; గాని కోప మధికము. అనేకసంవత్సరములనుండి ఆమెసేవలు చేయుచుండు దాసీలుగూడ ఆమె మనసున కెక్కునట్లు ప్రవర్తింపలేకుండిరి. అట్టిస్థితిలో అహల్య ఒకటిరెండుమాసములయందే సంగతు లన్నియు గ్రహించి ఆమె చెప్పుటకుఁ బూర్వమే యామెకుఁ

గావలసిన పను లన్నియు స్వయముగఁ జేయుచు సంతోషింపఁ జేయఁదొడఁగెను. ఇది చూచి దాసీ లందఱు నాశ్చర్యచకిత లగుచుండిరి.

మల్హారిరావున కిరువురు కొమార్తెలు. పెద్దయామె పేరు హారకుబాయి. చిన్నయామె ఉదాబాయి. అహల్య తన చాతుర్యమువలన అత్తగారినివలెనే వారిని గూడ గౌరవించుచు వారిచేతఁగూడ చాల ప్రేమింపఁబడఁ జొచ్చెను.

వారి గృహమున దాసీలు చాలమంది యుండిరి. ప్రత్యేకముగ అహల్యకు సేవఁజేయుటకే కొందఱు నియమింపఁబడియుండిరి. అయినను అహల్య తన పను లన్నియు తానే చేసికొనుచు ఆపరిచారికలకు ఆయాసము లేకుండఁజేయుచుండెను. ఇంతేగాక అప్పు డపుడు తనకు మామగారు ఇచ్చు ద్రవ్యములోఁ జాలభాగము తన దాసీలకు ఇచ్చుచు వారి దారిద్ర్యమును బాపుచుండెను. ఇందువలనఁగూడ నామె దాసీలకు చాల ప్రేమాస్పదురా లయ్యెను.

అహల్య ఇంకను చిన్నపిల్ల. భర్తతో మాట్లాడుటకు వీలులేని స్థితి. అయినను ఖండేరావు వివేకమహితుఁ డగుటవలన తలిదండ్రులకుఁ జేయు సేవలవలనను, తక్కిన ప్రవర్తనము వలనను తన భార్యయొక్క మంచితనమును గ్రహించి చాల నానందింపఁజొచ్చెను.

అన్నిటికంటెను అహల్య దైవభక్తి విశేషముగా నుండెను. ఆమె యత్తగారు ఎల్లవేళలను దేవతార్చనము సేయుచునే యుండెను; గాని ఆవిషయమున అత్తగారికంటె కోడలే యధికురాలని అహల్య ప్రఖ్యాతి వహించెను.

ఇన్ని కారణములవలన చిన్నతనమునందే అహల్య అత్తవారి యూరునఁగూడ చాల ప్రఖ్యాతిని సంపాదించెను.

పెండ్లి యైన అయిదుసంవత్సరములకు అహల్య రజస్వల యయ్యెను. మంచిముహూర్తమున పెద్దలు అహల్యకును ఖండేరావునకును పునస్సంధానము గావించిరి. "భర్తకు ప్రత్యక్షముగ సేవఁజేయుటకు నేఁటికి వీలు అయ్యె" నని యామె మహోల్లాసముతో సీత, సావిత్రి మున్నగు పురాతన భారతాంగనలవలె భర్తను సేవింపఁజొచ్చెను. కొన్ని దినములకు ఆమెకు మాలేరావు అనుకుమారుఁడును మంచాబాయి అను కొమార్తయుఁ గలిగిరి. "ఇట్లు అత్తమామల సంపూర్ణకటాక్షము, భర్తయొక్క యమితానురాగము, ఆఁడుబిడ్డల ప్రేమ, సేవకజనుల భక్తి, కన్యాపుత్త్రుల బాలలీలలు, అపరిమితైశ్వర్యము మొదలైన సుఖసాధనము లేకీభవించి తన్ను కొలువ అహల్యాబాయి కొన్నిసంవత్సరములు సౌఖ్యసముద్రములో మునిఁగియుండెను."

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా మల్హారిరావునకు తురుష్కులతో యుద్ధము పొసఁగెను. వీరుఁడు గావున ఖండే

రావుగూడ తండ్రితో యుద్ధమునకుఁ బోయెను. మల్హారి రావును ఖండేరావునుగూడ తమచాతుర్య మంతయుఁ జూపిరి. ఇంతలో శత్రునాయకుని చతురతతోఁ బట్టుకొనఁబోవు చుండఁగా ఖండేరావు గుండుదెబ్బ తిని చనిపోయెను.

ఈవార్త తెలియగనే అహల్యాబాయి సహగమన మునకు సిద్ధపడెను అది విని మల్హారిరావు ద్రుతగమనమున వచ్చి "తల్లీ, ఖండూ చనిపోయినందులకే వగచుచుండఁగా నీవు నన్ను దుఃఖసాగరపుపంకమున ముంచి వేసెదవా! నీపతిభక్తి యసాధారణ మనుట నెఱుఁగుదును. నీపాతివ్రత్యమును శత్రువులుగూడ శంకింపఁజాలరు. ఈవిధముగఁ గా కున్నను నీకెప్పటి కైన స్వర్గము కరతలామలకము. నేను ముసలితనమువలన చీకియున్నాను. ఖండూ కొట్టిన వజ్రాఘాతముమీఁద నీవు పిడుగులు గురిపించుట మంచిదా? నీవు లేకున్న నీచిన్ని బాలుని పక్షమున ఈరాజ్యము నెవ రేలెదరు?" అని యనేక విధముల ప్రార్థించి యనేకవిధముల నచ్చచెప్పెను. ఈమాట లకు బదులు చెప్పఁజాలక అహల్యాబాయి సహగమనమును మానివేసెను.

కొలఁదికాలము నడచునప్పటికి సహగమనము మానుట కింత పట్టుపట్టిన మల్హారిరావు గతించెను. అది యైన ఆఱు మాసములకు మాలేరావు (అహల్యాబాయి కొడుకు) చని పోయెను. అయినను ఇఁక హృదయమున విచారమునకుఁ

జోటీయకూడ దని యామె దృఢపఱుచుకొనియెను. అయినను మల్హారిరావునకుఁ దనయెడలఁ గల ప్రేమను ఆమె మఱువఁ జాలకుండెను.

మాలేరావుసంగతి యామె పూర్తిగ మఱచిపోయెను. అందులకు అనేక కారణము లున్నవి. నిజముగ కడుపునఁ బుట్టిన మాలేరావుకంటె నామెకు శత్రువుఁ డుండఁడు. ఎట్లు పుట్టెనో! అట్టి సాధ్వీమణికి కుమారుఁడైన మాలేరావునకు బ్రహ్మ ద్వేషము పుట్టెను.

దాని నిచ్చట వర్ణించుటకుఁ జోటు చాలదు. అయినను ఒకటి రెండు విషయముల నిచ్చటఁ జూపకతీఱదు. అహల్యా బాయి బ్రాహ్మణులను గొనియాడిన ఈతఁడు తెగనాడును. ఆమె "నాయనా, బ్రాహ్మణులకు వస్త్రదానము చేయు" మనిన బ్రాహ్మణులను బిలిపించి బట్టల మడతలలో తేళ్ల నునిచి యిచ్చును. పయిగా అవి కుట్టుటవలన బ్రాహ్మణులు బాధపడు చుండిన నీతఁడు వికవిక నవ్వును. "నాయనా,బ్రాహ్మణులకు సువర్ణ దానము చేయు" మని తల్లి చెప్పిన నీతఁడు వారిని బిలిపించి కలశములలో సువర్ణము నుంచి వానిపై నసహ్యము లగు పురుగుల నుంచి బ్రాహ్మణుల కిచ్చును. వానినిఁ జూచి బ్రాహ్మణు లదరిపడిన నీతఁడు కిలకిల నవ్వుచు నెగతాళి చేయును.

కుమారుఁడు ఇట్టివాఁ డగుటచే నామె యనేకవిధ ముల విచారించెడిది. అప్పు లందఱును "నీకుమారుఁడు

మంచివాఁడు గాఁడు. ఆతనికి రాజ్యము నీయకుము" అని చెప్పిరి. అహల్యకుఁ గూడ నట్టి సంకల్పమే యుండెను; గాని పేష్వాల బలవంతమువలన ఆతఁడే రాజ్యమునకు వచ్చెను. వచ్చినను కొలఁదిమాసములకే పరలోకమునకుఁ బోయెను. కుమారుఁడు చనిపోయినందులకు అహల్య వగచుటకు మాఱు ఆనందించెను.

మంచివాఁడో, చెడ్డవాఁడో, మాలేరావు గతించెను. ఇప్పు డిందూరురాజ్యమును పాలింపవలసినవారెవరు? అప్పుడు గంగాధరయశవంతు అను నాతఁడు అహల్యాబాయికి దివాను గా నుండెను. ఆతఁడు "మీజ్ఞాతులలో నొకకుఱ్ఱవానినిఁ బెంచు కొనవలసినది. ఆతఁడు పెద్ద యగునంతవఱకును ఆతనిపేర నేను పాలనము జరిపెదను మీరు కొన్ని గ్రామములు పుచ్చు కొని వాని యాదాయమును ఖర్చుబెట్టుకొనుచు స్వేచ్ఛగా నుండవలసినది" అని చెప్పెను; గాని యందుల కంగీకరింపక అహల్య "నేనే రాజ్యము చేసెద" నని చెప్పెను.

దీనిమీఁద దివానునకు దుర్బుద్ధి పుట్టెను. అప్పుడు పూనాలో మాధవరావు పేష్వాయై యుండె ననియు, నాతని తమ్ముఁడు రఘునాథరావు అనియు ఇదివఱకుఁ జెప్పియుంటిమి గదా? రఘునాథరావు అన్న వెనుక అగస్త్యభ్రాతవలె నుండుట కంగీకరింపక స్వతంత్రముగ నొకరాజ్యమును సంపాదించు టకు ఆలోచనలు చేయుచుండెను. ఈసంగతి విని గంగాధర

యశవంతు "హోళకరువారి రాజ్యమునకు ఇప్పుడు వారసు లెవరును లేరు; గావున మీరు వచ్చినచో దీనిని సులభముగ స్వాధీనము చేసికొనవచ్చు" నని వర్తమానము చేసెను. ఈ వార్త వచ్చుటయే తడవుగ రఘునాథరావు ఏఁబదివేల సైన్యమును వెంటనిడుకొని మాళవదేశము మీఁదికి బయలు దేరెను.

ఇది విని అహల్యా మందహాసము గావించెను. "లోకములో దుష్టులలో నెన్ని రకములున్నవి"యని యనుకొని యామె "లోకవృత్తము భూతవర్తమానములు మీకుఁ దెలిసియే యున్నది. శ్రీమాన్ మల్హారిరావుహోళకరువారు ఎన్నో కష్టముల కోర్చి పేష్వాల రాజ్యమును స్థిరపఱుచుట మీకుఁ దెలిసినదే. అట్టి పేష్వాలు నేఁడు వారి సుబేదారు మరణానంతరము వారి వారసుల మగు మావలన యథాపూర్వముగ సేవలు చేయించుకొనుటకు మాఱు మాచిన్ని రాజ్యమును హరించుటకు వచ్చుచున్నారు. మన మందఱమును వారికి సామంతులము. నేఁడు నారాజ్యమును హరించినవారు రేపు మీరాజ్యములను హరింపఁ దలఁపవచ్చును; గావున ఈసమయమున మన మందర మొక్క మాటమీఁద నుండుట మంచిది. నారాజ్యమునకు అపాయశంక కలిగినది గనుక నేనిట్లు చెప్పుచున్నానని మీరు భావింపవద్దు. మీరు అందఱును నాకు సాయము చేయవలసినది" అని భోఁసలా,గాయకవాడ్, ధాభాడే మున్నగు రాజులకు వర్తమాన మంపెను. "మీకు సందేహాము

వలదు. మామూసైన్యములతో మే మందఱమును మీకు సాహాయ్యముగా వచ్చుచున్నా"మని యందులకు వారు ప్రత్యుత్తర మంపిరి.

పిదప అహల్యాబాయి సంగతిసందర్భము లన్నియుఁ దెలుపుచు మాధవరావుపేష్వావద్దకు దూత నంపఁగా "ఈసంగతి మాకుఁ దెలుపనక్కఱ లేదు. మీచర్యలకు మేము అడ్డురాము. మీరాజ్యమును గుఱించి ఎవరు దుశ్చింతనము చేయుదురో వారిని దండింపవచ్చును" అని యాతఁడు ప్రత్యుత్తర మంపెను. దీనితో అహల్యకు ఎక్కడలేని ధైర్యము వచ్చెను. "నేను స్త్రీని అగుట యథార్థము; గాని యట్లని యెవరు నాయెడల దుశ్చింతతో నుందురో వారిని బ్రతుకనీయను. నాపూర్వులు శూరులు. వీరులు. వారి శౌర్యవీర్యములు పేష్వాల రాజ్యశ్రీకి అవలంబనము లైనవి. నేఁటికిఁ గూడ ఇందూరుప్రభువులు పేష్వాల రాజ్యలక్ష్మికి కనుసన్నల మెలఁగు నౌకరులు. ఈసంగతిని గమనింపక వారు మామీఁదికి యుద్ధమునకు వచ్చెదరేని నాయభ్యంతరము లేదు. నేను శస్త్రమును ముట్టకయే యొక వెదురుకఱ్ఱను మాత్రము చేతఁదాల్చి బయలుదేరితి నేని పేష్వాల రాజ్యలక్ష్మికి అపాయము కలుగకమానదు. గనుక మాప్రభువు లగుపేష్వాలు మావలన యథాపూర్వకముగ సేవలు చేయించుకొనవలసినది. అట్లుగాక వారు మారాజ్యమును హరింపఁబూనుదు రేని ఇది కొనసాగని పని యనియు, పయిగా వారి రాజ్యమునకే భంగము వచ్చు ననియు నమ్మ

వలసినది" అని యొక నిండుసభలో నహల్య యుపన్య
సించెను

ఈపలుకులు రఘునాథరావునకు ములుకులై నాటెను.
అగుట నాతఁడు సందేహించుచుండఁగా గంగాధరుఁడు
"అక్కడి రహస్యము లన్నియుఁ దెలిసిన నేను ఉండఁగా మీరు
ఇట్లు కొంకుట ధర్మము గాదు. ముందునకు నడువుఁడు" అని
చెప్పెను. రఘునాథరావు అట్లే చేసెను.

అహల్య యంతటితో నూరకుండ లేదు. ఆమె రఘునాథ
రావువద్దకే యొక దూత నంపెను. "మీరు పురుషులు.
బ్రాహ్మణులు. స్త్రీనైన నాతో యుద్ధము చేయుట మీకు తగని
పని. యుద్ధములో మీరు గెలిచితిరేని స్త్రీని జయించినందు
లకు లోకములో మీకు ప్రశంస రాదు. ఓడితిరేని స్త్రీ చేతిలో
పరాజయము పొందిన మీయపకీర్తిని గుఱించి లోకము ఏమి
చెప్పుకొనునో యోచించుకొనుఁడు. మీదంభములను జూచి
నేను ఊరకుండుదానను గాను యుద్ధము తప్ప దండురా?
రండు. మేము సిద్ధముగనే యున్నాము." అని యామె రఘు
నాథరావునకు చెప్పిపంపెను ఇప్పటి కాతనికి చైతన్యము
వచ్చెను. "ఇది చాల తప్పు పని" యని యాతఁడు నిశ్చయించు
కొని తన యుద్దేశమును మార్చుకొని "మేము మల్హారిరా
వును, ఖండేరావును, మాలేరావును చనిపోవుటచే దుఃఖసము
ద్రమున మునిఁగియున్న మిమ్ము పరామర్శచేయుటకు వచ్చుచు

న్నాము; గాని వేలు గాదు" అని కబురు చేసి పరిమిత పరివారముతో వచ్చి యామెను పరామర్శించి వెడలిపోయెను.

ఇట్లు కారు క్రమ్మిన మేఘమాలిక విచ్చిపోయినతరువాత నామె నిశ్చింతతో రాజ్యపాలనము చేయసాగెను తుకోజీరావు అను దూరపు బంధువు నొకనిని మంత్రిగా నేర్పఱచికొని యామె సకలమును స్వయముగా విచారణ సేయుచుండెను. తుకోజీ సన్మార్గుఁ డగుటవలన తన ప్రభ్విణియెడల నేమియు దుశ్చింతచేయక ఆమె యాజ్ఞ నెప్పుడును జవదాటక మాతృభావముతోఁ బ్రవర్తించుచుండెను. అహల్యగూడ నాతని యెడల చాల గౌరవమునే చూపెడిది; గాని ఆతనివలన తప్పు వచ్చినచోమాత్రము సహించెడిది గాదు. ఇందూరుపట్టణములో దేవీచందు అను నొక గొప్పసాహుకారు మృతి చెందెను ఆతని కేమియు సంతానము లేదు; గాని అనంతధనము కలదు. అంతట తుకోజీ ఆతని యాస్తి యంతయు వేలము వేయించి ఆసొమ్మును బొక్కసమునకుఁ జేర్చెను; గాని వెంటనే యీసంగతి రాణికిఁ దెలియవచ్చెను. అంతట నామె ఆసాహుకారు భార్యను రప్పించి యామె సొత్తు అంతయు తిరిగి యిప్పించి "నీవు నీచిత్తమువచ్చిన బాలుని పెంచికొని నీవంశమును నిలుపుకొనుము" అని యాజ్ఞ యిచ్చెను. ఆపట్టణమునందే తాపీదాసు, బనారసుదాసు అని యిరువురు అన్నదమ్ములుండిరి. వారు చాల శ్రమపడి నాలుగు లక్షల రూపాయలు సంపాదించి సంతానము లేకయే మరణించిరి. అప్పుడు తాపీ

దాసుభార్య అహల్యచెంతకు వచ్చి "అమ్మా, నాభర్తయు, నామఱఁదియు ననంతధనమును సంపాదించిపోయిరి. ఇప్పుడు మాకెవరును లేరు. మేము మీపాలనమున సుఖపడుచున్నాము; గావున మాధనమంతయు మీరు స్వీకరింపవలసిన" దని ప్రార్థించెను. గాని యహల్య యందుల కంగీకరింపక "నీభర్తయు, నీమఱఁదియు చెమట యూడ్చి సంపాదించిన ధనమును నేను తాఁకను. దానిని పుచ్చుకొనుటకంటె లోకములో ఘోర పాపము లేదు. ఆధనమును నీయిచ్చవచ్చినటుల వెచ్చుకొనుటకు మీకు సర్వాధికారములు గలవు; గావున నీవును నీతోడికోడలును గలిసి మీభర్తల పేరిట నేదయిన ధర్మకార్యములు చేసి వారియాత్మలకు సుగతిని గలిగించి మీస్వర్గమార్గమును నిష్కంటకము గావించుకొనుఁడు" అని చెప్పి యామెను పంపివేసెను. ఆమెయు రాణి చెప్పినట్లు తన తోటికోడలితో నాలోచించి తన భర్తపేరిటను మఱఁదలి పేరునను గొప్ప దేవాలయమును ఏటివద్ద నొక చక్కని ఘట్టమును కట్టించి ప్రఖ్యాతి వడసెను.

ఈమె చేసిన దానధర్మములకు లెక్కలేదు. ఈమె యెప్పుడును ధర్మమును గుఱించియే చింతించుచుండెను. ఇరుగు పొరుగురాలు లందఱును ఈమెను చాల గౌరవముతోఁ జూచుచుండిరి. ఎవరును ఆమెయెడల తప్పుదారి త్రొక్కుటకు సాహసింపఁజాలకుండిరి. ప్రజ లందఱును ఆమె పేరు చెప్పి

"మమ్ము రక్షించుటకు మానవజన్మ మెత్తిన దేవి" యని కొని యాడుచుండిరి.

ఒకప్పుడు ఉదయపురపురాణా అహల్య యెన్నివిధములఁ జెప్పినను వినక రామపురా యను గ్రామమును దీసికొనుటకు సిద్ధపడెను. అప్పుడు సైన్యము నంతను దీసికొనిపోయి తుకోజీ దక్షిణమున యుద్ధము చేయుచుండెను. అగుటచే రాజధానియందున్న సైన్యము చాల స్వల్పమే యైనను సందేహింపక దానికి శఫరీభాయీ యనువానిని నాయకునిఁ గావించి పంపెను. రాణా యోడిపోయి అహల్యవద్దకు వచ్చి శరణుజొచ్చెను. అహల్య యాతనిని క్షమించెను.

ఇట్లు సకలవిధములను స్తుత్యర్హముగాఁ గాలము గడచి పోవుచుండెను. ఇట్లుండఁగా మంచాబాయి భర్త కాలధర్మము నొందెను. అంతట మంచాబాయి భర్తతో సహగమనము చేయుటకు సిద్ధపడెను. అహల్యాబాయి యనేకవిధముల బోధించెను; గాని ప్రయోజనము లేకపోయెను.

పిదప కొంతకాలము అహల్య ఇట్లే రాజ్యమును పాలించి పుణ్యలోకమునకుఁ బోయెను. ఆమె పరమపదించిన దినమున ప్రజ లందఱును చాల దుఃఖించిరి.

---

# మైనాబాయి.

ధారానగరసంస్థానాధిపతి యగు ఖండేరావు బడోదా సంస్థానాధీశుని కొమార్తను పెండ్లియాడెను. ఆమె కాపురమునకు వచ్చిన స్వల్పకాలమునకే గర్భవతి యయ్యెను; గాని భర్త చనిపోయెను. పిదప నామె పుట్టినింటికిఁ బోయి కుమారునిఁ గని తానుగూడ మరణించెను. శిశువునకు ఆనందరావు అని పేరుపెట్టి మాతామహుఁడు పెంచెను.

ఆనందరావు యుక్తవయస్కుఁ డైన పిదప సొంతసంస్థానమునకు వచ్చెను. రంగరావు అను ప్రధాని తక్కినయుద్యోగుల నందఱను లోపుచేసికొని ఆనందరావును తఱిమివేయుటకుఁ బ్రయత్నించెను; గాని ప్రజ లందఱును తమప్రభువునెడల భక్తిని విడువక మంత్రిప్రభృతులను ఓడించి ఆనందరావునకే పట్టము గట్టిరి.

ఆనందరావు సింహాసన మెక్కెను; గాని ఆతనికిఁ గలిగిన చిక్కులకు అంతము లేదు. ఒకమూల ఓడిపోయిన రంగరావుప్రభృతులు కుట్రలు సాగించుచుండిరి. వేఱొకదెస సింధేహోళకరులు బాధింపఁజొచ్చిరి. ఆనందరావు ఈచిక్కుల

నన్నిటని ఎట్లో సాధించుకొని వచ్చుచుండెను; గాని యంతలో నేదో వ్యాధివలన నాతఁడు స్వర్గస్థుఁ డయ్యెను.

మైనాబాయి ఈయానందరావు భార్య. ఆమె భర్త పోవునప్పటికి గర్భవతియై యుండెను. కంటకావృత మైన రాజ్యము ఆమె చక్కఁజేయవలసియుండెను. అయితే మురారి రావు అను జ్ఞాతి యొక్కఁడు లంచము లిచ్చి ఉద్యోగుల నందఱను స్వాధీనపఱచికొని తుదకు సంస్థానమునుగూడ వశ పఱచికొనియెను. ఇట్టి విపత్సమయములోఁగూడ మైనాబాయి చిత్తస్థైర్యమును గోల్పోవక బాగుగ నాలోచించి ఇట్టిస్థితిలో ప్రసవసమయమున ధారానగరమున నుండుట మంచిది గాదు అని నిశ్చయించుకొని యిందూరుపట్టణమునకుఁ బోయెను.

నెలలు నిండిన తరువాత మైనాబాయి కుమారునిఁ గనియెను. "భయము వలదు. నీయెడల నీశ్వరానుగ్రహము గలదు. కుమారుఁడు కలుగుటయే యందుల కుదాహరణము. ఇఁక ధారానగరసంస్థాన మెట్లును నీదే" యని హితచింతకు లామెకు ధైర్యము గొలిపిరి. పిల్లవానికి రామచంద్రరావు అని నామకరణము చేయఁబడెను.

"ఈశ్వరుఁ డవలంబము నిచ్చినాఁడు. ఇఁక నూరకుండ వలసిన యగత్యము లేదు" అని తలఁచి మైనాబాయి కుమా రుని నిమిత్తము మఱల ధారానగరసంస్థానమును స్వాధీనము

చేసికొనుటకు నిశ్చయించుకొనియెను. ఇక్కడ నిట్లుండఁగా నచ్చట ధారానగరదుర్గమును పాలించు ప్రభువు మంచివాఁడగుటవలన మురారిరావుపక్షమును విడిచి "నాకు రామచంద్రరావు ప్రభువు" అని ప్రకటించెను. ఇట్లు క్రమక్రమముగా పరోక్షమునందే ధారానగరమున బాలరాజునకు బలము కలుగఁజొచ్చెను.

ఇది యంతయుఁ జూచి మురారిరావు "కథ అడ్డముగా తిరుగుచున్నది" అని భావించి కపటము సేయుటకు నిశ్చయించుకొనియెను. "నేను మీయెడల నెప్పుడును ద్రోహచింత నెఱుఁగను. నావలన నేమయిన నపరాధములు జరిగిన పక్షమున మన్నింపవలసినది. ఇఁక ముందు మీయాజ్ఞ ననుసరించి ప్రవర్తింతును" అని మధ్యవర్తులద్వారా మైనాబాయికి వర్తమాన మంపెను. మోస మెఱుఁగని రాణి ఈశ్వరలీల యిట్లున్నదని భావించి పిదప మురారిరావు ధారానగరమునకు రావలసిన దని యాహ్వానింపఁగా వెంటనే బయలుదేఱెను.

మార్గమధ్యమున మురారిరావుపక్షమువా రనేకు లామెను కలిసికొని అనేకవిధములఁ బొగడి "మురారిరావు మీయెడల నిప్పుడు మిపుల భక్తుఁడై యున్నాఁడు. అతఁడు గతమునకు చాల పశ్చాత్తాపపడుచున్నాఁడు" అని బొల్లిమాటలు చెప్పి యామెను మఱింత నమ్మించి ధారానగరమునకుఁ గొనివచ్చి యొక గృహమున విడియించి మురారిరావును దోడి తెచ్చుటకు వెడలిరి.

వారట్లు యిల్లు విడుచుటయే తడవుగ విచ్చుకత్తులు బూనిన భటులు వచ్చి మురారిరావుపక్షమున యిల్లు ముట్టడించిరి. క్షణములో నీసంగతి రాణికిఁ దెలిసెను. ఆమెను నమ్మియున్న భటులు కొందఱు లోపలకుఁ బోయి "ఇట్టి యాపద వచ్చినది. ఇప్పుడు విచారించుచుఁ గూర్చుండిన ప్రయోజనము లేదు. ఇప్పుడు తరణోపాయము చూడవలెను. వెంటనే మీరు పురుషవేషము ధరించి తప్పించుకొనిపోవుట మంచిది" అని చెప్పిరి. అందుమీఁద నామె యిట్లు చెప్పెను. "మీరు చెప్పినది యొక యుపాయమే; గాని నేను దాని ననుసరింపఁజాలను. నా పుట్టినింటివారును, అత్తింటివారును గూడ శూరులు. అట్టి వంశములోఁ బుట్టి యిట్టివంశము మెట్టి నేను పాఱుబోతుల పని చేయనేల?"

ఇది యిట్లుండఁగా రాణిని మిక్కిలి ప్రేమించు నొక దాసి తన కుమారు నక్కడ నుంచి యుక్తితో బాలరాజు నెత్తుకొనిపోయి కోటలో నున్న దుర్గాధిపతి కప్పగించెను. పిదప మైనాబాయి "రాజు సురక్షితుఁ డయ్యెను. ఇఁక నేను ఏమయినను విచారము లేదు. అయినను మనము ఊరకుండనేల? మన దేహమున నీరక్తము ప్రవహించుట లేదా? శత్రువులు మనతోఁ బోరవచ్చినచో వారిని ఊరక విడువనేల? అధములు, అన్యాయమునకు ఒడిగట్టినవారు నగు శత్రువులు అంత ధైర్యముతో వచ్చినచో మనమేల వెనుదీయవలయును?" అని చెప్పెను. ఇది విని అక్కడ నున్న స్వల్పపరివారము పోరు

షము తెచ్చుకొని రాణి చెప్పినట్లు చేయుటకు నిశ్చయించు కొనియెను.

అవసరమైనచో యుద్ధము చేయుట కిట్లన్ని యేర్పాట్లును చేసికొని మైనాబాయి తన స్థితిగతు లన్నియుఁ దెలుపుచు "సాహాయ్యము జేయవలసిన" దని శిందేకును, ఇంగ్లీవారి కిని కబురు చేసెను; గాని వారెవరును మాట్లాడలేదు. అయితే యీసంగతి మాత్రము మురారిరావునకుఁ దెలిసిపోయెను. తోడనే "చూడు ఈయధముురాలి నేమిచేసెదనో ? నేలఁబెట్టి కాలరాయకపోయిన నేను మురారిని గాను" అని యాతఁడు నిప్పులు గ్రక్కసాగెను. అప్పుడు మైనాబాయి యిట్లు వర్త మానము చేసెను.

"నీవెంత గింజుకొనినను ప్రయోజనము లేదు. ధారా నగరసంస్థానప్రభు వగు రామచంద్రరావు నీకు చిక్కఁడు. ఆతఁడు రేపల్లెలో కృష్ణునివలె నిన్ను సంహరించుటకు పెరుగు చున్నాఁడు. ఇఁక నన్ను నీవు ఏమి చేసినను నాకు చింతలేదు. ఇట్లని నీకు నేను స్వాధీన మగుట కలలోనివార్త నాకంఠములోఁ బ్రాణము లుండఁగా నీవు నిశ్చింతుఁడవు గాఁజాలవు."

ఇది విని మురారిరావు యుద్ధమునకు సిద్ధపడెను. గాని బడోదానుండి మంత్రి తమ్ముఁడగు సఖారాంచిమణాజీ యను నాతఁడు పెద్దసైన్యముతో వచ్చుచున్నాఁడని తెలిసెను. ఇది తెలియుటయే తడవుగ మురారిరావు పట్టణము విడిచి పాఱి పోయెను.

పిదప మైనాబాయికి పట్టణము సులభముగ స్వాధీన మయ్యెను. వెంటనే యామె కుమారునిఁ జేరుకొని యాతని పేర పరిపాలనము ప్రారంభించెను. కొంతసేపటికి సఖారాం చిమణాజీ వచ్చి చేరుకొనియెను. ఆతఁడు రక్తపాతము లేకుండ నగరము చేఁజిక్కినందుల కానందించెను; గాని రాణి స్వయముగ రాజ్యము చేయుటకు సమ్మతింపక పోయెను. తనకును, తనరాజునకును గూడ కొంతలాభము కలుగవలయు నని యాతని యభిప్రాయము; గాని మైనాబాయి యీరెండింట నొకదానినిఁ గూడ కొనసాగనీయలేదు. తుదకు సఖారాం చిమణాజీ మంత్రిగా నుండుట కంగీకరించెను.

ఈవిధమున అనేకవిపత్పరంపరలు సంభవించుటచే సంస్థానమునకు చాల అప్పు పెరిగెను. మంత్రియు రాణియుఁ గూడ అనేకోపాయములు పన్నిరి. ఈసందర్భమున మంత్రి చచ్చిపోయెను. బాపూరఘునాథరావు అను నతఁడు దివాన య్యెను.

మఱలఁ రాణియు మంత్రియు ఆలోచనలకుఁ బ్రారంభించిరి. అనేకము లగు ఊహాలు తట్టెను. చాల ఎత్తులు వేసిరి; గాని ప్రయోజనము కలుగలేదు. "ఇఁక నిది గాదు మార్గము" అని చెప్పి రాణి పరదేశములమీఁదికి దండయాత్రలకు బయలు దేఱెను. చాల ధనము సంపాదించి యీదండయాత్రలవలన వచ్చిన ఆపదల నన్నిటినిఁగూడ తొలఁగించి రాణి సంస్థానము

ననేకవిధముల బాగుచేసి కొమారుని పెంచి పెద్దఁజేసి పరిపాలనమునందలి మర్మముల నన్నిటిని ఉపదేశించి యుక్తసమయమున నాతనికి రాజ్య మిచ్చి బ్రతికి యున్నంతకాలమును ఈశ్వరార్చనము చేసి పిదప పరలోకమునకుఁ బోయెను;

---

# మల్లమదేవి.

---

బొబ్బిలిసంస్థానేశ్వరుఁ డగు రావు గోపాలకృష్ణరంగా రావు చక్కఁగా రాజ్యము నేలుచుండెను. పరిపాలనమున స్వయముగ దక్షుఁ డగుటవలనను, తమ్ముఁ డగు వెంగళారాయుఁడు, చెలికాని వెంకయ్య, తాండ్ర పాపారాయఁడు మున్నగు బంధువులను సకలవిషయములయందును చేదోడువాదోడుగ నుండుట వలనను సంస్థానమును బరిపాలించుట యాతనికి విలాసముగ నుండెను.

ముజఫరుజంగు అను తురుష్కుఁడు తన తాత తనకు చేసిన వాగ్దానముప్రకారము హైదరాబాదు సంస్థానము తన స్వాధీన మగునట్లు సాయము చేసినచో ఉత్తరసర్కారులు మీకిచ్చెద నని పరాసువారి సాయము గోరెను. పుదుచ్చేరిలో నప్పుడు ఫ్రెంచిగవర్నరుగా నున్న డూప్లే యందుల కంగీకరించి యత్నము చేసెను. ముజఫరుజంగు తన వాగ్దానమును చెల్లింపవలసినవాఁ డయ్యెను. అపుడు నవలక్ష కళింగాధినాథుఁ డగు విజయరామరాజు అందులకు అంగీకరింపక "పరాసులు మనకు క్రొత్త. నేఁడు మీకు సాయము చేసి యొకళ్లను నాశనము చేసిరి. రేపు మీకంటె నధికముగ నాశ పెట్టినచో నిన్ను

నాశనముచేసి వేటొకనికి సాయము చేయుదురు. కావున వారికి ఉత్తరసర్కారు లిచ్చి బలవంతులను గావింపకుము" అని ముజఫరుజంగుతో రాయబారములు నడపెను.

ఈసంగతి పరాసులకుఁ దెలిసెను. ఏమి చేయవచ్చును? ఉత్తరసర్కారులయం దెల్ల విజయరామరాజు చాల గొప్ప వాఁడు. ఆతనికి చాల పలుకుబడి కలదు. ఆతఁ డడ్డైనేని ఉత్తర సర్కారులలో ప్రవేశము గలుగదు. ఈవిషయము లన్నియు చక్కఁగ యోచించుకొని డూప్లే "మీరు అడ్డురావలదు. మీకే మియు ఇబ్బంది లేదు. పయిగా రాజమహేంద్రవరము సర్కారును శ్రీకాకుళము సర్కారును తక్కువ శిస్తునకు మీకు కాలున కిచ్చెదము" అని రాజుతో రాయబారము సాగిం చెను.

రాజునకు ఇది చాల లాభకరముగా తోఁచెను. ఇది వఱకు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులలోని జమీందారులును, పాళెగాండ్రును, తనతో సమానులు గాక పోయినను తనకు సామంతులుమాత్రము కారు ఇప్పుడు రాజ మహేంద్రవరశ్రీకాకుళసర్కారులు తన వైనచో వారంద ఱును తన శ్వేతాతపత్రమునీడకు వత్తురు. ఈసంగతి యోచించు కొని రాజు అందుల కంగీకరించెను. ఉత్తరసర్కారులు నిరా ఘాటముగ పరాసులకు స్వాధీన మయ్యెను.

ఈసంగతి బొబ్బిలివారికి తెలియవచ్చెను. ఇది యిట్లు జరి

గినచో ఇంతవఱకును హైదరాబాదు నవాబుచేతి క్రిందనున్న తాము తోటి విజయరామరాజునకు పన్ను కట్టవలసివచ్చెను ఇంతకంటె అవమానకర మేమున్నది? ఇదంతయు చక్కఁగా యోచించుకొని వారు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులు విజయరామరాజునకు రాకుండఁ జేసిరి.

దీనితో విజయరామరాజునకు బ్రహ్మాండమైన యాగ్రహము వచ్చినది. "నాకు సంక్రమించెడి రాజ్యమును రాకుండఁ జేసినారు; గావున బొబ్బిలికోట నేలకున్న నేను క్షత్రియుఁడను గాను" అని యాతఁడు శపథము దాల్చెను. ఇరువురును గూడ పిదప క్రోధకారణములను పెంచుకొనిరి.

కొన్ని దినములు గడచిన తరువాత ఈగడబిడలో శిస్తులు బకాయిపెట్టిన జమీందారులవద్ద వసూలుచేయుటకు హైదరుజంగు సాహాయ్యముతో బుస్సీ బయలుదేఱెను. ఆతఁడు రాజమహేంద్రవరమువద్ద కోటిలింగక్షేత్రమున మకాముచేసి జమీందారుల కందఱకును తాఖీదులు పంపెను. జమీందారు లందఱును వచ్చిరి. విజయరామరాజుగూడ వచ్చెను; గాని బొబ్బిలివారు రాలేదు. విజయరామరాజు తాను బయలుదేఱుటకు ముందు కలిసిపోదము రమ్మని బొబ్బిలివారికి వార్త నంపెను; గాని వారు ఆ రాయబారిని కొట్టి అగౌరవపఱచిరి.

రాజునకు మంచి యవకాశము దొరకెను. ఆతఁడు

ముందు హైదరుజంగును స్వాధీనపఱచికొనియెను. పిదప నిరు వురును గలిసి బొబ్బిలివారిమీఁద బుస్సీకి అసూయ కలిగించిరి. "నాతాఁకిదులను వీరేల లక్ష్యము చేయరు?" అని బుస్సీ ఆగ్రహము వహించెను. ముందు మకాములో రావువారి రాయబారులు వచ్చి బుస్సీతో మాట్లాడిరి. "మావిరోధి యగు విజయరామరాజు మీవద్ద నుండుటచే మాకు గౌరవములు జరుగవని భయము. మీ రభయ మిచ్చెద రేని మాదొరను తోడుకొని వచ్చెద" మని వారు చెప్పిరి. "అందఱు దొరల కంటె వెలమదొరల యాధిక్యమేమి? ఎవరికిని జరుగని యవమ ర్యాద మనవద్ద వారి కేల కలుగును? విజయరామరాజు మన వద్ద నుండిన వారికి మూఁడు కీడేమి? వారు తప్ప మనవద్దకు మఱెవరును రాఁగూడ దని వారి యభిప్రాయమా? రాజునకును తమకును విరోధము లుండిన వాని దారి నవి యుండును. మనవద్ద వాని ప్రసక్తి యేమి? రాజు తమమీఁద మనవద్ద కొండెములు ఏమియుఁ జెప్పలేదే? చెప్పెనే యనుకొనిన వానిని మన మేల విందుము? కలిసిపోద మని రాజు వార్త నంపఁగా ఆదూతను అగౌరవపఱుపవలసిన యావశ్యకము రావువారి కేమి వచ్చెను? ఇదంతయు తిరుగుబాటునకు లక్ష ణము. ఇఁక వారు మన చెంతకు రానక్కఱ లేదు" అని హైదరుజంగును బుస్సీయుఁగూడఁ బలుకుకొనిరి ఈసమయము కనిపెట్టి "రాజు బొబ్బిలిని నాకు పట్టము కట్టినచో బకాయి యంతయు నిప్పుడే తీర్చివేసెదను. ఎప్పటికప్పుడు శిస్తు చెల్లించు

చుందును. ఇప్పటివలెనే మీాతాఖీదులు వచ్చిన వెంటనే ఎక్కడకు రమ్మనిన అక్కడకు వచ్చెదను'' అని చెప్పెను. బుస్సీ రాజునకు మాట యిచ్చెను.

ఇంకను ముందునకుఁ బోయిన తరువాత మఱల వెలమ వారి రాయబారులు వచ్చిరి. "మాదొర తిరుగుబాటు యెఱుఁగడు. మీాయెడల వారికి గల భక్తికి పారము లేదు. చిన్న దొరగారి పెండ్లి యగుచుండుటచే కదలుటకు వీలులేకుండ నున్నది. ఆగ్రహము వల''దని వారు చెప్పిరి; గాని బుస్సీ కామాటలు నచ్చలేదు. "కోట కాళీ చేసి వెడలిపోవలసినది. మేము బొబ్బిలిని విజయరామరాజునకు పట్టము కట్టెద'' మనియు, "మీారు ఇఁకనైన మాయాజ్ఞలకు బద్ధులైయుందురేని మఱియొక పరగణా మీాకిచ్చెద'' మనియు ఆతఁడు బదులు చెప్పెను.

రాజీ కుదురలేదు. పరాసువారు బొబ్బిలి ముట్టడించిరి. అప్పుడుగూడ రావువారు మఱల సంధిప్రయత్నము చేసిరి. "బొబ్బిలి విడిచిపొం''డని బుస్సీ చెప్పెను. "మేము విడువము'' అని రావువారు చెప్పిరి. యుద్ధము ప్రారంభ మయ్యెను.

రాజు సైన్యముతోఁ గూడ పరాసువారి సైన్యము నలుపది వేలు. బొబ్బిలి రాణువ నాలుగువేలు మాత్రమే. వెలమలు చాల నావేశముతోఁ బోరిరి. అయినను ప్రయోజనము కలుగలేదు. కొంతసేపటికి వారికి అపజయశంక వొడమెను

"పురుషు లందఱును యుద్ధములోఁ జచ్చిపోవలసినది" అని యాజ్ఞాపించి రంగారావు "అంతఃపురము చక్కఁబెట్టుము" అని చెలికాని వెంకయ్యకుఁ జెప్పెను.

వెంకయ్య కత్తి పుచ్చుకొని అంతఃపురము ప్రవేశించెను. మల్లమ్మ యాతనిం గాంచి "వెంకయ్యా, రావువారి స్థితి యింతకు వచ్చినదా? అయినను బెంగలేదు. వెలమలు ఒకరికి లొంగరు. అంతియే చాలును. బొబ్బిలిబెబ్బులి యింకను బ్రతికి యుండఁగా నాకు వైకుంఠయాత్ర. ఇంతకంటె అదృష్ట మేమున్నది? అయిన నంతఃపుర మంతయుఁ దిరిగి రమ్ము" అని చెప్పెను. వెంకయ్య అంతవఱకును వంచికొనియున్న మొగము నెత్తి జేవురింపఁజేసికొని "ఒకటి రెండు" అని లెక్కించుచు అడ్డు లేని యంతఃపుర మంతయు కలయదిరిగెను.

ఇట మల్లమ కుమారుఁ డగు వెంకటరాయని దాసి వెంకటలక్ష్మి చేతి కిచ్చి దీవించి దోసెడువరాలు దాని చేతఁబోసి "నానాయన నెట్లయిన నీవు చామర్లకోటయందలి నాచెల్లెలు జగ్గమ్మవద్దకుఁజేర్పుము. బ్రతికియుండినచో రావువారి పగదీర్చుటకు—విజయరాముని చిత్రవధ చేయుటకు ఈచిన్ని మొలక చాలును" అని చెప్పి పంపివేసెను. ఇంతలో అపూర్వవ్యాధశిఖామణియగు వెంకయ్యయక్కడకువచ్చెను. మల్లమ్మ "తమ్ముఁడా, వచ్చితివా?" యని "రావువారిపక్షము అక్రమము కాదేని, ఈశ్వరుఁడు న్యాయమును పాలించునేని, నానాథుఁడు ఏపాపము

నెఱుఁగఁ జేని, నేఁడు సంఘమరణము పాలైన యిందఱు వెలమకాంతలును స్త్రీత్వమునకు ఆదర్శకురాండ్రేని, నేను రావు గోపాలకృష్ణరంగారావుదొరవారి పదదాసి నేని అన్యాయమున కొడిగట్టిన రాజు మాకోటముందు దిక్కుమాలిన చావు చచ్చుఁగాక" అని మూడుమారులు తూర్పుమొగముగా దుమ్మెత్తిపోసి వెంకయ్యచేత నున్న కత్తి పుచ్చుకొని పొడుచుకొని వీరస్వర్గమునకుఁ బోయెను.

---

# పద్మిని.

ఉదయపురము నేలు రాణా లక్ష్మణసింహుఁడు అను నాతనికి భీమసింహుఁడు అను పినతండ్రి యుండెను. ఆతఁడు భీమపరాక్రమశాలి. రాణాకు కుడిభుజమై యుండి యీతఁడు అతని కనేకలాభములను గలిగించుచుండెను.

ఆతని భార్యపేరు పద్మిని. ఈమె సింహళద్వీపాధిపతి యగు హామీరసింహుని కొమార్త. ఈమె పృథివిలో నింతటి సుందరాంగి లేదని ప్రఖ్యాతి వహించెను. ఈసౌందర్యమునకుఁ దోడు అనంతసుగుణము లామెకు వన్నె దెచ్చుచుండెను. ఈమె భర్తకు పదదాసియై అన్యము నెఱుంగక మహాపతివ్రత యని ప్రఖ్యాతి వడసెను.

ఆకాలమున డిల్లీని అల్లాయుద్దీను అను ఖిల్జీవంశజుఁడు పరిపాలించుచుండెను. ఇతఁడు ప్రారంభమున పెదతండ్రిపాదముల నాశ్రయించి పెద్దయై తుద కాతనిం జంపి డిల్లీసింహాసనము నెక్కిన ధర్మాత్ముఁడు.

ఈతఁడు పద్మిని సుందరి యని వినియెను. ఈవినికి మో

హామును బుట్టించెను. తుద కది మిక్కుటమయ్యెను. అప్పు డాతఁ డెట్లయిన పద్మినిని డిల్లీకిఁ దీసికొనిరావలె నని నిశ్చయించుకొనియెను; గాని యది యెట్లు?

ఆలోచనలు ప్రారంభ మయ్యెను. నర్మసచివు లందఱును జేరి యాతనిం బొగడి "పద్మినిం బొందకున్న నీసౌందర్యము, నీచాతుర్యము, నీరసికత, తుదకు నీజీవితముగూడ వ్యర్థ" మని పురి యెక్కించిరి. "మన కిన్ని యాలోచన లవసరము లేదు. రహస్యముగ కుంటెనకత్తెల నంపిన పద్మిని పిట్టవలె యెగిరి నీయంతఃపురమునకు వచ్చి వ్రాలును" అని యొక్కఁడు చెప్పెను. "పద్మినిమీఁద మాదృష్టి పడినది. వెంటనే యామెను డిల్లీకి పంపవలసిన దని వార్త నంపినచో రాజపుత్రులు కిక్కురు మనకుండ నామెను దెచ్చి విడిచిపోయెదరు" అని మఱి యొకఁడు చెప్పెను. "లేకున్న మీకోట నేలమట్టము గావింతు మను మాటకూడ ఆమాటకుఁ జేర్పవలె" నని వేఱొకఁడు చెప్పెను; "భీమసింగు తెలివైనవాఁడు. ఆతఁడు తనకు సొంతముగా ఒక రాజ్యము లేకుండుటకు విచారించుచుండును. 'నీకొక పరగణా యిచ్చెదము. పద్మినినిఁ దెచ్చి యిమ్ము' అని వర్తమాన మంపినచో పని జరుగును" అని యింకొకఁడు చెప్పెను; గాని యివి యేమియు చక్రవర్తికి నచ్చలేదు, ఆతఁడు వీరిని దూరముగా నుండుఁడని చెప్పి ఆమాత్యులను సేనాధిపతులను ఒకచోఁ జేర్చి సలహా లడిగెను. అందఱు నన్ని విధ

ములను జెప్పిరి. తుదకు పర్యవసాన మేమనఁగా? "రాజపుత్రులు చాల పట్టుదలగలవారు. యుద్ధముచేసి అందు జయించినఁగాని మనకు లాభము లేదు,"

ఈనిశ్చయముతో అల్లాయుద్దీను బ్రహ్మాండ మైన సైన్యమును వెంటనిడుకొని వచ్చి చిత్తూరు దుర్గమును ముట్టడించెను. ఈముట్టడికి కారణము తెలియక రాజపుత్రులు కళవళపడుచుండఁగా "పద్మినీదేవి త్రిలోకసుందరి యనియు, ఆమె డిల్లీపాదుషాహా అంతఃపురమున నుండవలసిన దనియు విన్నాము. ఆమె నిమిత్తమే మేము వచ్చినాము. మాపద్మినిని మాకీయవలసినది. లేకున్న చిత్తూరు దుర్గము నేలమట్ట మగును. దుర్గములోని యొక్క ప్రాణిగూడ మిగులదు" అని అల్లాయుద్దీనుని వద్దనుండి రాయబారివచ్చి చెప్పెను.

రాజపుత్రుల క్రోధము మిన్ను ముట్టెను. ఫిరంగి గుండ్లతో వారు యవనునకుఁ బ్రత్యుత్తర మిచ్చిరి.

యుద్ధము ప్రారంభ మయ్యెను. క్రిందనుండి తురుష్కులును కొండమీఁది కోటలో నుండి రాజపుత్రులును ఫిరంగులను, తుపాకులను ప్రేల్చుకొనసాగిరి. అసౌకర్యము లధికమగుటవలన యవనులలో నష్ట మధికమయ్యెను.

కొన్ని దినములు గడచిన తరువాత అల్లాయుద్దీనునకు విజయాశ సన్నగిల్లెను. తుద కాతఁడు "పద్మినిని మా కీయ

నక్కఱలేదు. ఒక్కమాఱు చూపినఁ జాలును. మేము ముట్టడి లేవుకొని వెడలిపోయెదము" అని యాతఁడు కోటలోనికి వర్తమానము చేసెను; రాజపుత్రులు దీనిని గుఱించి దీర్ఘముగ యోచించిరి. "అంతటి బింకములు సన్నగిల్లినపుడు ఇఁక వీడేమి చేయఁగలఁడు;" అని వారు యోచింపఁజాలక పోయిరి. "పద్మిని నీకు ప్రత్యక్షముగఁ గాన్పింపదు. నీకు అంగీకార మేని నీవు ఆమె ప్రతిబింబము నద్దములోఁ జూడవచ్చును" అని ప్రత్యుత్తర మంపిరి. అల్లాయుద్దీను అందులకే యంగీకరించెను.

కోటలోఁ బ్రయత్నము లన్నియు ముగిసిన తరువాత "రావచ్చు" నని వార్త వచ్చెను. తోడనే పాదుషా అలంకరించుకొని ఒంటరిగా కొండమీఁదికిఁ బోయెను. రాజపుత్రులాతనిని చాల గౌరవించి పద్మినీ ప్రతిబింబమును జూపిరి. పాదుషాహా పరమానందభరితుఁడై "ఇదివఱకు మీమర్యాదలు తెలియక మీమీఁదికి దండెత్తివచ్చినాము. మిమ్ము అక్రమముకోర్కె కోరినాము. అపరిచితులమై యున్నపుడు జరిగి పోయిన పొరబాటులను మన్నింపవలసినది. ఇక్కడనుండి డిల్లీ పాదుషాహాలకును, చిత్తూరు రాజపుత్రులకును శాశ్వత మయిన స్నేహబాంధవ ముండవలయు నని నేను కోరుచున్నాను. ఈ రెండు పక్షములవారును ఐకమత్యముతో నున్నచో జగత్తంతయు నేకమయినను భయము లేదు" అని చెప్పెను. రాజపుత్రులు

గూడ ఇందుకనుకూలముగఁ బలికిరి. ఉభయులకును స్నేహ మయ్యెను.

అల్లాయుద్దీను సెలవుదీసికొని బయలుదేఱెను. తురుష్కుని సాగనంపి వచ్చుటకు రాజపుత్రులు భీమసింగున కాజ్ఞాపించిరి. భీమసింగును, అల్లాయుద్దీనును, ఆమాటయు, నీమాటయుఁ జెప్పుకొనుచు కొండ దిగఁజొచ్చిరి.

చాలదూరము వచ్చిన తరువాత ప్రక్కల నున్న తుప్పల నుండి కొందఱు తురకభటులు వచ్చి భీమసింగునిఁ బట్టుకొని కాలుసేతులు బంధించిరి. "భీమసింగు మాకైదీ, పద్మిని మాగుడారమునకు వచ్చునంతవఱకును ఆతఁడు మాబందీ. ఆమె రాకున్న భీమసింగును చెక్కముక్కల క్రిందఁ గొట్టి మేము వినోదముగఁ బెంచుకొనుచున్న పిట్టలకు ఆహారముగాఁ బెట్టెదము" అని పాదుషాహా కొండమీఁదికి కబురు పంపెను.

ఇది విని కోటలోనివా రందఱును డిల్లవోయిరి. లక్ష్మణసింగునకు మీఁది ప్రాణములు మీఁది కెగిరిపోయెను. పద్మినికిప్పు డేమి జవాబు చెప్పవలెను? ఎవరికి నేమియు తోఁచదయ్యెను. అందఱును పాములవలె బుసకొట్టుట తక్క నెవరు నేమియుఁ జేయఁజాలకయుండిరి. రాణా ఎంతసేపు యోచించినను ఏమియుఁ దోఁచక "దర్శన మీయవలెను" అని పినతల్లికి వర్తమానము చేసెను. "ఇప్పుడు దర్శనము లక్కఱలేదు.

పద్మిని మీగుడారమునకు వచ్చును. ఆమె వెంట ఆమెను సాగ నంపుటకు ఆమె దాసీలు ఏడువందలును ఏడువందలపాలకు లలో వచ్చెదరు. వారందఱును విడియుట కొక్క పెద్ద గుడా రమును నిర్మింపవలెను. దానివద్ద మగవాఁడు—బాలుఁడు గూడ నుండఁగూడదు. చూడఁగూడదు. కొంతసేపయిన తరు వాత పద్మిని తన వెంట వచ్చిన దాసీల నందఱను కోటలోనికిఁ బంపివేసి తానొక్కతె మీ స్వాధీన మగును. అని తురు ష్కునకు కబురుచేయవలసిన” దని చెప్పెను. భీమసింగు ఇది విని మొదట ఉలికిపడెను; గాని పిదప అందలి యాంతర్య మును గ్రహించి పరమానందభరితుఁడై అట్లే చేసెను. తురు ష్కుఁ డిందులకు అంగీకరించి సర్వమును సమకూర్చెను.

యుక్తసమయమున ఏడువందల పల్లకులును కోటలో నుండి వచ్చి గుడారమున విడిసెను. పాలకి ఒకటికి పదార్గురు చొప్పున బోయీ లుండిరి.

కొంతసేపటికి అల్లాయుద్దీను ఎదుటకు ఒక సరదారు వచ్చి “భీమసింగునకును, పద్మినీదేవికిని శాశ్వతవియోగము గలుగుచున్నది. ఈసమయమున ఈమెతో మాట్లాడుటకు భీమసింగునకు ఒక్కక్షణ మవకాశ మీయవలెను. ఇది కానున్న నీదేవి కోరిక” యని చెప్పెను. “అట్లయిన అభ్యం తర మేమి;” యని యల్లాయుద్దీను అందుల కంగీకరించెను. భీమ సింగు గుడారము జొచ్చెను. ఇది యైన కొంతసేపటికి కొన్ని పాలకులు కొండమీఁదికి బయలుదేఱెను. అదేమని ఫాదుపా

యడుగఁగా "ఇందు షరతునకు వ్యతిరేక మేమియు లేదు. పద్మినిని సాగ నంపి ఒక్కొక్కదాసి వెడలిపోవుచున్నది" అని ప్రత్యుత్తరము చెప్పఁబడియెను. ఆపల్లకులలో నొకదానిలో గూర్చుండి భీమసింగు కోటలోనికిఁ బోయెను.

ఎంతసేపటికిని ఈసమావేశము ముగియకపోవుటచే అల్లాయుద్దీను త్వరపడఁజొచ్చెను. తుదకు విచ్చుకత్తులు బూనిన రాజపుత్రులు వందలకొలఁది గుడారమునుండి వెలువడి తురుష్కులమీఁదఁ బడిరి. అల్లాయుద్దీను రాజపుత్రులు చేసిన మోసము నప్పుడు గ్రహించి కాళ్లకు బుద్ధిచెప్పెను. క్షత్రియులు తురకలను దొరకినంతవరకును సంహరించి వారి సామగ్రి యంతయుఁ గొనిపోయిరి. పద్మిని నందఱును పొగడిరి.

సంవత్సరము గడచిన తరువాత అల్లాయుద్దీను మఱల దండెత్తివచ్చెను. ఉభయపక్షములవారునుగూడ ఘోరముగఁ బోరిరి. రాజపుత్రులలోఁ బురుషు లందరును యుద్ధములో మడిసిరి. పద్మిని మున్నగు క్షత్రియస్త్రీలెల్లరును అగ్నిగుండములలో నుఱికి ప్రాణములు విడిచిరి. వల్లకాడులతో నిండియున్న చిత్తూరుదుర్గమును అల్లాయుద్దీను స్వాధీనపఱుచుకొనియెను.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# వచన గ్రంథములు.

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| అయిదుగురువొంగలకథలు ... | 0 | 4 |
| అరేబియన్ నైట్సుకథలు ... | 1 | 4 |
| ఈసబునీతికథలు, ప్రథమభాగము, వంగూరి సుబ్బారావు | 0 | 6 |
| డిటో రెండవభాగము ... | 0 | 8 |
| ఋషులచరిత్ర, రాచకొండ అన్నయ్యశాస్త్రిగారు | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు ... | 0 | 8 |
| తాతాచార్యులకథలు ... | 0 | 6 |
| తెనాలిరామలింగనికథలు ... | 0 | 4 |
| దక్కనుపూర్వకథలు ... | 1 | 8 |
| దేశింగురాజుకథ (జంగముకథ) ... | 0 | 6 |
| నలచరిత్ర, చిన్నసైజు పటములతో ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథ ... | 0 | 4 |
| పరిష్యావినోదకథలు ... | 0 | 12 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 6 |
| పతివ్రతలచరిత్ర, మంగిపూడి వేంకటశర్మ ... | 1 | 8 |
| పరమానందశిష్యులకథలు ... | 0 | 3 |
| పురాణగాథలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ... | 0 | 10 |
| డిటో రెండవభాగము ... | 0 | 10 |
| ప్రహ్లాదచరిత్ర, చిన్నసైజు పటములతో ... | 0 | 4 |
| బేతాళునికథలు ... | 0 | 8 |
| భోజకాళిదాసకథలు, ప్రథమభాగము, ఉత్పల వేంకట నరసింహాచార్యులు ... | 0 | 12 |
| డిటో ద్వితీయభాగము, మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భోజునికథలు | ... | 0 | 8 |
| మదనకామరాజుకథలు | ... | 0 | 14 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| మైరావణచరిత్ర | ... | 0 | 1 |
| యజుర్వేదకథాసంగ్రహము, 50 చిత్రకథలుగలది | | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కకథ | ... | 0 | 3 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| వీరాంగనలు, 22 వీరాంగనలచరిత్రలు గలవు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | ... | 0 | 12 |
| వైద్యులకథలు, శివలమల్లు చెన్నాప్రగడ సీతన్న అను ఇద్దరివైద్యుల అద్భుతచికిత్సలుగలవు | ... | 0 | 4 |
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| షేక్స్పియర్ నాటకకథలు, లాంబు వ్రాసినవానికి తెనుఁగు అ. ఉమాకాంతముగారివిరచితము | ... | 1 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రి | ... | 1 | 4 |
| సావిత్రిచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 4 |
| సాక్షి, ఒకటవభాగము, పానుగంటి లక్ష్మీనరసింహరావు | | 2 | 0 |
| ,, రెండవభాగము ,, | ... | 2 | 0 |
| ,, మూడవభాగము ,, | ... | 1 | 8 |
| ,, నాలవభాగము ,, | ... | 1 | 12 |
| ,, ఐదవభాగము ,, | ... | 1 | 0 |
| ,, ఆఱవభాగము ,, | ... | 1 | 0 |
| సాక్షి, 6 భాగములు ఒకేసారికొన్నచో | ... | 8 | 0 |